# అక్షరాల ఆలోచనలు



విశ్వనాథ · శ్రీశ్రీ · వానమామలై
దాశరథి · కుందుర్తి · భరద్వాజ
నారాయణరెడ్డి · ఉత్పల · బాపురెడ్డి
సాహితీ పరిశీలనం





ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యం

# అక్షరాల ఆలోచనలు

(విమర్శన వ్యాస సంకలనం)

ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం

ప్రచురణ




రిజిష్టర్డ్ నెం. 1/64

యువభారతి

సాహితీ సాంస్కృతిక సంస్థ

AKSHARAALA AALOCHANALU : (A Collection of Critical Essays Pertaining to Modern Poetry) by Prof. G. V. Subrahmanyam, Head of the Department of Telugu, University of Hyderabad, A. P.

---



యువభారతి

పచురణ : 123

ప్రథమ ముద్రణ : జనవరి, 1988

ప్రతులు : 1200

ముఖచిత్రాలంకరణ : శ్రీ శీలా వీర్రాజు

ముద్రణ :
ముఖచిత్ర ముద్రణ : బాలాజీ ఆర్ట్ ప్రింటర్స్, చిక్కడపల్లి, హైదరాబాదు.

ఇన్నర్ టైటిల్ ముద్రణ : ఎ. ఎస్. ఆర్ట్ ప్రింటర్స్,
తిలక్ నగర్, న్యూనల్లకుంట, హైదరాబాదు-44.

ప్రతులకు :

యువభారతి కార్యాలయం
ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు
తిలక్ రోడ్, హైదరాబాదు-500 001

మూల్యం : Rs. 20=00



# మా మాట

మన తెలుగునాట దైనందిన జీవితంలో విమర్శ అనేమాటకు విపరీత అర్థం పుట్టుకొచ్చింది. 'ఫలానా వ్యక్తి వ్యవహారం విమర్శనకు గురిఅయింది.' 'అంశాన్ని అనవసరంగా, అనుచితంగా విమర్శిస్తున్నారు' 'లోతుపాతులు తెలియకుండా విమర్శించడం మంచిదికాదు' "నన్నూ నా పక్షాన్నీ విమర్శిస్తే సహించేదిలేదు" వంటి వాక్యాల్లో 'విమర్శ' అంటే 'తప్పు పట్టడం', "దుయ్యబట్టడం", "నెరసు లెంచడం" అనే అర్థాలు ధ్వనిస్తున్నవి. కాని, నిజానికి విమర్శ అనే మాటకు సూక్ష్మ దృష్టితో పరిశీలిస్తే, శాస్త్రదృష్టితో పరిశీలిస్తే "పరిశీలించటం," సత్యాన్ని తెలుసుకునే ప్రయత్నంచేయడం, కొత్త అంశాలను రచనల్లోంచి వెలికితీయడం, వంటి అర్థాలు వస్తాయి సాహిత్య ప్రపంచంలో ఈ అర్థానికే విలువఉంది.

సృజనాత్మక సాహిత్యంతో విమర్శనాత్మకసాహిత్యం చెట్టపట్టాలు పట్టుకుని నడిచినప్పుడే, సాహితీస్రవంతి కళ్మలాన్ని పోగొట్టుకుని తేటబారి ప్రవహిస్తుంది. ఉత్తమ విమర్శకునికి మంచిపాండిత్యం ఉండాలె. నమ్మిన సత్యాన్ని ప్రచారం చెయ్యగల గుండె ఉండాలె. రచనల్లోని కళాత్మకాంశాలను ఔదార్యంతో, నిండు మనస్సుతో ఎత్తిచూపే నేర్పుండాలె. అప్పుడే రచయితల ఆలోచనలో అక్షరమైన వాటిని విమర్శకుడు సాధువాదంతో సమన్వయించి సహృదయులకు అందించ గలుగుతాడు. వచ్చిన ప్రతి రచనను మెచ్చుకునేవాడు విమర్శకుడుకాడు. అట్లాగే వచ్చిన ప్రతి రచనలోనూ దోసగులను పనిగట్టుకుని ఎత్తిచూపి, తాను నమ్మే సిద్ధాంతాలకూ, తనకు నచ్చిన భావాలకు అనుగుణంగా రచయిత వ్రాయలేదని శాపనార్థాలను విసరేవాడు కూడా విమర్శకుడు కాలేదు.

సాహిత్య విమర్శలో ఉన్నత ప్రమాణాలు అందుకొని "సారస్వత సౌరభము", 'నవ్యాలోకము' 'వీరరసము', 'రసోల్లాసము', 'ఆంధ్ర సాహిత్య విమర్శ-ఆంగ్లప్రభావం, 'అభినవలోచనం' "రామకథ - సాయిసుధ" వంటి అరుదైన విమర్శాత్మక గ్రంథాలను అందించిన ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం గారు బహుముఖ ప్రజ్ఞాధురీణులు, పరిశోధకులు, కవులు, నాటకకర్తలు, వక్తలు, ఉన్నతశిఖరాలందుకున్న అధ్యాపకులు. కొత్త అంశం చెప్పాలనుకున్నప్పుడే

విమర్శకు పూనుకునే వ్రతాన్ని అనుష్ఠిస్తున్న పరిశీలకులు. "ప్రథమాంధ్రమహాపురాణము" అన్న పరిశోధన గ్రంథంలోనూ, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు ప్రచురించిన బసవపురాణము, ఆంధ్ర మహాభారత శాంతిపర్వం అన్న గ్రంథాలలోనూ శ్రీ సుబ్రహ్మణ్యంగారు వ్రాసిన పీఠికల్లో ఆయన ప్రదర్శించిన పరిశోధనాపాటవం, పాండితీగరిమ, సూక్ష్మాంశ గవేషణాదృక్పథం మనకు దర్శనమిస్తాయి. ఉత్తమ సాహిత్య విమర్శకు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, కేంద్ర సాహిత్య అకాడమీ (ఢిల్లీ) శ్రీ సుబ్రహ్మణ్యంగారికి బహుమతులను అందించి సత్కరించినవి. "ఆంధ్ర సాహిత్య విమర్శ-ఆంగ్లప్రభావం" అన్న విమర్శ గ్రంథం ఆయనకు యావద్భారత కీర్తిని అందించింది.

శ్రీ సుబ్రహ్మణ్యంగారి వంటి సహృదయ విద్వాంసులు మా యువభారతి ప్రచురణలకు సంపాదకులుగా వ్యవహరించడం మా ఉత్తమ భాగధేయం. మా యువభారతికి ఆయన అండ కొండంత. మాకు మార్గదర్శనం చేస్తూ; మమ్మల్ని ఉత్సాహపరుస్తూ, మాలో ఒకరిగా మసలుకుంటూ మేము నిర్వహిస్తున్న సాహిత్యోద్యమానికి చేయూతనిస్తున్న సాహితీ స్నేహమూర్తులు. తమ ప్రసంగ పాఠాలను కొన్నింటిని ఏర్చికూర్చి "అక్షరాల ఆలోచనలు" అన్న పుస్తకంగా మలచి, ప్రచురించుకునే అవకాశం మాకు కల్పించిన ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం గారికి యువభారతిపక్షాన హృదయపూర్వకమైన, ధన్యవాదపురస్సరమైన అభివందనాలను సమర్పించుకుంటున్నాను. హైదరాబాదు విశ్వవిద్యాలయంలో ఆంధ్రశాఖా అధ్యక్ష పదవిని నిర్వహిస్తూ, శ్రీ సత్యసాయి దివ్యసందేశాన్ని దేశ ప్రజలకు అందిస్తూ, మా యువభారతిని కూడా అనేక విధాలా ఆదుకుంటూ ఉన్న శ్రీ సుబ్రహ్మణ్యం గారు మాకు ఆదర్శ విద్వాంసులు.

శ్రీ సుబ్రహ్మణ్యంగారి ఈ వ్యాససంకలనం "అక్షరాల-ఆలోచనలు" విద్యార్థులకూ, పరిశోధకులకూ, భాషా సాహిత్యాభిమానులకూ ఆదరపాత్రమవుతుందని నమ్ముతున్నాను.

సహృదయులు మా యువభారతి సాహిత్య కార్యక్రమాలకు అండగా నిలుస్తారనీ, మమ్మల్ని ప్రోత్సహిస్తుంటారనీ ఆకాంక్షిస్తున్నాను.

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షుడు

# నివేదన

1971 నుండీ నేను ఆధునిక రచయితలను గురించీ, రచనలను గురించీ వ్రాసిన వ్యాసాలలో కొన్నిటిని కలిపి "అక్షరాల ఆలోచనలు" అనే ఈ సంకలనం యువభారతి ప్రచురిస్తున్నది. దీని వెనుక డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి గారి ప్రోత్సాహం ఉన్నది. యువభారతీయుల స్నేహసౌహార్దాలున్నాయి. వాటికి నా అభివందనాలు ముందుగా అందజేస్తున్నాను.

"అక్షరాల ఆలోచనలు" అని యువభారతి ఈ సంకలనానికి పేరుపెట్టింది. 'అక్షరాలు' కవులకూ, రచయితలకూ, ప్రతినిధులుగా ప్రతీకలుగా భావిస్తే వారి ఆలోచనలను సమీక్షించిన వ్యాసాలు ఇందులోని రచనలు. అవి అక్షరాలా ఆలోచనలే. వాటిని గురించి వ్రాసిన ఈ వ్యాసాలు కూడా అక్షరాలైన ఆలోచనలైతే ఈ రచయిత ధన్యుడు.

ప్రతి వ్యాసంలోనూ ఏదో ఒక సమన్వయాన్ని క్రొత్తగా సమర్పించటానికి నేను ప్రయత్నించాను. శ్రీశ్రీ కవితలో పురాణప్రతీకల స్వభావాన్ని వివరించిన పద్ధతిని, విశేషించి శబ్దాలకున్న ప్రాచీనార్థ ప్రక్షాళనం, నవీనార్థకల్పనం అనే ప్రతిపాదనను చాలమంది విమర్శకులు అంగీకరించి సాహిత్య వ్యాసంగాల్లో సమన్వయించారు. మహాకవి దాశరథి శాంతి విప్లవ ప్రస్థానాన్ని వివేచించిన వైఖరి తరువాతి విమర్శకుల దృష్టిని బాగా ఆకర్షించింది. డా॥ సి నారాయణరెడ్డిగారి "మంటలూ-మానవుడూ", "విశ్వంభర" కావ్యాలసమీక్షలు ఆ కావ్యాలవ్యక్తిత్వాలకు విలువకట్టిన వివేచనలో కొంత ప్రత్యేకతను సంతరించుకొన్నాయి అని భావిస్తున్నాను. "స్వరమేళ" అనే వ్యాసం ఒక తులనాత్మకసమీక్ష. వానమామలై వరదాచార్యులు, దాశరధి, సి. నారాయణరెడ్డిగారల కవితాలక్షణాల సామ్యభేదాల సంగ్రహ సమీక్ష, 'త్రయీనాదము' అనే గ్రంథానికి పీఠిక.

బాపురెడ్డిగారి కృతులలోని భావభౌతిక వాదాన్ని గురించి వ్రాసిన వ్యాసం ఆ అంశాన్ని గురించి వివరించిన మొదటివ్యాసం. బాపురెడ్డి సాహితీ రజతోత్సవ

సందర్భంగా వ్రాసింది. "ఈ జంట నగరాలు హేమంత శిశిరాలు" ఆవిష్కరింప బడినప్పుడు ఆ సభలో ఆ కావ్యంలోని హాస్యరసపోషణాన్ని గురించి ఉపన్యసించు మన్నారు (6. 7. 1971). ఉపన్యాసాన్నే వ్యాసంగా వ్రాసి ఆ సభలో చదివాను. దాన్ని యధాతథంగా ఇందులో మొదటిసారిగా ప్రచురిస్తున్నాను. ఆ కావ్యంలోని హాస్యానికి నిజమైన వ్యాఖ్యానం చేశానని అనుకొంటున్నాను. డా॥ రావూరి భరద్వాజ గారి "జీవనసమరం" సమకాలీన సాహిత్యరంగంలో ఒక సుడిగాలి రేపింది. దాని వ్యక్తిత్వాన్ని సమీక్షించిన వ్యాసాల్లో "కలంకార్చిన కన్నీరు" ఒకటి.

విశ్వనాథవారి "నర్తనశాల" వ్యాసం ఆ నాటకంలోని విషాదాంత రూపక లక్షణాలను వ్యక్తీకరింపచేసేది. నర్తనశాలలో భారతీయ రూపకలక్షణాలను దర్శించి నిరూపించే పద్ధతి ప్రబలంగాఉన్న మన సాహితీవిమర్శలో పాశ్చాత్యుల విషాదాంత రూపకలక్షణాలను సమన్వయించి, దానిని ఉదాత్త విషాదాంత రూపకంగా నిరూపించడమైనది. "మహాకవి శ్రీశ్రీ", "నయాగరా" వ్యాసాలు సమీక్షలు.

ఈ సంపుటిలోని వ్యాసాలన్నీ సమన్వయాత్మక సమీక్షలు. ఎన్నుకొన్న అంశంమీద పఠితకు ఒక సమగ్రమైన, సమన్వయాత్మకమైన అవగాహన కలిగించటమే ఈ వ్యాసాల ప్రయోజనం. సమీక్షలో సవిమర్శక దృక్పథంక అంతస్సూత్రంగా సాగుతుంది; సాహిత్యపు విలువలకు విలువ కట్టటం జరుగు తుంది; పఠిత హృదయాన్ని ఆకట్టుకునే ప్రతిపాదన విధానం వ్యక్తమౌతుంది; వివేచనకు విశ్లేషణ వెన్నెముకగా నిలుపబడుతుంది; తాత్పర్యంతోపాటు తత్త్వ దర్శనంకూడా ప్రతిపాదింపబడుతుంది. వ్యాసం విశ్లేషణకోసమే కాదు వివేకం కోసంకూడా అని భావింపబడింది. ఈ ప్రయత్నాన్ని సహృదయులు సమాదరిస్తా రని ఆశిస్తున్నాను.

ఈ వ్యాససంపుటిని ప్రచురిస్తున్న యువభారతికి, వ్యాసాలను ప్రచురించు కోవటానికి అనుమతించిన వివిధ సాహితీ సంస్థలకూ, దీనికిరూపం కల్పిస్తున్న యువభారతీయులకూ నా కృతజ్ఞతాభివందనాలు. 'అక్షరాల ఆలోచనలను' సమాదరించే సహృదయలోకానికి నమోవాకాలు.

జి. వి. సుబ్రహ్మణ్యం

# విషయసూచిక

# మహాకవి శ్రీశ్రీ

ఆంధ్రభారతి క్రొత్తగా ముత్యాలసరాలను అలంకరించుకొన్న రోజు లవి. ప్రజలభాషలో నన్నుగా సంగీతం సాహిత్యంలో వినిపించిన కాలమది. 'దేశమంటే మట్టి కాదోయ్ ! దేశమంటే మనుషులోయ్' అన్న గురజాడవారి గొంతుక విని సాహిత్యజగత్తులో మనిషి మేల్కొన్న తరుణ మది. పదేళ్ళ ఇరవయ్యోశతాబ్దం బాల్యావస్థను దాటి పదిమందిలో తిరుగనేర్చిన పర్వమది. భావకవిత్వం ఒక శ్రీకారం చుట్టితే భవిష్యదభ్యుదయం మరో శ్రీకారం జంటకలిపి లిఖించిన చారిత్రక ఘట్ట మది. 'శ్రీవాణి'తో ప్రారంభమైన ప్రాచీనమార్గం శ్రీశ్రీవాణితో మహాప్రస్థానం సాగించటానికి మరో నాందిని పలికించే సూత్రధారుణ్ణి సృష్టించుకొన్న సంధికాల మది. ఆ కాలాని కొక సంకేతం శ్రీరంగం శ్రీనివాసరావు జననం.

ఇరవయ్యోశతాబ్ది పయిలావచ్చీసుల్లో భావగీతికలు పాడింది. పండు వెన్నెల్లో తిరిగింది; పైరగాలి పైట విసురుకుంటూ అందని అందాలకోసం అర్రులు సాచింది; ఎవరేమనుకున్నా ఆత్మాశ్రయపఋతుల్లో ప్రణయతత్త్వం పాడుకుంటూ భావాంబర వీధుల్లో విహరించింది. ఫలించని ప్రణయంలో పరితాపం వినిపించింది. 'దుర్భరశోక విషమగీతు లేడ్చివైతు-ఎలుంగెత్తి యేడ్చివైతు'నని రోదసిగర్భం మారుమ్రోగేటట్లు కృష్ణశాస్త్రి కంఠంతో రోదించింది. ఆ కాలమంతా కృష్ణపక్ష ప్రభావంలో మునిగిపోయింది. 'ఎవ్వ రనుకొందురో నన్ను ఏ ననంత- శోకభీకరతిమిరలోకైకపతిని' అని ఆక్రందించింది. ప్రకృతినిండా బహుళపంచమిజ్యోత్స్న పొగలాగా క్రమ్ముకొని ఉంది, సౌందర్యారాధనం నన్నని వెన్నెలతీగల్లా సాగినా తీగల వెనుక ఏదో శోకం సముద్రంలా ఘోషిస్తున్నది సాహిత్య జగత్తులో.

"నా కనారత మానందశోకగతులు
కలుగుచుండును నా కింత తెలియరాదు
నా చరిత్రము నాకె యన్వయము కాదు"

ఆనందశోకాలు జీవితాన్ని ప్రజ్వలింపజేసే సమిధలు. వాటి సంఘర్షణ శ్రీశ్రీ హృదయంలో ప్రతిభాతేజస్సును ప్రభవింప చేసింది. అంతరాత్మ ఆనందంకోసం పరితపిస్తోంది. ప్రతిభానేత్రం ప్రకృతిగర్భంలో ఆనందపిపాసియై అన్వేషించటం ఆరంభించింది. నవనవోన్మేషమైన ఆతని ప్రజ్ఞకు ప్రకృతి నవ్యప్రపంచంగా దర్శనమిచ్చింది.

"దివ్యానందమయ ప్రపంచ మిట మూర్తీభావముం దాల్చి నా
కవ్యాజప్రణయాతిరేకమునఁ దానై స్వాగతం బిచ్చెడున్!
నవ్యం బీ ప్రకృతీలలామ మృదుకంఠం బిందు మద్గీతికా
కావ్యప్రసన్నివహంబుఁ గూర్చెద నలంకార ప్రభాస్ఫూర్తితోన్"

'ఇది మనోజ్ఞప్రకృతిధామ మిచటఁ జేరి
అమృత పేశలనవమాధురిమముఁ గూర్చు
విహగకలకూజిత ధ్వనీ విధములందు
స్వీయకంఠారవము మేళవించుకొందు'

ప్రకృతిగానంలో పారవశ్యాన్ని చెంది పద్యగీతులు పాడడం ప్రారంభించాడు శ్రీశ్రీ.

"మైమరచిపోతి నంత సమస్తభువన
సముదయ మలర్చె నపుడె విస్తారమధుర
గాన నిస్వన కల్లోల కలిత లలిత
భావకవితా వియద్వాహినీ విధాన"

'ప్రకృతికాంతాశరీరసౌరభాకృష్టమధురసంస్పర్శనం'తో పులకించిన కవితాగానం 'ప్రకృతిదేవి ప్రహృష్టహృత్ప్రపూర్ణానురాగవాహిని'గా ప్రవహించింది. వేగవంతమైన ఆయన వాగ్ధార హృద్యపద్యాలగతుల్లో తురంగలించినా గీతపద్యం ఆయనహృదయగీతగా లాస్యంచేసింది.

"ఒక యనిర్వచనీయ మహోన్నత మగు
హాయి యున్నది గీతపద్యములయందు!
దరు లొరసి పారు గాంగనిర్ఝరిణి కరణి
చెంగుచెంగున గీతి తురంగలించు"

ఆధునిక ఖండకావ్యప్రక్రియకు ప్రాణప్రదమైనఛందం గీతపద్య మని ఆయన నిష్కర్ష.

"ఆధునిక దివ్యఖండకావ్యములయందుఁ
బ్రాణసన్నిభమై గీతి పరుగులాడు !
విస్తృతవనాంతరోదగ్ర వీథులందుఁ
గ్రేళ్ళుఱుకుతేఁడివలె గీతి త్రుళ్ళులాడు"

గీతాన్ని ఊతంగా చేసుకొని ప్రకృతితత్త్వాన్ని భావనామయంగా కీర్తించాడు యువకుడైన శ్రీశ్రీ.

ప్రకృతి పరిణామశీలమైనది. పరిణామంలో పుట్టుక వెంట చావున్నది. మృత్యువులోనుంచి పునర్జన్మ పుట్టుకొస్తున్నది. ఈ చావుపుట్టుకలకు అతీతమైన ఒక స్వేచ్ఛాశక్తి అనంత విశ్వాన్ని ఆవరించిఉంది. దాన్ని అందుకున్నప్పుడే ఆనందాన్వేషణం అక్షర మౌతుంది. శ్రీ శ్రీ ఆకసంపైపు తలయెత్తి చూచాడు. ఆనందం అంబరంలా కనపడింది. దానిఅంచుల్లో స్వేచ్ఛావిహంగంలా స్వామి సాక్షాత్కరించాడు అందరాని అవధుల్లో ఆయన; ఆశలతో ఆకలిచూపులతో తాను - దివికీ భువికి వంతెన కట్టాలన్న పరివేదన.

"నీవు నభోవిటంకమున నిర్మలపాండుపయోదమాలికల్
త్రోవ యొసంగ పక్షములు దూయుచు హాయిగ సంచరించు స్వే
చ్ఛావిలసద్విహంగమవు స్వామి ! క్షుధావిలమైన చూడ్కులన్
నీ విహరించు మార్గమున నిల్పి కనుగొనుచుందు నే నిటన్".

పరివేదనంలోని పారవశ్యం శ్రీశ్రీని భావవిహంగంగా మార్చింది. మృత్యువునుండి మహాయానం చేయాలని స్వేచ్ఛామార్గాన్ని స్వీకరించాడు.

"ప్రకృతి యాగారమున నశింపంగబోక
గాలి యొసఁగెడు క్రొత్త ఱెక్కల ధరించి
అతినిరాఘాటముగ విహాయసపథాల
నెఱుకపడరాని యెచటికో ఎగసిపోదు"

నని వైనతేయునిలా వియత్తలానికి లంఘించాడు. మార్గమధ్యంలో మేఘశకలం ఎదురైంది.

"ఈ ప్రకృతిగాఢరహస్య మెఱుఁగలేక
చంచలమనస్కత, బరిభ్రమించు నాక
విశ్వపథముల నడయాడి వేసరిలుట

యన్ని విధముల భావ్యమే యగును గాని-
ఓ వలాహకశకలమా! నీవు కూడ
నావలెఁ బరిభ్రమించుచున్నా వదేల?"

అని ప్రశ్నించాడు. దానికి తనకూ భేదం లేదని తెలుసుకున్నాడు. ఈ అనంతవిహాయ సయానంలో మృత్యుంజయుమైన స్వేచ్ఛను సాధించి అమరత్వాన్ని అన్వేషించే కవికి మృత్యుప్రబోధం వినిపించింది.

"ఓయి మనుజుఁడ ! నీ నిస్సహాయ దీన
హీన దుస్థితి గతుల నూహింప లేక
ననుఁ బ్రతారింప వ్యర్థయత్నము లొనర్చి
నాకనులముందె తిరుగుచున్నావు గాని
ఎఱుఁగవే నన్ను లోకభీకరమహోగ్ర
ఫణి విషస్ఫీతమృత్యురూపిణిగ నీవు?
నీహృదంతరసదనసంస్థితకరాళ
శిఖిశిఖాచ్ఛట నని గ్రహించెదవొ లేదొ?
భీప్రదక్రకచోగ్రదంష్ట్రాప్రభూత
విస్ఫురత్తేజమున దాండవించు నన్ను
మృత్యుదేవతగా మది నెఱుఁగలేవొ?"

ఆనందాన్వేషికి మృత్యుగర్జనం అమరసందేశంలా వినిపించింది. మానవుడు ప్రపంచంలో అనుభవిస్తున్న నిస్సహాయదీనహీనదుస్థితిగతుల నూహింపలేక పలాయనమంత్రం పఠిస్తూ పరమానందాన్వేషణలో పరుగులుతీయటం మహాపరాధంగా తోచింది శ్రీశ్రీకి. ఆయన హృదంతరాళంలో కరాళశిఖిశిఖాచ్ఛట లున్నాయని తెలిసివచ్చింది. అవే కార్చిచ్చులా మండుతున్న లోకశోకానలం. శోకతత్త్వం తెలియందే ఆనందం అనుభూతికి రాదన్న సత్యం స్ఫురించింది, స్వర్గంలో మృత్యువు లేదు. బాధ లేనిచోట బోధ లేదు. హాలాహలం చవిచూచిన శివుడికే అమృతంలోని విలువ తెలుసు. జీవితమొక మహాసంధ్య. ఉదయాస్తమయాల కది ఉజ్జ్వలప్రతీక. చీకటికోరలమధ్య నలిగిన వెలుగుకణాలు వెల్రిగక్కే రక్తారుణిమలు సంధ్యాచ్ఛవిలో తాండవిస్తాయి. షోడశకళాప్రపూర్ణుడుగా వెలుగవలసిన చంద్రుడుకూడా కృష్ణపక్షంలో చీకటిగంతలో మునిగిపోతున్నాడు. శోకార్ణవంలా అమవస ఆసన్నమౌతుంది. కృష్ణపక్షం చివర ఉన్నాడు శ్రీశ్రీ. వెలుగురేకలకంటె చిమ్మచీకట్లే జగత్తును జయిస్తున్నాయి. ప్రణయగీతం వరాస్తమైపోయింది. ప్రళయగీతం పొటమరించింది.

"ఏ నెరుంగుదు ప్రేయసీ నూత్న యౌవనా
దీనుడై ప్రియుడు వర్తిలిన వెన్నెలవేళ
తీయనై నాటి నందీప్తి తోచెను గాని
ఈ యమావాస్యనే హెచ్చునే వరియింతు
నేను దట్టపుమంచుసోనలే కురియింతు."

శ్రీశ్రీగళం గద్గదమైంది. శోకవిషణ్ణమైపోయింది. అన్వేషణం ఆకాశంలో కాదు అవనీతలంమీదనే అని నిశ్చయించుకున్నాడు. స్వేచ్ఛావిహంగం భూతలానికి దిగింది. చీకట్లో చికీర్ష ప్రారంభమయింది. భూగర్భంలోనుంచి ఏదో నీరవాహ్వానం వినిపించింది - గతచరిత్రకు నిశబ్దవ్యాఖ్యానాన్ని చెప్పే కంకాళసంపుటాలసవ్వడి అది. సుప్తాస్థికల మూల్గు. శ్రీశ్రీ మేను కంపించింది. మనసు ద్రవించింది.

"అవి ధరాగర్భమున మానవాస్థికా ప
రంపరలు- సుప్తనిశ్శబ్దసంపుటములు
అట నాకే దీర్ఘ యామిని: ఆనిశాశ్మ
శానశయ్యకు ప్రాతః ప్రసక్తి లేదు
ఆ యగమ్యత మోరహస్యాంగణాన
తాండవించును మృత్యుశైత్యల్య మొకటె-
అది నిశాంత హేమంతహృదంతరంత
రసుభవాళి ఘనీభవించిన సమాధి.
అమనుష్యాస్థికలు నిద్రలో మునింగి
సంచరించును భైరవస్వప్నవీధి ;
అవి చలించును తమ చర్మకవచ మెవుడొ
బ్రదికినదినాల తలపోత బరువుచేత.
నా కనుంగవ కన్నీళులై కరంగు
నవి యొనర్చెడు నీరవాహ్వాన మెరిగి-
ఇంత శోషిల్లు నాలొ నాహృదయపుటము
వణకు నేటికొ నాఅస్థిపంజరమ్ము."

మానవజీవితంలోని అతివాస్తవికమైన సత్యం కవి మనోనేత్రగోచరమైంది. చరిత్రకెక్కని సామాన్య జీవితాలెన్నో భూగర్భంలో సుప్తమైపోయాయి. వాటిని త్రవ్వి

చెప్పకపోతే మానవచరిత్ర సమగ్రం కాదు. కవి అస్థిపంజరంలోని ఎముకలచప్పుడు చరిత్రగర్భంలోని అనాథజీవుల సమాధుల్ని ప్రశ్నించి చూచింది.

"చారిత్రకవిభాతసంధ్యల
మానవకథ వికాస మెట్టిది?
ఏదేశంలో ఏకాలంలో
సాధించిన దేపరమార్థం?"

అన్న జిజ్ఞాసమొదలైంది. ఆంధ్రసాహిత్యంలో ప్రప్రథమంగా ప్రపంచమానవుణ్ణిగూర్చి సమాలోచనం తలయెత్తింది: సౌందర్యపిపాస సన్నగిల్లి సంఘర్షణ మొదలైంది. పారవశ్యం పోయి ఆవేశం ఆవహిల్లింది. 'పుడమితల్లికి పురిటినొప్పులు' కొత్త సృష్టిని స్ఫురింపచేస్తున్నాయి. అభ్యుదయపథంతో అడుగులచప్పుడు వినిపిస్తున్నది.

* * * *

'ఇప్పుడు మనం 20వ శతాబ్దంలో ఉన్నాం, ఈశతాబ్దం నాది. (తెలుగుసాహిత్యానికి సంబంధించినంతవరకు). నేను 1910లో పుట్టాను.(తోకచుక్కలాగ).మూడుసార్లు మృత్యువుతో పోరాడి గెలిచాను. 1918లో మొదటిగీతం వ్రాశాను. (గణయతి ప్రాసలంటే ఏమిటో తెలియకుండా) 1920లో మొదటినవల (వీరసింహ విజయసింహులు) రాసిపారేశాను. 1925లో మొదటినవలిక (పరమాణు రహస్యం) అచ్చయింది. 1928లో మొదటి ఖండకావ్యసంపుటి (ప్రభవ) .... అచ్చు వేయించాను. 1930లో నేను 63 రోజులు టైఫాయిడ్ జ్వరంతో బాధపడ్డాను. జీవితం మృత్యువుతో ఎలా పోరాడుతుందో స్వయంగా తెలుసుకున్నాను....1930 దాకా తెలుగు సాహిత్యం నన్ను నడిపించింది. ఆ తర్వాతనుంచీ దాన్ని నేను నడిపిస్తున్నాను. అప్పటి నుంచీ తెలుగు సాహిత్యచరిత్ర శ్రీశ్రీ స్వీయచరిత్ర"-ఇవి శ్రీశ్రీ 'మహతి'లో చెప్పినమాటలు.

శ్రీశ్రీ జీవితంలో 1930 ఒక పెద్దమలుపు. ఒక మహానాటకానికి పూర్వరంగంలా ఆయన ఇరవైయేళ్ళజీవితం కనపడుతుంది. ఒకమహాగ్ని ప్రజ్వరిల్లటానికి ముందు విస్ఫులింగాలు ప్రస్ఫుటమయినట్లు ప్రభవలో ప్రకటింపబడిన కవితప్రత్యక్షమౌతుంది. ప్రభవలోని పద్యాలు భావకవిత్వప్రభావంతో వెలువడినవే. అందులో కూడా ప్రణయభావంకంటె ప్రకృతివర్ణనం ఎక్కువ. చూచిన ప్రతివస్తువులో తాదాత్మ్యంచెంది ఆత్మాశ్రయంగా అనుభూతిని వ్యక్తంచేశాడు ఆ కవితలో. పుట్టుకతోనే వచ్చిన కవితావాసన అక్షరాభ్యాసంతో ఆకృతి తాల్చింది. ఛందఃపరిజ్ఞానంతో ప్రస్ఫుటమైంది. ప్రాచీనకవిత్వమహత్వమంతా అప్రయత్నంగా ఆవగతమైంది. తిక్కన్న తెలుగుదనంమీద మోజు, శ్రీనాథుని ప్రౌఢిమమీద అభిమానం, రామకృష్ణుని

పదగుంఫనంమీద భ్రాంతి, గురజాడ ముత్యాలసరాలమీద మోజు. కృష్ణశాస్త్రి సమ్మోహనశక్తిమీద సాదరం, విశ్వనాథ సమాసఘటం మీద సహభావం-ఇలా ఎన్నో అభిరుచులు ఆయనమీద పనిచేశాయి. పసితనంలోనే కన్నతల్లిని కోల్పోయి, పెంపుడు తల్లిలో వాత్సల్యాన్ని చవిచూసిన శ్రీశ్రీ ప్రణయంకంటె ప్రకృతిలో వాత్సల్యాన్నే చూశాడు. పెంపుడుతల్లి కరువై పోతే పెనుశోకం ముంచుకొచ్చింది. కరుణవాత్సల్యాలలో ప్రణయబీజాలు మొలకెత్తలేదు. అందువల్ల భావకవుల్లో కూడా ఆయన కొక ప్రత్యేకస్థానం ఏర్పడింది. ఉదయసంధ్యను చూచి ఉద్విగ్నతను ప్రకటించాడు. సాయంసంధ్యను చూచి సాధ్వసాన్ని ప్రదర్శించాడు. రజనీగానంలో గొంతుకలిపి పాడాడు. మేఘశకలాన్ని చూచి మనసు కలెబోసుకొన్నాడు. ప్రకృతిని కాంతగా కంటె మాతగా ఆరాధించాడు. అతని ప్రణయం పరమేశ్వరార్పితం. పరమేశ్వరునిలో కనపడింది విలయతాండవం చేసే కల్లోలమూర్తి. ప్రభవానంతరకవిత్వంలో కవి అంతర్ముఖమైన ప్రతిభ సమాధిని సాధించింది. ప్రభవలో కనవచ్చే పదాడంబరం శిల్పసంభరితం కాజొచ్చింది. మధుమూర్తి నొకవైపు కీర్తిస్తూనే మహాంధకారంలోని లోతులు దర్శించటం జరిగింది. స్వేచ్ఛావిహంగం వర్తమానాన్ని అధిగమించి భావిదృష్టి సారించింది. అతనిలో సంఘర్షణ అగ్నిహోత్రంగా ప్రజ్వలించింది,

"ఏ పరాత్పరమూర్తి సదాపవిత్ర
నాట్య లీలానుకూల నిశ్వాసములను
నెరపుచున్నాడొ ఆ హరునిటలమందు
దాగి యడగిన అగ్నిహోత్రమును నేను"

అని ఫాలాక్షునిప్రళయాగ్నిగా ప్రత్యేకప్రతిపత్తిని సాధించింది శ్రీశ్రీ కవిత. అనుకరణశీలం ఆహుతి అయిపోయింది. సొంతవెలుగు వేడిగా పైకురికింది. ఆ వెలుగులో భూతలంలో ప్రవాసం చేస్తున్న స్వర్గదేవతలు కనపడ్డారు.

"దేవతలు విచిత్రాకృతుల్ తీసికొనిరి
పల్లెటూళ్ళలో సూకరపాలకులుగ;
కాని వారల మురికిమొగాలయందె
దివ్యతారకాస్నిగ్ధదీధితులు మెరయు"

'స్వర్గదేవత' అనే ఖండకావ్యసంపుటిలో శ్రీశ్రీ సమాజంలో అట్టడుగున అణగారిపోయిన అనాథజీవితాల సంస్మరణ వినపడుతుంది; సంప్రదాయంగా వస్తున్న స్త్రమా

ట్టుల కీర్తనానికి స్వస్తి చెప్పబడింది. నవసమాజస్పృహతో గతంమీద తిరుగుబాటు ధోరణి తలయెత్తింది. శ్రీశ్రీకి వచ్చిన టైఫాయిడ్ జ్వరం ఎంత భౌతికమైనా సాహిత్యపరంగా అదియొక ప్రతీక. మృత్యువుతో పోరాడి ఆయనఅస్థికలు పునర్జన్మను సాధించాయి. అప్పటినుంచీ ఆయన కవితాప్రపంచం మరోప్రపంచం; ఆయన మహాగ్నిజ్వాల.

ఆజ్వాలను రగిల్చిన మిత్రులెందరో ఉన్నారు. కాటూరి నరసింహారావు ఇంధనాలు తెచ్చిపెట్టాడు. 1926లో తలయెత్తిన నవ్యకవితాసమితి అగ్నిస్థాపనం చేసింది. పురిపండా అప్పలస్వామీ, వడ్డాది సీతారామాంజనేయులూ, అబ్బూరి రామకృష్ణారావు ఇంధనాలు సరిచేసి నిప్పును రాజబెట్టారు. కొంపెల్ల జనార్ధనరావు ఆ అగ్నిలో మహాశక్తిని అవాహనం చేశాడు. శ్రీశ్రీ ప్రపంచాగ్నిగా ప్రజ్వరిల్లాడు. ఈ పరిణామంలో శ్రీశ్రీ కవితలో వినబడ్డ చిటపటలు అయన భావవిప్లవానికి ప్రతిధ్వనులు.

"నేను సైతం
ప్రపంచాగ్నికి
సమిధ నొక్కటి ఆహుతిచ్చాను.
నేను సైతం
విశ్వవృష్టికి
అశ్రు వొక్కటి ధారపోశాను!
నేను సైతం
భువనఘోషకు
వెర్రిగొంతుక లిచ్చి మ్రోశాను!"

శ్రీశ్రీ సొంతగొంతుక జయభేరి మ్రోగించిన మొదటిగేయ మిది. ఇందులో మొదట గమనింపదగింది ఆయన ఇంటిని గెలిచి రచ్చ కెక్కడం. ఇల్లంటే సాహిత్యం. గ్రాంథికభాషావాదం అక్షరచ్ఛందం ఆంధ్రసాహిత్యంలో సామ్రాజ్యం చేస్తున్నవి. వాటిబంధాలు తెంచుకోవటం మొదటిమెట్టు. కాల్పనికజగత్తులోంకలలు కంటూ వాస్తవికజగత్తును చూడలేని మత్తుమందు ప్రభావంనుండి పైకిరావడం రెండవమెట్టు. విశ్వంనుండి విడదీయలేని సామాజిక చైతన్యంలో తానొక భాగంగా గుర్తించుకోవడం మూడోమెట్టు. మూడు మెట్లెక్కి చూచిన శ్రీశ్రీకి ప్రపంచం ఒక మహాగ్నికుండంగా గోచరమైంది.

జాతీయఅంతర్జాతీయరంగాలలో మహాయుద్ధజ్వాలలు నాలుకలుసాచి విశ్వాన్ని భస్మంచేసే ప్రయత్నాలు చేస్తున్నవి. ఆర్థికమాద్యంతో ఆకలిమంటలు రెచ్చి అఖిల జనావళి ఆర్తనాదం చేస్తోంది. జర్మనీలో నాజిజం ప్రపంచాన్ని పాశవికంగా కబళించాలని చూస్తోంది. వలసరాజ్యాల్లో సామ్రాజ్యవాదం ప్రజాశక్తిని పీడిస్తోంది. భారతదేశంలో సామ్రాజ్యశక్తులతో స్వాతంత్ర్య సమరం మొదలైంది. పారిశ్రామిక రంగంలో పెట్టుబడిదారులు కార్మికశక్తిని స్వలాభంకోసం పణం పెడుతున్నారు. కష్టించినవాడికి కడుపు నిండటం లేదు. స్వేచ్ఛాజీవిని శృంఖలాలు బంధిస్తున్నాయి. పదిమ-దిచేతుల్లో అధికారం ఆదాయం సమీకరింపబడుతోంది దారిద్ర్యంధరిత్రినిండా తాండవిస్తోంది. దమననీతి యుద్ధపిపాసతో స్వేచ్ఛను దగ్ధంచేస్తోంది. ప్రపంచంలోని ప్రజాశక్తులీ సత్యాన్ని గుర్తించి విప్లవానికి వ్యూహాన్ని పన్నుతున్నాయి. రష్యా చైనాల్లో విప్లవచైతన్యం విజృంభించింది భారతనాయకుల కది యొక క్రొత్త కను విప్పైంది. నాజీఫాసిస్టు సైన్యాన్ని రష్యా, జపాన్ సామ్రాజ్యవిస్తరణాన్ని చైనా ప్రతిఘటించాయి. బ్రిటిష్ దమననీతికి జాతీయోద్యమం విశ్లథమై పోతోంది. ప్రపంచ కార్మికులు ఉద్యమించారు. దేశంలో దాని ప్రతిధ్వని వినిపించింది. ప్రపంచమంతా భయం, ఆగ్రహం, అలజడి, ఆందోళన, సమ్మెలు, సమరాలు - ఏదో ఒకమహాగ్ని ప్రజాచైతన్యంలో ప్రజ్వలిస్తున్న భీకరనాదాలు, వీరావేశాలు-ఇవన్నీ శ్రీశ్రీ చెవులలో రింగుమన్నాయి. ఆ ప్రపంచమహాగ్నికి తానూ ఒక సమిధ నిస్తా నంటున్నాడు శ్రీశ్రీ ప్రతీపశక్తుల మారణహోమానికి బలియైపోతున్న ప్రపంచసమాజంలో విషాదమేఘాలు క్రమ్ముకున్నాయి. అనంతశోకం జడివానగా కురుస్తోంది. ఆ వృష్టికి అశ్రువొక్కటి ధారపోశాడు శ్రీశ్రీ. విశ్వశోకం విలయఘోషగా వినిపిస్తోంది. ఆ ఘోషలో తన గొంతుతో వీరావేశంతో శ్రుతికలిపి పాడాడు. విశ్వఘోష వ్యక్తినాశ్రయించి తెలుగునోట తొలిసారిగా క్రొత్తగతిలో వినిపించింది. ఇది ఒక క్రొత్త కేక.

శ్రీశ్రీ ఈ గీతంలో ప్రదర్శించింది సామాజికవృత్తం. దీన్ని జాతీయస్థాయి నుండి అంతర్జాతీయస్థాయికి తీసుకువెళ్ళిన కవినాయకు డాయనే. జాతిని ముందుకు నడిపించేవాడు నాయకుడు. దానికి ప్రబోధం కావాలి. అది సమరసందేశంగా వినిపించాలి. సమాజాన్ని సైనికసంఘంలా సమాయత్తం చేయాలి. మాటల్లో మహోత్సాహం, గతిలో మార్చింగ్‌బాండ్ వినిపించాలి. గతితోపాటు గమ్యం చూపించాలి గర్జిస్తూ గమ్యాన్ని ఘోషించాలి. ప్రతిపదంలో ప్రగతిశీలం ప్రతిధ్వనించాలి. సమాజ

చైతన్యాన్ని సంఘటింతం చేసే శబ్దశక్తిని సమీకరించాలి. ఈ లక్ష్యంతో శ్రీశ్రీ మరో ప్రపంచాన్ని చూపిస్తూ నాయక గీతాన్ని పాడాడు. విజయభేరితో పాటు వీరగానం వినిపిస్తుందాగొంతులో-

'మరో ప్రపంచం
మరో ప్రపంచం
మరో ప్రపంచం పిలిచింది ;
పదండి ముందుకు
పదండి త్రోసుకు
పోదాం పోదాం పైపైకి.

కదం త్రొక్కుతూ
పదం పాడుతూ
హృదంతరాళం గర్జిస్తూ
పదండి పోదాం
వినబడలేదా
మరో ప్రపంచపు జలపాతం !

దాకిపోదుగునా గుండెనెత్తురులు
తర్పణ చేస్తూ పదండి ముందుకు....
ఎముకలు క్రుళ్ళిన
వయస్సు మళ్ళిన
సోమరులారా చావండి !
నెత్తురు మండే
శక్తులు నిండే
సైనికులారా రారండి!
హరోం హరోం హర
హర! హర! హర! హర!
హరోం హరా! అని కదలండి !
మరో ప్రపంచం
మరో ప్రపంచం
ధరిత్రినిండా నిండింది.

పదండి ముందుకు
పదండి త్రోసుకు
ప్రభంజనంవలె హోరెత్తండి!
భావవేగమున ప్రసరించండి!
వర్షుకాభ్రముల ప్రళయఘోషవలె
పెళ పెళ పెళ పెళ విరుచుకు పడండి!....
త్రాచులవలెనూ
రేచుల వలెనూ
ధనంజయునిలా సాగండి!
కనబడలేదా మరో ప్రపంచపు
అగ్నికిరీటపు ధగధగలు
ఎర్రబావుటా నిగనిగలు
హోమజ్వాలల భుగభుగలు!

ఇది నిద్ర మేల్కొల్పే వైతాళిక గీతి కాదు- మేల్కొన్న జాతిని ముందుకు నడిపించే సమరగీతి. ఈ పాటలో జీవమంతా గతిలో ఉంది. మూడడుగులు ముందుకు వేస్తూ మరో పదడుగులు కలుపుకుంటూ పుంఖానుపుంఖంగా పదవిక్రాంతి కనబడుతుందీగేయంలో. శబ్దం ముందు. అర్థం వెనక. ప్రాసల్లో పాదాలకు ప్రాణముంది. 'మరో'అన్నప్పుడు భాసించే ఉత్ప్లుతిలో అడుగులేచినట్లు వినపడుతుంది. 'ప్రపంచం'-గురువులైన రెండడుగులు వేసినట్లు కనపడుతుంది. అప్పటికి కుడియెడమల పాదకదనం పూర్తౌతుంది. 'పదండి'అన్న జగణప్లుతి-గతిలోని ఉన్మత్తీకరణాన్ని సూచిస్తుంది. అంత్యప్రాసలూ అంతఃప్రాసలూ అంతర్లయను పోషిస్తాయి. పదాద్యక్షరమైత్రి పల్లవిలాంటి పాదాల్లోనే పాటింపబడడంవల్ల పరంపరభావం ప్రవాహతుల్యంగా ధ్వనిస్తుంది. పాదాలపునరావృత్తి భావావేశాన్ని ప్రకోపిస్తూ క్రియాంతంగా పాదం ముగిసినప్పుడు క్రియాశీలాన్ని వ్యంజింపజేస్తుంది. 'హరోం! హరోం! హర! హర! హర! హర! హర! హరోం! హరా అని కదలండి'అన్నప్పుడు అనర్గళమైన గతివిన్యాసం చెవులకు వినిపిస్తుంది. ప్రభంజనంవలెనన్నప్పుడు హోరూ, 'పెళపెళపెళపెళ' అన్నప్పుడు విరుచుకుపడే శబ్దం, 'ఉరకండి!' అన్నప్పుడు పరుగూ అనుభూతి కందుతాయి.

ఈ ప్రచండగతివేగంలో సోమరితనానికి తావు లేదు. అడుగు వెనక్కు పడితే నలిగి చావ్వలిసిందే. ఎముకలు కుళ్ళిన రోగులూ, వయస్సుమళ్ళిన వృద్ధులూ ఈ సైనిక

వాహినిలో నిలువలేరు. వృద్ధులకు శాపంలా వినపడ్డా గేయగతి వాళ్ళకూ నూత్న యౌవ్వనాన్ని యిస్తుంది. శబ్దం భావావేశాన్ని కల్పించే రచనాశిల్పం పుష్కలంగా సంతరించుకొన్న సమర గీతమిది. అయినా ఇందులో అర్థానికి అంగబలం ఉంది. దాని ఊపిరి ఉపమానాల్లో ఉంది; రూపం రూపకాల్లో ఉంది. 'ప్రభంజనంవలె' 'వర్షుకాభ్రముల ప్రళయఘోషవలె' 'తాచులవలెనూ' 'రేచులవలెనూ' 'ధనంజయునిలా' అన్నప్పుడు యుద్ధసైనికుల విజయయాత్రలో కానవచ్చే అవస్థాంతరాలు ఆకృతి కడతాయి. ఉపమానంకంటె రూపకం భావనామయమైంది. 'హృదంతరాళం గర్జిస్తూ' అన్నప్పుడు 'హృదయాన్ని బెబ్బులిగా భావించాలి' 'నెత్తురు మండే' అన్నప్పుడు వర్ణసామ్యంచేత నెత్తురును మంటలా ఊహించాలి. అలంకారాలకు మించినవి ప్రతీకలు. ఇవి రసవద్గుళికలు. 'అగ్నికిరీటం' 'ఎర్రబావుటా' 'హోమజ్వాల'-ఇవి మరోప్రపంచాన్ని గుర్తించే చిహ్నాలు, గమ్యాన్ని చూపించి శ్రీశ్రీ గేయాన్ని ముగించాడు; గీతానికి మహాప్రస్థానమని పేరు పెట్టాడు. అంతకంటె ధ్వనిమంతమైన శిల్పంమరొకటి లేదు.

ఈకవిత కవితకోసమే వ్రాసింది కాదు. సామాజికప్రయోజనకోసం ఉద్దేశింపబడింది. ఉపరంజకత్వంతో పాటుఉపదేశం కావ్యాని కుండాలని ప్రాచీనులూ చెప్పారు. వారి లక్ష్యం పురుషార్థ చతుష్టయపరిజ్ఞానం కలిగించటం. పరమార్థంగా మోక్షాన్ని నిర్దేశించటం. శ్రీశ్రీ లక్షించిన అభ్యుదయ మార్గంలో సంప్రదాయబద్ధమైన ఆముష్మిక చింత లేదు. ఆముష్మికదృష్టిలో జగం మిథ్య. మోక్షం నిత్యం. ఈమిథ్యావాదాన్ని అభ్యుదయవాది అంగీకరింపడు. ఆర్థిక అసమానత్వంతో వర్గసంఘర్షణంతో కళ్లయెదుట కనపడే వాస్తవజగత్తు సత్యమంటాడు; సమసమాజ భావనం జగత్కల్యాణ మంటాడు:

'జమీందారు రోల్సుకారు
మాయంటావా? బాబూ
ఏమంటావు?
'మరఫిరంగి! విషవాయువు
మాయంటావా? ఏం
ఏమంటావు?
'పాలికాపు నుదటిచెమట
కూలివాని గుండెచెరువు,
బిచ్చగాని కడుపు కరువు
మాయంటావా?

తుఫానుల్లూ, భూకంపం
తిరుగుబాట్లు, సంగ్రామం
సంగ్రామం, సంగ్రామం
మాయంటావూ? ఏయ్
ఏమంటావు?

అని మిథ్యావాదిని కవ్వించి అడుగుతాడు శ్రీశ్రీ.

ఒక క్రొత్తమతాన్నిగానీ సాంఘిక సిద్ధాంతాన్నిగానీ సమాజానికి బోధించా లంటే, దాని మనసునూ, మెదడునూ క్రమంగా జయించాలి. మనసుకు కావలసింది ఆవేశం, మెదడుకు కావలసింది ఆలోచన. శ్రీశ్రీ తన అభ్యుదయభావాన్ని ఆవేశంతో 'మహాప్రస్థాన' గేయంలో ప్రతిపాదించాడు. అది అందరినీ ఆకర్షించింది. వీరావేశం ఆయన కవితకు ఆలంబనమైంది. శబ్దం అర్థాన్ని మించి సప్రయోజనంగా ఆయన రచనల్ని శాసించింది. ఆవేశానికి వెన్నెముకగా ఆలోచననిలవాలి. లేకపోతే సిద్ధాంతం కలకాలం నిలపడలేదు; మేధావివర్గం మెప్పుకోలు పొందలేదు. పాల్కురికి సోమ నాధుడు కూడ వీరశైవప్రచారంలో ఇదేపద్ధతి అనుసరించాడు. బసవపురాణం భక్త్యా వేశ ప్రధానమైంది. పండితారాధ్యచరిత్ర శైవతత్త్వసమాలోచనం లాంటిది. శ్రీశ్రీ ఆధు నికయుగంలో పాల్కురికిలాంటి వాడు. మహాప్రస్థానం సామాన్యుల మనోలోకాన్ని ఉద్దేశించి వ్రాసిందయితే ఆయన 'దేశచరిత్రలు' బౌద్ధికలోకాన్నుద్దేశించి వ్రాసింది. ఈరెండూ అయన మహాప్రస్థానానికి రెండంచులు. ఆ అంచులమధ్య ఎన్నో భావశబలా లైన గీతాలున్నాలు.

'దేశచరిత్రలు' రచనం మార్క్సిస్టు దృక్పథానికి కవితారూపకల్పనం. రష్యాలో ప్రజావిప్లవాన్ని తెచ్చిన కమ్యూనిస్టుపార్టీకి కార్ల్‌మార్క్స్, ఫ్రెడరిక్ ఎంగెల్స్ మూల పురుషులు. వాళ్ళు చరిత్రను గతితార్కిక భౌతికవాద దృక్పథంతో దర్శించారు. డార్విన్ పరిణామసిద్ధాంతం హెగెల్ భావవాదాల పరిణామం వారి సిద్ధాంతం. "ప్రతి చారిత్రకశకంలోనూ ఆర్థికఉత్పత్తి విధానమూ, దానినుండి విధిగా ఉత్పన్నమయ్యే సామాజికవ్యవస్థా కలిసి ఆ దేశంయొక్క రాజకీయచరిత్రకూ, బౌద్ధిక(intellectual) చరిత్రకూ పునాదిగా వుంటాయి. అనీ, తత్ఫలితంగా (భూమిమీద ఆదిమసమ సమాజం విచ్ఛిన్నమైనప్పటినుండి) చరిత్రఅంతా వర్గపోరాటాల చరిత్ర, దోపిడీ దార్లకూ దోపిడీ చేయబడ్డవాళ్ళకూ జరిగే పోరాటాలచరిత్ర, భిన్నసామాజిక అభివృద్ధి

దశలలోవున్న పాలిత పాలకవర్గాలమధ్య జరిగే పోరాటాలచరిత్రఅనీ; కానీ అణగ ద్రొక్కబడిన పీడితవర్గం (కార్మికవర్గం) తన్ను అణగద్రొక్కి పీడించే (బూర్జువా) వర్గంనుండి విముక్తిపొందడం అనేది మొత్తం సమాజమంతటినీ దోపిడీనుండీ పీడన నుండీ, వర్గపోరాటాలనుండీ శాశ్వతంగా విముక్తిచేస్తే తప్ప సాధ్యంకాని దశకు వర్గ పోరాటాల చరిత్ర యీనాడు చేరిందనీ" కమ్యూనిష్టుపార్టీ ప్రణాళిక చెపుతుంది. ఈ మూలభావం మార్క్సు ప్రతిపాదించిందేనని ఫ్రెడరిక్ ఎంగెల్సు 1883నాటి జర్మన్ కూర్పునకు వ్రాసిన ముందుమాటలో పేర్కొన్నాడు. (ఆంధ్రానువాదం)

మార్క్సిస్టుదృక్పథంలో సామాజికపరివర్తనానికి మూలహేతువైనది విరుద్ధ శక్తులమధ్య అనవరతంసాగే సంఘర్షణ. విరుద్ధశక్తు లుండటం ప్రకృతిధర్మం. ఒక వ్యవస్థలో ఉన్న పాలకపీడితవర్గాలమధ్య ఏర్పడే సంఘర్షణలవల్ల క్రొత్తవ్యవస్థ పుడు తుంది. అప్పటికదే గుణం, కాని ఆ వ్యవస్థలో కూడా వర్గకలహం రావడం సహజ పరిణామం. పీడితవర్గాలవిప్లవంవల్ల మరలా నూత్నవ్యవస్థ ఏర్పడుతుంది. ఇలాఏర్ప డ్డవే వలసరాజ్యవిధానం, జమీందారీవిధానం, పెట్టుబడిదారీవిధానం. ఇప్పుడు పెట్టుబడి దారీవిధానాన్నే కార్మికవ్యవస్థ కూలద్రొయ్యాలని చూస్తున్నది. రాజ్యాలమధ్య జరిగిన యుద్ధాలకూ, రాజులరణపిపాసకూ, జమీందారుల ధనపిపాసకూ, పెట్టుబడిదారులలాభా కాంక్షకూ, కార్మికులసమసమాజ స్థాపనోద్యమానికీ చరిత్రలో సమన్వయసూత్రంగా నిలిచేది గతితార్కికభౌతికవాదమే. సమసమాజవ్యవస్థలో పాలక పాలితవర్గాలుండవా అన్నది తరువాతి ప్రశ్న. దానికి సమాధానంగా కమ్యూనిష్టుపార్టీ మానిఫెస్టో ఇలా పేర్కొంటుంది.·"అసలు రాజకీయ అధికార మనేది, సరైనఅర్థంలో, ఒకవర్గంలో పీడించటానికి మరొకవర్గం ఉపయోగించే సంఘటితశక్తి మాత్రమే. కార్మికవర్గం. బూర్జువావర్గంతో తాను పోరాటం చేసేకాలంలో, పరిస్థితుల ప్రాబల్యంవల్ల తానే ఒక వర్గంగా సంఘటితం కావలసివస్తే విప్లవంద్వారా తానే పాలకవర్గస్థానం అధిష్ఠిస్తే, తన్మూలంగా పాతఉత్పత్తివిధానాన్ని బలవంతంగా వూడ్చి పారవేస్తే, అప్పుడు ఆ విధానంతో పాటు మొత్తం వర్గాలూ వర్గవిభేదాలూ బతకడానికి అవసరమైన పరిస్థితు లనుకూడా వూడ్చి పారవేసి వుంటుంది. తన్మూలంగా తనవర్గాధిపత్యాన్నే రద్దుచేసు కొని వుంటుంది. వర్గాలూ, వర్గవిభేదాలూ గల పాతబూర్జువా సమాజానికి బదులు మన కొక నూతన సదస్సు లభిస్తుంది, ప్రతిఒక్కడూ స్వేచ్ఛగా అభివృద్ధిచెందినప్పుడే అందరూ స్వేచ్ఛగా అభివృద్ధి చెందగల సదస్సు అది. (ఏఒక్కడు స్వేచ్ఛగా అభివృద్ధి చెందకపోయినా, ఆమేరకు ఇతరులందరి స్వేచ్ఛాభివృద్ధీ కుంటుపడుతుం

చని అర్థం. ఒక కుటుంబంలో ఒకడు శారీరకంగా గానీ, మానసికంగానీ జబ్బుపడితే యితరులందరి సుఖశాంతులూ దెబ్బతిన్నట్లు)" (రెండవ ప్రకరణం చివరిభాగం ఆంధ్రానువాదం)

శ్రీశ్రీ 'మరోప్రపంచం'లో సూచించింది మార్క్సిజం వ్యవస్థలో ఉన్న మానవ సమాజాన్నే. ఈక్రింద వినిపిస్తుంది దాని ఆలోచనా విధానం.

'ఏదేశచరిత్ర చూచినా ఏమున్నది గర్వకారణం?
నరజాతి చరిత్ర సమస్తం పరపీడనపరాయణత్వం.

వర్గకలహం. చరిత్రగతికి మూలకారణ మని తాత్పర్యం.

'బలవంతులు దుర్బలజాతిని బానిసలను కావించారు
నరహంతలు ధరాధిపతులై చరిత్రమున ప్రసిద్ధి కెక్కారి.'

రాజరికాలనూ, వలసరాజ్యవిధానాన్ని గర్హిస్తూ 'జెంఘిజ్‌ఖాన్, తామర్లేనూ, నాదిర్షా ఘజ్నీ. ఘోరీ, సికిందరూ ఎవరైతేనేం ఒక్కొక్కడూ మహాహంతకు' డని వ్యాఖ్యానిస్తాడు శ్రీశ్రీ.

'పరస్పరం సంఘర్షించిన శక్తులతో చరిత్ర పుట్టెను'

అని గతితార్కికభౌతికవాదసారాన్ని సూత్రప్రాయంగా సంధించాడు.

'ఏ యుద్ధం ఎందుకు జరిగెనొ-ఏరాజ్యం ఎన్నాళ్ళుందో
తారీఖులు దస్తావేజులు - ఇవి కావోయ్ చరిత్ర కర్థం'
ఈ రాణీ ప్రేమపురాణం ఆ ముట్టడి కైన ఖర్చులూ
మతలబులూ కైఫీయత్తులూ-ఇవి కావోయ్‌చరిత్రసారం
ఇతిహాసపు చీకటికోణం అట్టడుగున పడి కాన్పించని
కథలన్నీ కావాలిప్పుడు దాచేస్తే దాగనిసత్యం.
నైలునదీనాగరకతలో సామాన్యుని జీవన మెట్టిది?
తాజ్‌మహల్ నిర్మాణానికి రాళ్లెత్తిన కూలీ లెవ్వరు?
సామ్రాజ్యపు దండయాత్రలో సామాన్యులసాహసమెట్టిది?
ప్రభు వెక్కిన పల్లకి కాదోయ్ అది మోసినబోయీలెవ్వరు?

పీక్లగాథలను తీర్చిదిద్దించే నిజమైన చరిత్ర అంటాడు శ్రీశ్రీ. సామ్యవాదసిద్ధాంతం సామవేదంలా వినిపించింది శ్రీశ్రీ మహాప్రస్థానంలో,

మార్క్సిస్టు సిద్ధాంతాన్ని నమ్మినా శ్రీశ్రీ మహాకవి. రమణీయార్థ ప్రతిపాదక శబ్దం ఆయనకావ్యం. ఆయన శబ్దశక్తి సారాన్ని ఆపోశనంపట్టిన అగస్త్యుడు. శబ్దంచేత ఆకృతులు నిర్మించకలడు. అర్థంచేత చిత్రాలను గీయగలడు. శబ్దంమీద ఎంతశక్తి ఉందో రసంమీద అంత అనురక్తి ఉంది. వస్తు వేదైనా ఆవిష్కరణంతో అనుభూతికి అగ్రతాంబూల మిస్తాడు.

'ఉండాలోయ్ కవితావేశం
కానీవోయ్ రసనిర్దేశం
దొరకదటోయ్ శోభాలేశం
కళ్లంటూ ఉంటే చూసి
వాక్కుంటే వ్రాసి
ప్రపంచ మొక పద్మవ్యూహం!
కవిత్వ మొక తీరని దాహం!'

ఆవేశం లేనిది వస్తువు కవితామయం కాదు. ఆవేశం అనుభూతి లేనిది రాదు. అనుభూతి నావిష్కరించటానికి ప్రతిభ కావాలి. అపూర్వవస్తునిర్మాణక్షమమైన నవనవోన్మేషంగా ప్రతిభ ప్రకాశించాలి. అప్పుడే శోభాలేశం దొరుకుతుంది. ప్రతిభా వ్యుత్పత్తితో కూడుకున్న వాక్కులో పుష్టిమంతంగా ప్రతిబింబిస్తుంది. కవి దర్శనానికి ప్రపంచమే ప్రాతిపదిక. ప్రపంచానుభవం రసానుభవంగా మారి భావనామయంగా కవితారూపంలో జాలువారుతుంది. అందుకనే ఏబర్ క్రోంబే 'The poet first derives inspiration from the world by the power of imagination, the art of Poetry then imitates the imaginative inspiration in language'- అని అంటాడు. ఎంత తోడినా తరుగని ఊట లాంటిది కవిత్వం. ఎంత త్రావినా తీరని దాహం లాంటిది కవిత్వం. ఈ మాట కవికీ వర్తిస్తుంది. సహృదయుడికీ వర్తిస్తుంది. కవితానిర్వచనాన్ని అనుభవైక వేద్యంగా చెప్పిన మహాకవుల్లో శ్రీశ్రీ ఒకడు. ఆయన రసవాది కావటం దానికి కారణం.

కవితకు ప్రాణమైన రసమున్న తరువాత దానిరూపం ఎలా ఉన్నా ఫరవా లేదు. రూపం ఎన్నుకున్న వస్తువునుబట్టి, చెప్పదలచుకున్న భావాన్ని బట్టి యేర్పడుతుంది. బహిరాకృతి భిన్నంకావచ్చు అంతరమైన చైతన్యం మాత్రం అనుభూతి. శ్రీశ్రీ తనకవితాస్వరూపాన్ని చెప్పుకున్న కావ్యఖండిక లున్నాయి. వాదాన్ని చెప్తున్నా హృదయసంవాదాన్ని కల్పిస్తాడు కవితలో. ఆత్మాశ్రయంగా చెప్పినా కవితావేశంతో విశ్వజనీనత్వాన్ని ప్రసాదిస్తాడు ప్రకటనలో

'సిందూరం రక్తచందనం
బంధూకం, సంధ్యారాగం
పులిచంపిన లేడినెత్తురూ
ఎగరేసిన ఎర్రనిజెండా
రుద్రాలిక నయనజ్వాలిక
కలకత్తా కాళికనాలిక
కావాలోయ్ నవకవనానికి'

చెపుతున్నది లక్షణసూత్రం. కాని, అది వాచ్యం కాదు. ఎర్రదనం కావాలని తాత్పర్యం తాను నమ్మిన సాంఘికసూత్రంలోని సూక్ష్మవిశేషాలన్నీ చెప్పటం శిల్పం. వాటి వ్యంగ్యసుందరంగా చెప్పటం మహాకవి లక్షణం. సిందూరం కార్యదీక్షకూ, రక్త చందనం త్యాగానికీ, బంధూకం విప్లవానికీ, సంధ్యారాగం సంఘర్షణకూ, పులిచంపి లేడినెత్తురు ధనికవర్గపు దౌర్జన్యానికీ, ఎగరేసిన ఎర్రనిజెండా కార్మికఉద్యమానికీ రుద్రాలిక నయనజ్వాలిక కలకత్తా కాళికనాలిక సామ్రాజ్యవాదుల రక్తదాహాని ప్రతీకలుగా నిలుస్తాయి; రమణీయవ్యంగ్యార్థాన్ని అందిస్తాయి. అందుకే ప్రాసక్రీడల్లో అంటాడు శ్రీశ్రీ 'సాహిత్యనభాంగణాన వ్యంగ్యానిది మొదటిపద్దు'.

"కదిలేదీ కదిలించేదీ
మారేదీ మార్పించేదీ
పాడేదీ పాడించేదీ
మునుముందుకు సాగించేదీ
పెనునిద్దుర వదిలించేదీ
పరిపూర్ణపు బ్రతుకిచ్చేదీ
కావాలోయ్ నవకవనానికి"

వ్యంగ్యం రసానుభూతి నందిస్తుంది. కవిలో కదిలే భావానుభూతులు సహృదయుడిలో అనుస్పందిస్తాయి. రసానుగుణంగా కవివాక్కు నిత్యనూతనత్వం భజిస్తుంది. రాగ మాధురి వినిపిస్తుంది. అభ్యుదయాన్ని ప్రబోధిస్తుంది. జాతిలో నూతనోత్తేజాన్ని కల్పిస్తుంది, పరిపూర్ణమానవజీవితస్వరూపాన్ని రమణీయంగా చిత్రించిన కవితాలక్షణ సూత్ర మిది. అందుకే Kellet అంటాడు. 'There is nothing like a poem absolute. The Poetry is a function of sympathy between

the author and his audience'. సమాజంకోసం సాహిత్యం సృష్టించిన శ్రీశ్రీ కవితాశక్తిని కమనీయంగా వ్యాఖ్యానించగల వక్త।

శ్రీశ్రీనవ్యకవిత్వాన్నిగూర్చి చెప్పిన కావ్యఖండాలలో 'కవితా!ఓకవితా!' అన్న గేయం కలికితురాయి వంటిది. కవితాతపస్సులో ఆయన దర్శించిన కవితామూర్తికి అందించిన వేడుకోలు.

'మరి నిన్ను స్మరిస్తే
నాకగుపించే దృశ్యాలా?
వినిపించే భాషేలా?
అగ్నిసరస్సున వికసించిన వజ్రం!
ఎగిరే లోహశ్యేనం
ఫిరంగిలో జ్వరం ధ్వనించే మృదంగనాదం!

నవకవిత్వం భావాల్లోనే కాదు నవ్యంగా సృష్టించిని పదబంధాల్లో నవ్యంగా భావించే రూపచిత్రాల్లో, ప్రౌఢంగా చెప్పే ప్రక్రియా విన్యాసంలో కూడా ఉంటుందని పై చరణాలు ధ్వనిస్తున్నాయి. 'అగ్నిసరస్సు' 'వికసించేవజ్రం' లోహశ్యేనం ఎగరటం, ఫిరంగిజ్వరంలో మృదంగనాదం పరస్పరవిరుద్ధాలు భీకర మనోహరాలు. క్రొత్త సృష్టిలో సమాజశక్తుల్లోలాగా సహజవైరుధ్యం చిత్రించే ప్రౌఢశిల్పం. కరుణార్ద్రమైన వస్తునిర్దేశంపట్ల కవిత క్రమంగా ప్రసరిస్తుంది.

"కడుపు దహించుకపోయే
పడుపుకత్తె రాక్షసరతిలో
అర్ధనిమీలిత నేత్రాల
భయంకర బాధలపాటల పల్లవి"

సమాజంలోని చీకటికోణంలో చిచ్చులు క్రమింగి చివికిపోయే జవరాలిగాథను టార్చివేసి చూపించి మనకన్నులకు కడవలు కట్టిస్తాడు. జనప్రియగీతంగా తన కవితను రూపొందించమని వాగ్దేవిని కోరుకుంటున్న ఘట్టం పఠితలకు పులకాంకురాలు కల్పిస్తుంది.

"నేడో, నాడూహించల
సాహసికాంసం కప్పిన నా
నిట్టూర్పులు వినిపిస్తాయా?
నే నేడో విలపిస్తానని

నా రచనలలో లోకం ప్రతిఫలించి,
నా గీతం గుండెలలో మూర్ఛిల్లగ
నాజాతి జనులు పాడుకునే
మంత్రంగా ప్రయోగించాలని
నా ఆకాశాలను
లోకానికి చేరువగా
నా ఆదర్శాలను
సోదరులంతా పంచుకొనే
వెలుగుల రవ్వలజడిగా
అందీ అందక పోయే
నీ చేలాంచలముల విసరుల
కొసగాలులతో నిర్మించిన
నానుడి నీగుడిగా
నాగీతం నైవేద్యంగా, హృద్యంగా
అర్పిస్తానో
నా విసరిన రసవిస్మృమర
కుసుమపరాగం
ఓహో! ఓరసధుని! మణిఖని! జననీ! ఓకవితా!
కవితా! కవితా! ఓకవితా!

ఈగీతం చదినప్పుడు అధ్యక్షస్థానంలో ఉన్న విశ్వనాథ సత్యనారాయణ గారు శ్రీశ్రీని చెమ్మగిల్లిన కన్నులతో కౌగిటజేర్చుకొని గౌరవించారట! ఆదర్శాలలో వారిద్దరూ వేరు కావచ్చు. అనుభూతిలో ఇరువురూ ఒక్కటై లీనమైపోయారు. శ్రీశ్రీ కవిత ఆ అనుభూతిలోనే అమరమై నిలిచిపోతుంది.

* * * *

శ్రీశ్రీరచనల్లో మహాప్రస్థాన కావ్యసంపుటి మకుటాయమానం; అభ్యుదయాంధ్రసాహిత్యమార్గానికి మహాకావ్యం.

'మహాకావ్యానికి క్రైటీరియా
సైజూ బరువూ కావయా
నిన్నటి మహాకావ్యం వద్దెనిమిది పర్వాలైతే
నేటిమహాకావ్యం పద్దెనిమిది పేజీలే!

పద్దెనిమిదిపర్వాలకావ్యం మహాభారతం. అది వీరరసప్రధానం. జాతిని ఉత్తేజపరిచేదీ ప్రవృత్తిని ప్రేరేపించేదీ వీరం. నవరసాల్లో ఉజ్జ్వలం వీరం. సర్వజీవమనఃప్రవృత్తికి మూలబీజం వీరం. శ్రీశ్రీ మహాప్రస్థానంలో వీరరసప్రస్తారం విస్తారంగా చేశాడు. పీడిత వర్గం స్వేచ్ఛాస్వాతంత్ర్యాలకోసం ధర్మవిప్లవం సాగించాలన్న ప్రబోధమే ఆయన కవితల్లో కనవచ్చే ఉత్సాహం. తిరుగుబాటులో ఎంత ఉత్సాహముందో కష్టజీవుల దుర్భర జీవితంలో అంత కరుణం ఉంది. వారిగాథల్నీ మనోవేదనల్నీ చిత్రించినప్పుడు శ్రీశ్రీ కరుణరసాన్నీ, కరుణాసారన్నీ జాలువారేటట్లు రచిస్తాడు. లలిత రసాల్లో శృంగారం తరువాత కరుణం ప్రధానం. అది రౌద్రరసజన్యం. వెట్టుబడిదారుల దారుణ కృత్యాలను సృష్టిస్తే అందులో రౌద్రం భాసించేది. శ్రీశ్రీ ఆఅంశాన్ని అధికంగా స్పృశించ కుండా బాధాసర్పదష్టుల విషాదవేదనల్నే విపులంగా సృష్టించాడు. మహాప్రస్థానంలో ఒకవైపు ఉవ్వెత్తుగా ఉదధి తరంగాల్లా లేచే ఉత్సాహగీతాలు, ఒకవైపు విషణ్ణమూర్తులను చిత్రించే కరుణార్ద్రగీతాలు కనపడతాయి. కరుణం స్త్రైణం కాబట్టి కవితలో ఆవేశం ఉండదు. అచ్చమైన భావ నివేదనం ఉంటుంది. వీరం పౌరుషరసం కాబట్టి గేయంలో కదనుతొక్కే గతితోపాటు పదను దేరిన పదజాలం ఉంటుంది. నలుపు తెలుపుల్లాగా ఈ రెండురసాల సన్నివేశం సమాజ నిజస్వరూపానికి ఛాయచిత్రాన్ని సంతరిస్తాయి.

**1941**లో ఫాసిస్టు శక్తులమీద రష్యా తిరుగబడి విమానాలదాడి చేసినవార్త విన్న శ్రీశ్రీ సమరోత్సాహంతో 'గర్జించురష్యా' గేయం వ్రాశాడు.

'గర్జించు రష్యా! గాండ్రించు రష్యా!
పర్జన్యశంఖం పలికించు రష్యా
దౌర్జన్యరాజ్యం ధ్వంసించు రష్యా!
లే లే రష్యా! రా రా, రష్యా!
రష్యా! రష్యా! రష్యా!, ఓరష్యా!....
'సుప్తకంకాళాలు మేలుకొంటున్నాయి!
ప్రపంచం పడగెత్తి బుసకొట్టి లేచింది!
కార్మికులు, కర్షకులు, తాడితులు, పీడితులు-
కెరటాలుగా పొంగి తిరగబడుతున్నారు!
ప్రపంచం నీకోసం పరిపక్వంగా ఉంది.
కోటిగొంతులు నిన్ను కోరి రమ్మన్నాయి;

కోటిచేతులు నిన్ను కౌగిలిస్తున్నాయి!
సైఅంటూ రష్యా! జై అంటూ రష్యా!
లే లే లే, రష్యా రా రా రా రష్యా!
రష్యా! రష్యా! రష్యా! ఓరష్యా!

ప్రపంచ ప్రజాశక్తికి ప్రతినిధిగా పొలికేకలు వేశాడు శ్రీశ్రీ. ఆనందోత్సాహాల కాపిలుపులు శబ్దసంకేతాలు. 'సుప్తకంకాళాల' వంటి ప్రతీకలుధ్వని సంకేతాలు. కవితాగౌరవంతో పాటు హృదయోద్వేగం చిత్రించిన ఈ కవిత--

'మెదడూ హృదయం మిశితమయే గుణం'
'అదే మహాకావ్యానికి ఏకైక లక్షణం' - అన్న లక్షణానికి లక్ష్యం.

ఇటువంటిదే శ్రీశ్రీ 'ప్రతిజ్ఞ'--

'నాలో కదిలే నవ్యకవిత్వం
కార్మికలోకపు కల్యాణానికి
శ్రామికలోకపు సౌభాగ్యానికి
సమర్పణంగా
సమర్చనంగా:....
కమ్మరి కొలిమీ, కమ్మరి చక్రం
జాలరి పగ్గం, సాలెల మగ్గం
శరీరకష్టం స్ఫురింపజేసే
గొడ్డలి, రంపం, కొడవలి, నాగలి
సహస్ర వృత్తుల సమస్తచిహ్నాలు-
నా వినుతించే, నా విరుతించే
నా వినిపించే నవీనరీతికి
నా విరచించే నవీనగీతికి
భావం! భాగ్యం!
ప్రాణం! ప్రణవం!....

కార్మికశ్రామికలోక కల్యాణానికై కలంపట్టిన కవి వారివృత్తిచిహ్నాలనే మనఃప్రవృత్తి సంకేతాలుగా భావించి కీర్తిస్తానని ప్రతిజ్ఞ చేశాడు. ప్రతిజ్ఞే కాదు ఆత్మప్రజ్ఞాప్రాభవాన్ని సగర్వంగా చెప్పుకొని కవి వీరుడులా లోకాన్ని మంత్రముగ్ధం చేస్తాడు.

'నే నొక దుర్గం!
నా దొక స్వర్గం!
అనర్గళం, అనితరసాధ్యం నామార్గం!'

*　　*　　*　　*

శ్రీశ్రీ కరుణ(ణా)రస ఘట్టాలను చిత్రించే కవితల్లో ఆడంబరం లేని అర్థవంతమైన రచనాశిల్పాన్ని ప్రదర్శిస్తాడు. మహాప్రస్థానంలో 'ఆకాశదీపం', 'బాటసారి', 'భిక్షువర్షీయసి' కావ్యఖండాలు ఇందుకు నిదర్శనలు.

ఆకాశదీపంలో - 'ఒక దురదృష్టజీవి - ఉదయం ఆరున్నరకు - ఆ గదిలోనే ఆరిపోయాడు' అన్నది వస్తువు. ఈసంగతి ఆగేయం నడిమిభాగాన చెపుతాడు కవి. 'దురదృష్టజీవి' అన్న విశేషణంతప్ప ఆమృతవ్యక్తిని గూర్చి మరే అంశం మనకు తెలియరాదు. ఆతనిజీవితం వడ్డించినవిస్తరి కాదని శ్రీశ్రీకవితాసంస్కారం చెప్తుంది. ఉదయం ఆరున్నరకు దీపంలా అతడు ఆరిపోయాడు. 'దీపంలా' అని అనకుండా 'ఆరిపోయాడు'డన్న క్రియాశక్తిచేత దాన్ని స్ఫురింప చేస్తాడుకవి. ఎందుకంటే దీపాన్ని ప్రతీకగా గేయంలో తీసుకొని తర్వాతభాగం నడిపించాడు కాబట్టి మూడు ముక్కల్లో ముగించే యీ చిన్నవృత్తాంతానికి ముందువెనుకల ఉపోద్ఘాతోపసంహారాలున్నాయి. ఉపోద్ఘాతం సూటిగా మూడువిషయాలు చెపుతుంది. 1. 'గదిలో ఎవరూ లేరు; గది నిండా నిశ్శబ్దం; సాయంత్రం ఆరున్నర-గదిలోపల చినుకులవలె చీకట్లు;' 2. చూపు లేని చూపులతో తేరిచూస్తున్నది గది; గదిలోపల ఏవేవో ఆవిరులు: 3. దూరాన నింగిన తోచిన ఒకచుక్క మిణుకుచూపులు మెలమెల్లగా విసరి గదిని తలపోతతో కౌగిలించుకొంటున్నది. ఈకథనంలో శిల్పం ఉంది. వాతావరణ వర్ణనంద్వారా వాస్తవాన్ని ధ్వనింపచేయటం ఇందులోని రహస్యం. 'ఎవరూ లేరని' ప్రారంభించటంలోనే అది మొదలైంది. 'చూపులేని చూపులో' అదికొంత తేటతెల్లమయింది. 'నింగిన తోచిన చుక్క' ఆతాత్పర్యాన్ని మినుకుమినుకు మని సూచిస్తున్నది. ఇక ఉపసంహారభాగంలో ఒక దీపంకథ ఉంది. ఆరిపోయిన ఆవ్యక్తికీ ఈదీపానికీ అభేదాధ్యవసాయమో, బింబ ప్రతిబింబభావమో సింబల్ ద్వారా మనం గ్రహించాలి. దీపం మూలనక్కి మూలుగుతున్న దనటంతోనే అది స్పష్టమౌతుంది. ఆమూలుగు ఆకలివేదన వలన; ప్రమిదలో చమురు త్రాగుతూండటం నీళ్లో, గంజో త్రాగి బ్రతుకు నిలుపుకోవటం, చీకటిబోనులో ఉన్నసింహం విధివక్రించిన దురదృష్టజాతకం; కత్తిగంటు మీద నెత్తురుబొట్టు లాగుంది దీప మనటంలో ఆవ్యక్తి ఆత్మహత్య కాలోచించాడని

వ్యంగ్యం. ఆకస్మాత్తుగా ఆకాశ తారను చూడటం హఠాత్మరణాన్ని సూచిస్తుంది. ప్రతీకద్వారా గతచరిత్రను ధ్వనింపజేయటం ఇందులోని కథాకథనశిల్పం.

ఇదంతా ఒకయెత్తు చివరి రెండుపాదా లొకయెత్తు 'దీపం ఆరిపోయింది - తారగా మారిపోయింది'. ఆ అభాగ్యునిజీవితంమీద వెలుగుపొడిగా చల్లిన కరుణావ్యాఖ్య ఇది. ఉదయం ఆరిపోయిన ఆదీపానికి సాయంకాలమయినా సానుభూతి చూపించే దిక్కులేదని వస్తుధ్వని, దిక్కులేని ఆజీవిని రిక్కగా వెలిగించటం కవిసానుభూతి.

'బాటసారి' గేయంకూడా ఇలాంటిదే. కాని, దాని రచనాశిల్పం వేరు. కవికథనం రన్నింగ్ కామెంటరీగా ఉంటుంది. కూటికోసం, కూలికోసం పట్టణంలో బ్రదుకుదామని బాటసారి బయలుదేరాడు. అతడు బాలుడని వర్ణనం వ్యంగ్యంచేస్తుంది. బయలుదేరి నప్పటినుంచీ జర్వం కాస్తే: భయం వేస్తే - ప్రలాపిస్తే: చిమ్మటిచీకటి క్రమ్ముకొస్తే- దారి తప్పిన బాటసారికి ఎంతకష్టం ! - అని ముందు జరుగబోయే విషాదాంతసంఘట నకు విత్తులు నాటుకుంటూ పతితమనస్సు నున్ముఖీకరణం చేస్తాడు కవి.

ఆపైన కళ్ల వాకిట నిలిపి చూసే పల్లెటూళ్ళో తల్లి "పలవరింపును" పేర్కొం టాడు, తల్లిమాటలు చెవినిపెట్టక బయలుదేరిన ఆబాటసారి కేదో కీడు ముంచుకొస్తుం దని చెప్పి మనకు సానుభూతిని కల్పించుటమే కాకుండా, పుత్రశోకవార్నిధిలా వాకిట నిలిచిన తల్లిని కన్నులకు కట్టించి కరుణరసాన్ని జాలువారిస్తాడు.

చివరకు చెప్పదలచుకుంది వాచ్యంచేసి వదలితే ముగింపుకు బిగువులేదు. అందువల్ల మృత్యువును సూచించే వాతావరణాన్ని వర్ణించి శిల్పం చూపించాడుశ్రీశ్రీ. ఈరచనలో సంవిధానశిల్పంతోపాటు అలంకారశిల్పం ఉంది బాటసారి స్థితి 'నడిసము ద్రపు నావరీతిగ' ఉన్నదనే ఒక్క ఉపమానంవల్ల కథకంతా వెలుగు వస్తుంది. 'రాత్రి నల్లనిరాతి పోలిక గుండెమీదనె కూరుచుండగ' అన్న ఉపమానంవల్ల తల్లడిల్లే తల్లి మనసు తెలుస్తున్నది.'పల్లెటూళ్లో తల్లికేదో పాడుకలలో పేగుకదిలింది' అనిముగించ టంలో పూర్వాపరకథాసంవిధానశిల్పం ద్యోతమానం అవుతోంది. బాటసారి కావ్య ఖండికమీద టాగూర్ ప్రభావం కొంత ఉంది,

'భిక్షువర్షీయసి' శిల్పం వేరు. విభావవర్ణనం ద్వారా పాత్రమీద సానుభూతి కల్గించటం - ఆపైన ఆ పాత్ర అలా కావటానికి హేతువునుగూర్చిన పర్యాలోచనం రేకెత్తించటం ఇందులోవి సంయోజనశిల్పం. సన్నివేశం నుండి సమస్యను రేకెత్తించే కథనమర్మం ఇందులో ఉంది. అదే కార్యకారణసంబంధం.

"జారిపక్క, చెట్టుక్రింద
ఆరిన కుపంటి విధాన
కూర్చున్నది ముసల్దొకతె
మూలుగుతూ ముసురుతున్న
ఈగలతో వేగలేక"

'ఆరినకుంపటి విధాన' అన్న ఉపమానం ఈ గీతంలో వెలుదు.

"ఆ అవ్వే మరణిస్తే
ఆ పాపం ఎవ్వరి? దని
వెర్రిగాలి ప్రశ్నిస్తూ
వెళ్ళిపోయింది."

ఈ ప్రశ్నయే ఈకావ్యఖండంలో ఆలోచనాతరంగం: భావచైతన్యం

"కమ్మె చిమ్మచీకట్లూ
దుమ్ము రేగె నంతలోన
'ఇది నాపాపం కా' దనె
ఎగిరివచ్చి ఎంగిలాకు

ఈ ముగింపు పఠిత ఊహించి ఉండడు కాబట్టి అబ్బురపాటు చెందుతాడు. 'ఎంగిలాకు' ఆమెనుగురించీ ఆమెచావుకు కారణమైన సమాజాన్నిగురించీ ఏన్నోకథలు వ్యంగ్యంగా చెపుతుంది. బిక్షువర్షీయసిలో ఎత్తుగడ ఎంత సహజంగా ఉందో ముగింపు అంత బిగింపుగా ఉంది. విమర్శకుల ప్రశంస లందుకొన్న ఈగేయం శ్రీశ్రీకవితా శిల్పానికి పతాక!

శ్రీశ్రీ ప్రాచ్యపాశ్చాత్య కావ్యసంప్రదాయాల్లో ఉన్న శిల్పరహస్యాలు తెలిసిన మనీషి. తెలిసి వ్రాసిందే శిల్పం. 'ప్రౌఢశిల్పజగత్తున ప్రథమగణ్యుడగును కవి; కవితా శిల్ప మతని దగుట' - అని 1928లోనే చెప్పాడు. గతం వర్తమానం ఆయనలో జీర్ణమై క్రొత్తకవితాశక్తిని అవిర్భవింపచేశాయి.

'లోకాలు - భవభూతి శ్లోకాలు - పరమేష్టి జూకాలు నా మహోద్రేకాలు' అన్నప్పుడు గీర్వాణసాహిత్యసమాలోచనమూ, పుష్కిన్, గొగోల్, షెకోవ్, టాల్‌స్టాయ్, డోస్టోవస్కీ, గోర్కీ, కూప్రిన్-శిల్పసమ్రాట్టులై జీవితం మధించి వ్రాసిన కావ్య తత్త్వాన్వేషణమూ ఆయన క్షుణ్ణంగా చేశాడు. సంస్కృతాంధ్ర పాశ్చాత్య సాహితీ

సంప్రదాయాల త్రివేణీసంగమం శ్రీశ్రీ ప్రతిభాపరీవాహ క్షేత్రం. శిల్పులైన అభ్యుదయ కవుల్లో శ్రీశ్రీ ప్రథమగణ్యుడు!

* * * *

"ఆధునికాంధ్ర కవుల రచనలను సరిగా అర్థంచేసుకోవడానికి వాటి వెనుక జానటగా నిలిచిన ఇతరదేశాల సాహిత్య వ్యవసాయాలను గమనించక తప్పదు. నేటి రచనలను విశ్వపర్యాప్తమైన విశాలజీవితంతో సమన్వయించి నిజమైన కవిత్వమేదో, కేవలం నిర్జీవ శుష్కానుకరణం ఏదో గుర్తించా"లని శ్రీశ్రీ 'నేటి తెనుగుకవిత-కొత్త పోకడలు' అన్న ప్రసంగవ్యాసంలో పేర్కొన్నాడు.

యూరప్‌లో ప్రపంచ మహాసంగ్రామం సాగుతున్న రోజుల్లో ఇటలీలో సినార్ మారినెట్టీ భావికళ (Futurism)ను ప్రచారంలోకి తెచ్చాడు. శిథిలాలనుండి నూతన సృష్టి వెలువడుతుందని ఆయన సిద్ధాంతం. ప్రాచీనసాహిత్యాన్నంతా తగులబెట్టమనీ యంత్రాలనుండీ, చలనచిత్రాలనుండీ, వార్తాపత్రికల శీర్షికలనుండీ కావ్యవస్తువులను స్వీకరించాలనీ ప్రబోధించాడు. ధ్వనులే సంగీతమనీ, మాటలే కవిత్వమనీ, రంగులే శిల్పచిత్రాలనీ పేర్కొన్నాడు. అదే సమయంలో ఫ్రాన్సుదేశంలో క్యూబిజం, జర్మనీలో ఎక్స్‌ప్రెషనిజం, అమెరికాలో ఇమేజిజం, తలయెత్తాయి. కళాక్షేత్రంలో మొదలై కవితారంగంలో విహరించాయి. ఈ ప్రయోగరచయితలందరూ ఛందస్సు, అలంకారం, వ్యాకరణం, అన్వయంలాంటి కళాధర్మాల నన్నింటినీ త్రోసిరాజని క్రొత్తగమనాలతో లయలతో, సంగతులతో రచనలు సాగించారు. గతాన్ని నిరసించి ధ్వంసంచేసే సాహిత్యప్రక్రియల్లో డాడాయిజం శక్తిమంత మైంది. ట్రిస్టన్‌జారా (Tristan Tzara) దీనికి మూలపురుషుడు. వస్తువు, భావం, రచనాక్రమం లేకుండా రచనలో అర్థరహితమైన వాక్యవిన్యాసం. అయోమయమైన శీర్షికలూ, ఏమాటనైనా ఏ అర్థంలోనైనా ఉపయోగించే విశృంఖలత్వం వీరు ప్రకటించారు. సాహిత్యక్షేత్రంలో అరాజకం సృష్టించటమే ఈ ఉద్యమధ్యేయం. ఈ ప్రయోగం నిర్మాణాత్మకమైన సాహిత్యాన్ని సృజించ లేకపోయింది. కొలదికాలంలోనే అంతరించిపోయింది.

డాడాయిజంలో విశ్లథమైపోయిన శబ్దశిల్పం సర్రియలిజంలో ప్రాణంపోసుకొని నూత్నతేజస్సుతో క్రమశిక్షణతో ఉద్భవిల్లింది. ఫ్రాయిడ్ మనోవిశ్లేషణశాస్త్రం, ఐన్‌స్టీన్ సాపేక్షసిద్ధాంతం (రిలెటివిటీ థియరీ) దీని మీద బలమైన ముద్రవేశాయి.

ఈ ఉద్యమనాయకుడు అండేగ్రెబ్రెటన్. మానవుని వ్యక్తావ్యక్తావస్థ(sub-conscious) లో భాసించే అనుభూతులకు రూపకల్పనం చేయటమే ఈ పద్ధతిలో ప్రధాన ధర్మం. సంప్రదాయాన్ని సహేతుకంగా నిరసించడం, వ్యంగ్యాధిక్షేపాలతో గతాన్ని అవహేళనం చేయటం, నీతిధర్మ సూత్రాలను గర్హించటం ఈ కవితలో కనపడే వైలక్షణ్యం. 'రాజకీయాలలో నానాజాతిసమితి ఎటువంటిదో కళాప్రపంచంలో సర్రియలిజం అట్టిదని చెప్పాలి' అని శ్రీశ్రీ అంటాడు.

ఫ్రాన్సులో పుట్టిన మరొకవాదం సింబాలిజం. బాడ్లేర్ ప్రతిపాదించిన ఈ ప్రక్రియను తెలుగులో ప్రతీకవాద మని పిలుస్తున్నారు. వార్లేన్, మలార్మే వంటి వారు దీనిని పోషించారు. సంగీతంలో రాగానికి లాగానే కవిత్వంలో శబ్దానికి ప్రాధాన్యం, వ్యంగ్యశక్తి ఉంది. శబ్దం భావప్రకటనంకంటే భావసూచననే చేయ గలుగుతుంది. కవితలో విషయవివరణం కంటె వాతావరణకల్పనం ప్రధానంగా ఉండాలి. ఉపమాద్యలంకారాలు వ్యంగ్యాన్ని భంజిస్తాయి కాబట్టి ప్రతీకలద్వారా భావాన్ని భావనామధురం చెయ్యాలి, సంగీతంలాగా కవిత్వం వల్ల కూడా కలిగేది అవ్యక్త మాధుర్యమే-అని వీరి సిద్ధాంతము. ఇది కవిత్వాన్ని జీవితసమస్యలనుండి దూరంచేసి భావలోకాల్లో విహరింప చేసింది. ఆడెన్ మొదలైన వామపక్షీయులు మార్క్సిస్ట్ దృక్పథంతో కవిత్వంలో మధ్యతరగతి ప్రజలను, పీడితజనుల దుర్భరజీవితసమస్యలను వర్ణించటం మొదలు పెట్టారు. ఛందోవ్యాకరణ సంప్రదాయాలను అవసరమైనప్పుడు ధిక్కరించారు. వీరిది భౌతికవాదదృక్పథం.

శ్రీశ్రీకవిత్వంలో ఆధునిక పాశ్చాత్య కవితాప్రయోగాల ప్రభావం కనపడుతుంది. కాని, వీరి ప్రధానదృక్పథం భౌతికవాదం- "వీరు ఆకాశంలోకి వెళ్ళి నక్షత్రపథాల్లో విహరించినట్లే భూమికికూడా చేరువగా వచ్చి ఇదివరకు కవులు ప్రవేశించని చీకటికోణాలలోనికి కాంతికిరణాలు పంపిస్తున్నారు. నగరజీవితం, పారిశ్రామికపరిస్థితుల హృదయవిదారకదృశ్యాలు, పతనోన్ముఖమైన పాతసంఘపు వికిరనృత్యం, తమ కావ్యవస్తువులుగా తీసుకొన్నారు. ఈమార్గంలో వీరికి రష్యన్ ఫ్యూచరిజం ఆదర్శమౌతున్నది, మయకోవస్కీ, పాస్టెర్నాక్ మొదలైన కవుల రచనలు పీడితలోకంలో వీరికి సానుక్రోశం కలిగించాయి. కుబేరవైభవం ప్రక్కనే కుచేల దారిద్ర్యం కనపడటానికి వీరు నిర్ఘాంతపోతున్నారు. ఒక్కసారి తనచుట్టూ చూస్తే సంఘదూషితులైన ప్రవాసజీవులు దరిద్రభిక్షువులు, జీవనోపాధికి శరీరకష్టం తప్ప వేరే ఆధారంలేని కష్టజీవులు

కాసవస్తున్నారు. తమకవితలో వారిదారుణదృశ్యాలు ప్రదర్శించి లోకం కళ్లు" తెరిపిస్తున్నారు. అభ్యుదయభేరి మ్రోగిస్తున్నారు.

శ్రీశ్రీ మహాప్రస్థాన కావ్యసంపుటిలో వస్తువు లెన్నుకోటానికి ప్రేరణ కల్పించింది గతితార్కికభౌతికవాదం. కవితాప్రకటనలో తోడ్పడింది ప్రతీకవాదం. ఆయన ప్రతీక వాదానికి ప్రతి కావ్యఖండం ఉదాహరణమైనా అందులో మిన్నగా భాసించేది 'జగన్నాథునిరథచక్రాలు'. జగన్నాథునిథచక్రాలు ప్రజాశక్తి సాధించే సమసమాజవ్యవస్థకు ప్రతీక. శనిదేవత రథచక్రాలు బూర్జువావ్యవస్థకు ప్రతీక; పీడితలోకాన్ని 'శనిదేవత రథచక్రపుటిరుసులలో పడి నలిగిన దీనులార! హీనులార' అని సంబోధిస్తాడు. 'దగాపడిన తమ్ములార! మీకోసం కలంపట్టి ఆకాశపుదారులంట,హడావుడిగా వెళిపోయె అరచుకుంటు వెళిపోయె,జగన్నాథునిరథచక్రాల్, రథచక్రప్రళయఘోష,భూమార్గం పట్టిస్తాను! భూకంపం పుట్టిస్తాను!' అని అభయహస్తం ఇస్తాడు. 'స్వాతంత్ర్యం, సమభావం, సౌభ్రాత్రం సౌహార్దం, పునాదులై ఇళ్ళులేచి, జనావళికి శుభం పూచి, శాంతి శాంతి కాంతి శాంతి జగమంత జయిస్తుంది. ఈ స్వప్నం నిజమౌతుంది, ఈ స్వర్గం ఋజువౌతుంది, అని సమసమాజ శాంతిపాఠం పఠిస్తాడు. సమసమాజం విశ్వశాంతికి మూలకందమని విశ్వసించిన శ్రీశ్రీ 'నేనుసైతం ప్రపంచాబ్జపు తెల్లరేకై పల్లవిస్తాను; నేనుసైతం విశ్వవీణకు తంత్రినై మూర్ఛనలు పోతాను; నేనుసైతం భువనభవనపు బావుటానై పైకిలేస్తాను'-అనివిజయభేరితో ఆశాభాంకారాన్ని చేశాడు. ఆ కల నిజం చేయాలనే ఆయన కలంపట్టాడు-కాహళలా కవితను మ్రోయించాడు.

* * * *

శ్రీశ్రీ రచనకు స్వేచ్ఛ ప్రధానగుణం పద్యమైనా; గేయమైనా ఆయన చేతుల్లో వింతపోకడ పోయింది. బహిరాకృతికంటే భావలయ కాయన ప్రాధాన్యమిస్తాడు. వ్యక్తావ్యక్త చేతనలో నుండి ఉబికిన ఊహాచిత్రాలను గేయగతుల్లో విచిత్రంగా రూపిస్తాడు. గేయం నియతగతిలో నడవాలన్న నియమం ఆయనకు లేదు. అసలు నియమంమీద కంటే అంతర్లయ సంయమనం మీదనే ఆయన ఊనిక ఇస్తాడు. సమమాత్రకాలైన పాదాలతో గేయం గమించిందంటే అది అంతర్లయలోని హార్మోనీని తెల్పుతుంది.ఉద్వేగభావశకలాల కలకలావిష్కారాన్ని వ్యక్తంచేసేటప్పుడు గేయంలో వచనం, వచనంలో గేయం నిరాఘాటంగా చొచ్చుక పోతుంటాయి. గతివైవిధ్యం భావశబలతనే కాకుండా, భావవైరుధ్యాన్నిగూడా నిపుణంగా ప్రదర్శిస్తుంది. ఛందస్సుకు ప్రాణమైన ఋతం భరత్వంశ్రీశ్రీహృదయవీణలో మోగుతుంది. లోకంలోని

అపశ్రుతులతోకలసి అంతర్వీణ ఘోషిస్తుంది-అపశ్రుతులమధ్యకూడా శ్రుతిసుభగత్వం అంతర్వాహినిగా ప్రవహిస్తుంది. అందువల్లే ఆయన వచనగీతాలు కూడా పఠితకు అనిర్వచనీయమైన హాయిని చేకూరుస్తాయి.ఆధునికాంధ్ర వచనకవుల్లో శ్రీశ్రీసాధించిన ఛందోహృదయజ్ఞానం అందరిలో కనపడదు. వచనగీతరచనం కత్తిమీదసామువంటిది. శ్రీశ్రీమాటల్లో-"వచనగీతం అంటే చేతికి వచ్చిన వ్రాత కాదు. వ్యర్థపదాలు లేకుండా వచనం వ్రాయుటం మరీకష్టం. పద్యరచనలో ఛందస్సీరాల్లు కవులను కాపాడి నడిపిస్తాయి. వచనగీతంలో బైటినుండి ఇట్టి సహాయం రాదు. కవి తన అంతర్జగత్తులో నుండి మాత్రమే వల్లికలు కల్పించుకోవాలి. వచనగీతం తనరూపం తానే నిరూపించుకుంటుంది....వచనగీతానికి పాణప్రదమైన లక్షణం గమనవైవిధ్యం. ఇది సంభాషణలోని యాసలూ. కాకువులూ, ఉచ్చారణ విశేషాలమీద ఆధారపడి ఉంటుంది. శైలికి రీతికి సంబంధించిన సమస్యలెన్నో వీనినుండి బయలుదేరుతాయి'. గీతంలోలాగే వచనంలో కూడా అనితరసాధ్యమైన కవితామార్గాన్ని నిర్మించుకొన్న మహాకవి శ్రీశ్రీ

శ్రీశ్రీ స్వేచ్ఛ ఛందంలోనే కాదు. భాషలో ప్రయోగంలోకూడా కనపడుతుంది. తిరుగుబాటు ధోరణికి స్వేచ్ఛ ఊతకర్ర. 'కవితా ఓ కవితా' గేయంలో 'మాటలకై వెదుకాడబోతే - అవి - పుంఖానుపుంఖంగా - శ్మశానాలవంటి నిఘంటువుల దాటి. వ్యాకరణాల సంకెళ్ళు విడిచి-ఛందస్సుల సర్పపరిష్వంగం వదలి- వడిగా వడివడిగా పరుగెత్తుతా' యంటాడు.

'విప్లవం మున్ముందు మనుష్యుని మనస్సులో ప్రారంభమవుతుంది.
మనఃప్రపంచానికి బాహ్యస్వరూపం బాష
భాషావిప్లవమే భావవిప్లవం" అని వ్యావహారికాంధ్రభాషనే తన గేయాల్లో వాడాడు- 'వ్యవహారాంధ్రం జీవ
త్ప్రవాహ మది వదలిపెట్టి పాతదయిన స్థా
ణు వయిన గ్రాంథికభాషను
చెవి నెవ్వను పెట్టు నేడు? సిరిసిరి మువ్వా!'
అని ప్రజాభాషకు సాహిత్యంలో ప్రాభవాన్ని కల్పించాడు,

భాషలో, భావంలో, ఛందంలో, పదబంధంలో, అలంకారంలో, ఉక్తిచమత్కారంలో క్రొత్తపోకడలుపోయి తనదైన ఒక జగత్తును సృష్టించు కొన్నాడు శ్రీశ్రీ. ఆయన దర్శనంలో చంద్రుడు- 'వంపుతేరినకత్తి', 'ఆకాశపుఎడారిలో కాళ్ళు

తెగిన ఒంటె', 'ఆకాశంమీద రాకాశికోర'.శ్రీశ్రీ సృష్టిలో ప్రతివస్తువూ అపూర్వవ్యక్తి; స్వేచ్ఛలోనుంచి పుట్టిన అంతర్వ్యక్తి.

శ్రీశ్రీ తన 'ఖడ్గసృష్టి' 'మహాసంకల్పం' ఇతరకృతుల్లో ప్రయోగానురక్తి అధికంగా ప్రదర్శించాడు. సంప్రదాయ నిర్మూలనానికి ఆయన కలాన్ని ఖడ్గంగా సమాయత్తంచేశాడు. 'అందుకే సృష్టిస్తున్నాను, అధర్మనిధనం చేసే ఈ ఖడ్గాన్ని-కలంతో సృష్టిస్తున్న ఖడ్గం ఇది, జనంతో నిర్మిస్తున్న స్వర్గం ఇది" 'ఈ కత్తి బూజుపట్టిన భావాలకి పునవర్జవం ఇవ్వటానికి కాదు - కుళ్ళిపోతున్న సమాజవృక్షాన్ని సమూలచ్ఛేదం చెయ్యడాని" కని నిక్కచ్చిగా చెప్పాడు. వీరవాది ఉగ్రవాది లక్షణాలను ప్రదర్శించాడు. అధివాస్తవిక ధోరణిలోనే అధిక్షేపానికి అభిమానం చూపించాడు.

"అర్థాన్ని అధ్వాన్నపు అడవిలో వదలి
గద్యానికి పద్యానికి పెళ్లి చేదాం
కాదన్న మాదన్న యెవడన్నా ఉంటే
వేమన్న యేమన్నాడో చూడమందాం"

'26' అన్న శీర్షికలో డాడాయిజం. 'జోన్'లో క్యూబిజం, అలాగే కొన్నిగేయాల్లో ఇమేజిజం' బహుళంగా సర్రియలిజం శ్రీశ్రీ ప్రయోగించాడు.

"జీబ్రాకి algebra చిహ్నాల
లాంకోటూ పాంకోళ్ళూ తొడిగి
సాహిత్యపౌరోహిత్యం ఇస్తే
వెర్రికాదు Surrealism రా సోదరా!" పొమ్మన్నాడు.

పాశ్చాత్యప్రక్రియలతో పాటు ప్రసిద్ధకవుల రచనల్నికూడా తెలుగు చేసి, ఆంధ్ర సాహిత్యాన్ని సంపన్నంచేశాడు శ్రీశ్రీ. టెన్నిసన్, జార్జివిలియమ్‌రసెల్. W.H. డేవిస్, ఎడ్గార్ ఆలెన్‌పో, స్విన్‌బర్న్, ఎమిలే వెర్‌హెరెన్, అలెగ్జాండర్‌బ్లాక్, Paul Eluard, James Joyce, Andre Breten, Charles Baudelaire, Eancois Villon, Guillaume Apollinaire, Dylan Thomas, Henry Michaux, Salvador Dali, Walt Witman, E.E. Cummings, Vladimuir Mayokovsky, Pablo Neruda, Alexander Pushkin మొదలైన పాశ్చాత్యుల రచనలు, హరీంద్ర ఛట్టోపాధ్యాయ వంటి భారతీయుల రచనలు శ్రీశ్రీ స్వతంత్రప్రతిభాశక్తితో తెలుగులో సజీవచైతన్యాన్ని సంతరించుకొన్నాయి.

జలపాతాల్లాంటి శ్రీశ్రీ ప్రసిద్ధగేయాలతోపాటు హాస్యరసశీకరాల వంటి శత కాలుకూడా ఉన్నాయి. దాన్ని విదూషకనాహాత్య మంటాడు శ్రీశ్రీ. అయితే ఇవి కేవలం నవ్వించటానికి మాత్రమే వ్రాయలేదు. పత్రికాప్రపంచంలో కార్టూనులు నిర్వహించే విధిని ఈకవిత్వంద్వారా నిర్వహించా నంటాడు. దీన్ని కార్టూనుకవిత్వ మని కూడా పేర్కొనవచ్చంటాడు.

సిరిసిరిమువ్వ, ప్రాసక్రీడలు, లిమరుక్కులు, కుక్కుటేశ్వరశతకం, ఈశాఖలో ర్కొన దదినవి. సిరిసిరిమువ్వ శతకంలో--

"నాలాగ కందబంధ
జ్వాలాజాలాగ్ర సంవసత్ సద్గీతా
లాలాపించే కవితా
శ్రీలోలుడు నహి నహీతి, సిరిసిరిమువ్వా!"

అన్నవీరవాక్యాలతోపాటు-

'కోయకుమీ సొరకాయలు
వ్రాయకుమీ నవల లని అవాకు చెవాకుల్
డాయకుమీ అరవఫిలిం.
చేయకుమీ చేబదుళ్ళు సిరిసిరిమువ్వా!"

అనేపారడీ నీతివాక్యాలూ--

'రామాయణాలనే మ
ళ్ళీమళ్ళీ దెచ్చి ముచ్చిలించే కన్నా
ఆమోస్తరు రచనల్లో
క్షేమంగద రామకోటి సిరిసిరిమువ్వా!"

అన్న వేడి ఛలోక్తులూ--

'Gold వ్యామోహం చెడ్డది
Mild వ్యాపారం శరీర మాద్యం ఖలుడా
Child వ్యాపారం కూడదు
Old వ్యాలను హోల్డుచేయకోయి సిరిసిరీ!"

అన్న మణిప్రవాళ సంకరపద్యాలూ - ఎన్నో కనపడతాయి.
లిమరిక్కులో-'సమకాలిక జీవితమే-సత్కవితావస్తువు

ఆనృషీ, కుకవీ చచ్చిన - వంటే పడి చస్తురు!
నవరసాల నాయకుణ్ణి - కవనం నా ఆయుధం
ఈ శతాబ్ది నేలుతుంటి - బీభత్సరసాయం
కరుణరసం, శృంగారం - వాడిన పూరేకులు
వీరరసం, భీభత్సం - ఈనాటి తుపాకులు!'

ఇలా ఆధునికకవిత్వ వివేచనాన్ని గూర్చి చెప్పిన వాక్యాలొకవైపు వెలుగుల్లా ప్రకాశిస్తుంటే - వ్యక్తిదూషణ పార్టీదూషణ పరమైన వ్యాకాలు మచ్చలుగా నిజంగా జుగుప్సనే కలిగిస్తాయి. ఎవరే మనుకున్నా శ్రీశ్రీ మాత్రం - తన Self Potraitను

'విదూషకుడి Temperment
ఏదో ఒక discontent
బ్రతుకులో experiment
పదాలు patent రసాలు torrent
సదసత్సమస్యకి solvent శ్రీశ్రీ gaint'

అని చిత్రించు కొన్నప్పుడు వెలుగునీడల శ్రీశ్రీని చూచి నిబ్బరించుకుంటాం శ్రీనాథుని చాటువులకూ శృంగారనైషధానికీ ఎంత తేడా ఉందో శ్రీశ్రీ విదూషక కవిత్వానికీ మహాప్రస్థానానికీ అంత అంతర ముంది. దాన్ని గుర్తిస్తే చాలు.

*　　*　　*　　*

శ్రీశ్రీకవితా జీవితం ఒకమహాస్రవంతి. ప్రభవలో పర్వతాగ్రంనుండి జాలు వారుతున్న నిర్ఝరిలా కనపడుతుంది. మహాప్రస్థానంలో గోదావరిలా ఉప్పొంగి ప్రవహిస్తుంది. ఆ తరువాత పాయలై ప్రవహిస్తుంది. నిర్ఝరిలో మనం నడిచిపోవచ్చు. గోదావరి గాంభీర్యాన్ని అందుకోవటానికి ఈదాలి, నావలో యానం చేయాలి. ఒడ్డు చేరుకోవాలి. పాయల్లో పాషాణాలు కాళ్ళకు గుచ్చుంటాయి! గాయాలు తగిలినా తగలవచ్చు-అందులో నడిచిం దల్లా మంచిదోవ కాదేమో? భద్రంగా దాటాలి. ఆ ద్యంతాలు వదలిపెడితే శ్రీశ్రీ వ్యక్తిత్వం నిండుగా, దండిగా మహాప్రస్థానంలో-కనపడుతుంది. అదే ఆయన్ని యుగకర్తగా నిలుపగలిగిన సాహిత్యం.

శ్రీశ్రీ వచనసాహిత్యం అపారం. కథలూ, నాటికలూ, వ్యాసాలూ, ఉపన్యాసాలూ, సమీక్షలూ, పీఠికలూ, లేఖలూ, ప్రతికారచనలూ-ఇలా ఇన్నో ఉన్నాయి. ప్రక్రియ ఆయన కలాన్ని కొదిగిందే కాని ఆయన మీద ప్రభుత్వం చేయలేదు.' 'పద్యం ఎక్కువా? లేక గద్యం ఎక్కువా అనే సమస్య అభేద్యం-ఐనా ఘంటావాద్యంగానే నంటా నీరెండూ నాకే నైవేద్యం" అంటాడు శ్రీశ్రీ.

శ్రీశ్రీ నవ్యసాహిత్యపరిషత్తు, ఆంధ్ర అభ్యుదయరచయితల సంఘం,సాహిత్య అకాడమీ, లాంటి సాహిత్యసంస్థలనూ, మద్రాస్ లెజిస్లేచర్ కౌన్సిల్, పౌరహక్కుల మహాసభ వంటి ప్రజాసంస్థలనూ, అలంకరించారు. వీణ, ప్రతిభ లాంటి పత్రికల సంపాదకత్వం నిర్వహించారు. సినీరంగంలో పాటలు, మాటలు వ్రాసి అందులోనూ తనువ్యక్తిత్వాన్ని నిలుపుకున్నారు. కేంద్రసాహిత్య అకాడమీ, సోవియట్ లాండ్ బహుమతులు పొందారు, 'సాహిత్యాచార్యాది' బిరుదాలు పొందారు. విప్లవ రచయితల సంఘానికి అధ్యక్షుడుగా ఉన్నారు. తాను నమ్మిన రాజకీయ సిద్ధాంతాన్ని సాహిత్యంలో ముద్రిస్తున్నారు.

"సాయుధవిప్లవ బీభత్సుని సారథినై
భారత కురుక్షేత్రంలో
నవయుగ భగవద్గీతా ఝంఝుని ప్రసరిస్తా"-నని విప్లవగీతను వినిపిస్తున్నారు-

* * * *

అభ్యుదయాంధ్ర కవిత్వయుగకర్త శ్రీశ్రీ ప్రజాకవి. సమాజ చైతన్యాన్ని మేల్కొల్పి, దానిలోని వేడిరక్తాన్ని ఉడికించి, కవితను ప్రజావాణిగా పలికించి, ప్రపంచ పీడితజన బాధామయగీతాన్ని హృద్గీతగా పొగించి, జీవితానికి సాహిత్యానికి మంగళ సంవిధానాన్ని సాధించి, పండిత పామరజనరంజకమైన కవితాస్రవంతిని తెలుగునాట క్రొత్త తియ్యందనాలతో పారించి, అభ్యుదయ పథాన్ని చూపించిన శ్రీశ్రీ ఆధునికాంధ్ర సాహిత్య రథసారథి. తిక్కన్న, వేమన్న, గురజాడ-ఆయనలో క్రొత్త రూపం తాల్చారు-తెలుగు వారికి ఒక అంతర్జాతీయకవిని సమర్పించారు-

'నిజంగా నేను
ప్రజల కవినేను
ఎంచేతంటేను
వాళ్ళను చదివేను,
చదివిందే రాసేను'-

ప్రజలను చదివినవాడూ-చదివింది వ్రాసినవాడూ ప్రజాకవి. దానికి మారుపేరు శ్రీశ్రీ*



---

* ఈ వ్యాసం యువభారతి వారు 1974లో ప్రచురించిన 'ప్రతిభాలహరి'లో ప్రకటితం.

# శ్రీ శ్రీ కవితలో పురాణ ప్రతీకలు

"A Symbol is the verbal parallel to a pattern of experience" అని Keneth Burke అన్నాడు. అనుభూతి అనంత సాహిత్యానికి ఆలవాలం. అనుభూతి వస్తుస్వభావాన్ని బట్టి భేదించే లక్షణం లోకంలో ఉంది. భారతీయాలంకారికులు కూడ ఈవైవిధ్యాన్ని గుర్తించారు. రసానుభవస్థితిలో హృదయం ద్రవిస్తుందనీ, వికసిస్తుందనీ, విస్తరిస్తుందనీ అభినవగుప్తాదులు పేర్కొనటం ప్రసిద్ధమే. కొందరు హృదయం క్షోభిస్తుందని కూడ చెప్పారు. కరుణాది రసాలను అనుభవించేటప్పుడు సామాజికుల హృదయం ద్రవిస్తుందనీ, శృంగారవీరాదుల ననుభవించేటప్పుడు హృదయం వికసిస్తుందనీ, అద్భుతాదుల అనుభూతిలో హృదయం విస్తరిస్తుందనీ, బీభత్స భయానకాదులవలన హృదయం క్షోభిస్తుందనీ కొందరు సమన్వయించి పేర్కొన్నారు.అసలు ఇటువంటి అనుభవ విశేష స్వభావ స్వరూప వివేచనమే రస సమీకరణవాదాలకు దారితీసింది. కరుణ శృంగారాద్భుతాది రస సమీకరణ సిద్ధాంతాలు అనుభూతిలోని హృదయ స్థితులను అధికరించి సంభావించినవిగా కనబడుతున్నాయి. మొత్తానికి వస్తు రసభావ స్వభావాలను బట్టి హృదయానికి అనుభూతిని అందించే అవస్థాస్థితి ఒకటి ఉంటుందని వివేచించటం జరిగింది. అట్టి అవస్థాస్థితి యొక్క ప్రవృత్తి నే 'Pattern' అని కెనెత్ బర్క్ అంటున్నాడు. దాన్ని అభివ్యక్తం చేసేటప్పుడు తదనుభూతిని పఠిత కందించటానికి తోడ్పడే శబ్దప్రతిరూపం సింబల్-లేక-ప్రతీక.

"సిందూరం రక్తచందనం
బంధూకం సంధ్యారాగం
పులిచంపిన లేడినెత్తురూ
ఎగరేసిన ఎర్రనిజెండా
రుద్రాలిక నయనజ్వాలిక
కలకత్తా కాళికనాలిక
కావాలోయ్ నవకవనానికి"

నవకవన స్వరూప స్వభావాలను చెప్పాడు శ్రీశ్రీ యీ గేయ పాదాల్లో. ఇది కవితలో చెప్పిన లక్షణసూత్రం. అర్థం వాచ్యం కావటంలేదు. అది కవితా లక్షణమని సమాధానం చెప్పుకోవచ్చు. అయితే చెపుతున్నదేంటి ? దాన్ని ఎలా చెపుతున్నాడు కవి ?- అన్నది ఇక్కడ గమనించవలసిన అంశం. ఇందులో ఉపమానాలు లేవు; కాని, కవి హృదయాన్ని వ్యక్తంచేసే పదజాలం ఉంది. అవి రూపకాలు కావు; కవి భావవ్యక్తికి ప్రతిరూపాలు. ఉపమాద్యలంకారాలలో వర్ణ్యవస్తు స్వరూపస్వభావ వ్యంజకాలైన ఉపమాద్రవ్యాల ఉపయోగం విరివిగా కనపడుతుంది; రూపకంలో వర్ణ్యవస్తువునందు ఉపమాద్రవ్యాల గుణాధానం భాసిస్తుంది. పై గేయంలోని సిందూరాదులు అలంకార పరిధిని దాటి వర్తించే శబ్దాలుగా ఉన్నాయి. అవి ఒకవిధంగా సంగీతంలోని స్వరాల్లాంటివి. స్వరవిన్యాసం ఒక భావాభివ్యక్తికి కావలసిన వాతావరణాన్ని సృష్టిస్తుంది; అభావ స్వభావాన్ని సూచిస్తుంది. వర్ణ్యవస్తు స్వరూపస్వభావాలను ప్రకటించేవి అలంకారాలైతే వర్ణ్యవస్తు స్వభావ వాతావరణాలను సూచించేవి ఇటువంటి శబ్దాలు. భావ ప్రకటనకు వాతావరణకల్పనకు తోడ్పడే శబ్దాలు ప్రతీకలని మలార్మే మొదలైన ప్రతీకవాదులు పేర్కొన్నారు. పై గేయంలో శ్రీ శ్రీ ప్రతీకాత్మకంగా నవ్యకవితా స్వరూపాన్ని సూచించాడు. సిందూరం కార్యదీక్షకూ, రక్తచందనం త్యాగానికీ, బంధూకం విప్లవానికీ, సంధ్యారాగం సంఘర్షణకూ, పులిచంపిన లేడినెత్తురు ధనికవర్గ దౌర్జన్యానికీ, ఎగరేసిన ఎర్రనిజెండా కార్మికోద్యమానికీ, రుద్రాలిక నయనజ్వాలిక, కలకత్తా కాళిక నాలికలు సామ్రాజ్యవాదుల రక్తదాహానికీ ప్రతీకలుగా నిలిపాడు. ఈ ప్రతీకలవల్ల అనుగమ్యమానమయ్యే కవితా స్వరూపం పై గేయంలో సూచింపబడింది. ఆ కవితా స్వరూపం శ్రీశ్రీ అనుభవంలోనుండి పుట్టింది; అప్పటి హృదయ స్థితి కీ గేయం కవితాభివ్యక్తి.

ప్రతీకలద్వారా వాతావరణాన్ని కల్పించే కవితా శిల్పానికి శ్రీశ్రీ 'అవతారం' ఆమూల్యోదాహరణం. 'పుడమితల్లికి, పురుటినొప్పులు, కొత్తసృష్టిని స్ఫురింపించాయి' అన్నది ఆ గేయంలో ప్రతిపాద్యాంశం. 'మహాప్రస్థానం' గేయం వ్రాసిన (12-4-1934) రెండు రోజుల్లో (14-4-1934) వ్రాసిన రచన యిది. ఆంధ్రసాహిత్యంలో అభ్యుదయ కవితావిష్కారం నూత్న ప్రయోగంగా ఆవిష్కరిస్తున్న రోజులవి. దాన్ని సూచించాడు శ్రీశ్రీ. పుడమితల్లి పురిటినొప్పుల్లో, శ్రీశ్రీ 'మహాప్రస్థాన' కవిత్వం ఒక యుగపురుషోదయం లాంటిది. ఇటువంటిదే మహాకావ్యంలోనైనా అయితే అప్పటి ప్రకృతిలో తోచిన శకునాలను అభివర్ణించటం పరిపాటి. శ్రీ శ్రీ ఆ సంస్కారాన్ని అభినవంగా ఆవిష్కరించాడు. కొత్తసృష్టి జరుగుతున్న సమయంలో వినవచ్చిన వింత

సప్తస్వరాలను 'అవతారం' గేయంలో ప్రతీకాత్మకంగా ప్రతిధ్వనింపజేశాడు. మొదటిది-'యముని మహిషపు లోహఘంటలు, మబ్బుచాటున, ఖణేల్ మన్నాయి.' ఇది మృత్యు సన్నిధానానికి సూచనం.1 ప్రళయానంతరం నూత్న సృష్టి పుడుతుంది. ప్రళయం ఉన్న వ్యవస్థకు; జననం కొత్త వ్యవస్థకు. 'మబ్బుచాటున'-అన్నదానికి ఆకాశంలో అన్నది సామాన్యార్థం, ప్రపంచయుద్ధ మేఘాలమధ్య-అన్నది ప్రస్తుత భావం. ప్రపంచ వ్యాప్తంగా వెలసిన ఆధునిక కళాసాహిత్య ప్రయోగాలు ప్రపంచ యుద్ధ సంక్షోభంలో పుట్టినవే. గతంమీద విలువపోయి తిరుగుబాటు ధోరణులు మొదలైంది ఆ కాలంలోనే. డాడాయిజంలాంటి విధ్వంసక కళాసిద్ధాంతాల ఆవిర్భావం ఆ భావచైతన్య ప్రభావమే. తరతరాల బూర్జువా వ్యవస్థకు కలిగే ప్రళయాన్ని సూచించే ప్రతీక యముని మహిషపు లోహ ఘంటలనాదం. రెండవది- 'నరకలోకపు జాగిలమ్ములు, గొలుసు త్రెంచుకు, ఉరికిపడ్డాయి.' గ్రీకుల పురాణసంప్రదాయంలో నరకద్వారంలో సెర్బరస్ (**Cerberus**) అనే మూడుతలల జాగిలం కావలా ఉంటుందనీ. అది నరకవాసుల్ని వెలుపలికి రాకుండా నిరోధిస్తుందనీ కవిసమయం ఉంది. ఆ జాగిలాలను **Hell-hounds** అంటారట. అవి గొలుసుల్ని తెంపుకొని ఉరికిపడ్డాయట. అంటే-పీడితవర్గం నరకయాతన లనుభవించే వ్యవస్థ నరకం. ఆ వర్గం వారి స్వేచ్ఛ నరికట్టే సూత్రాలు జాగిలాలు. అవి భయంకరాలు వాటి కట్టుబాట్లు తెగిపోయాయి. పీడితవర్గ పురోగతికి అవరోధాలు తీరిపోయాయి-అని ఈ ప్రతీక భావం. మూడవది- 'ఉదయ సూర్యుని సప్తహయములు - నురుగులెత్తే - పరుగు పెట్టాయి.' ఈ అరుణోదయ తపనోదయాలు ప్రపంచ కార్మిక విప్లవోదయ వికాసాలకు ప్రతీకలు. నాలుగవదీ- అయిదవదీ- 'కనకదుర్గా చండసింహం జూలు దులిపి, ఆవులించింది, ఇంద్రదేవుని మదపుటేనుగు ఘీంకరిస్తూ సవాల్ చేసింది', బరువు మోసే వాహనాలు స్వారీచేసే యజమానులపై చేసే తిరుగుబాటుకివి చిహ్నాలు. పెట్టుబడిదారి విధానంపై కార్మికుల తిరుగుబాటు కివి ప్రతీకలు. ఆరవది-'నందికేశుడు' రంకెవేస్తూ, గంగడోలును కదిపి గంతేడు'-నందికేశుడు వ్యవసాయ ప్రతీక. 'పొలాలనన్నీ హలాలదున్నీ ఇలాతలంలో హేమం' పిండే కర్షకుల తిరుగుబాటుకు ప్రతీక. ఏడవది- ఆదిసూకర- వేదవేద్యుడు- ఘుర్ఘురిస్తూ, కోరసాచాడు. ఆది వరాహమూర్తి పంటికొనతో ప్రళయసముద్రంనుండి భూమి నుద్ధరించటం ఇందులోని పురాణార్థ కథనం. వరాహమూర్తి జగదుద్ధారకుడు. ఆయన వేదాలయందు తెలియదగినవాడు.

1. తిక్కన సోమయాజికూడా ఈ ప్రతీకను ఇదే భావాన్ని సూచించటానికి వాడాడు.

ఆప్పటి వేదంవేరు. ఇది సామ్యవాద వేదం. ఈ వేదవేద్యుడు జగత్తు నుద్ధరించటానికి కోరసాచాడు. మార్క్సిస్టు ఉద్యమం లోకకల్యాణ హేతువుగా సముద్ధరింపబడుతున్నదని ప్రతీకాత్మక ప్రతిపాదనం ఇందులోని తాత్పర్యం. అభ్యుదయ కవితా విర్భావ వాతావరణమంతా ఈ గేయంలో గుప్పించివిడిచాడు శ్రీశ్రీ, దీనికి వివరణం వ్రాస్తే ఒక్కొక్క చరణానికి ఒక్కొక్క అధ్యాయం కేటాయించాల్సి ఉంటుంది. ఇంతటి విపులార్థాన్ని స్ఫురింపచేయటానికి శ్రీశ్రీ వాడిన టెక్నిక్ సింబాలిజం.

విశేషమేమిటంటే-ఇందులో శ్రీశ్రీవాడిన ప్రతీకలన్నీ పౌరాణికాలే. కాని, వాటికి పౌరాణిక వాతావరణంలేదు; ఎందువల్లనంటే-అవి ప్రతిపాదించే పురాణార్థాలకు ఇక్కడ ప్రసక్తిలేదు. పైపెచ్చు అన్వయానికా ఆర్థాలు తోడ్పడవుకూడ. ఈ ప్రతీకలన్నీ సంప్రదాయార్థాలను కోల్పోయి నవ్యార్థస్ఫూర్తికి వాహకాలవుతున్నవి. పురాణ ప్రతీకలతో పునర్నవార్థస్ఫూర్తిని కల్పించటమే ఇందులో కనవచ్చే నవ్యశిల్పసృష్టి. కొందరీ పురాణప్రతీకలను చూచి శ్రీశ్రీ సంప్రదాయానురక్తుడని భ్రమిస్తారు. అసలు సంగతి అదికాదు. తరతరాలనుంచి వస్తున్న ఈ ప్రతీకలకు సంప్రదాయార్థ ప్రక్షాళనం చేసి అభ్యుదయకవితకు సామగ్రిగా ఉపయోగించాడు శ్రీశ్రీ. అయితే-ఇక్కడ ఒక అంశం మీమాంసకు రావచ్చు. ప్రతీకలుగా వాడుతున్న ఈశబ్దాలకు అభిధావృత్తిలేదా? ఉంది. లేకుండా అసలుశబ్దం ఉండదు కాబట్టి..కాని, తాత్పర్యంలో అభిధకు అనుపపత్తి ఉంది. ఆ అనుపపత్తి తొలగించుకోవటానికి రూఢ్యర్థంచెప్పే అవకాశంఉండా? లేదు. శ్రీశ్రీ కొత్తఅర్థాన్నిచ్చేటట్లు దాన్ని వాడుతున్నాడు. ఆ క్రొత్తఅర్థం ఎక్కడఉంది? కవి అనుభూతిలో ఉంది. ఆ అనుభూతిని అభివ్యక్తిచేసే అనువైనఅర్థం చెప్పుకున్నప్పుడు- దాని ప్రయోజనం అనవచ్చుకదా! ఒకవిధంగా అనవచ్చు. అప్పుడు అనుగమ్యమానమయ్యే ప్రయోజనార్థం వ్యంగ్యం. అయితే ప్రతీకలవలన ప్రతీయమానమయ్యే అర్థం లక్షణార్థంలాంటిదా? కాదు. అందులో వాక్యాన్ని ఆశ్రయించిన వాచ్యార్థానికి అనుపత్తి ఉంది. దాన్ని స్వప్రయత్నంగా తొలగించి సమన్వయించుకోవాలి. ఇందులో కావ్యార్థాన్వయాని కనుపపత్తి భాసిస్తే స్వప్రయత్నంగా సమన్వయించుకోవాలి. ఒకటి వాక్య తాత్పర్యానికి సంబంధించింది; మరొకటి కావ్యతాత్పర్యానికి సంబంధించింది. కావ్య తాత్పర్య సమన్వయానికి ప్రతీకల వాచ్యార్థంకంటె, సామాజికుల సంస్కారబలం ప్రబలంగా తోడ్పడుతుంది. పఠితల సంస్కారం తరతరాల జాతిసంస్కృతి నాశ్రయించి ఉంది. అది జాతిసుప్త చేతనలో ఒక భాగమై ఉంటుంది. అట్టిచైతన్యంతో జాతి మారుతున్న సమాజ వాతా

వరణంలో జీవిస్తుంది. మార్పులోని కొత్తదనం గతాన్ని కుదించివేస్తున్నప్పుడు గతం లోని సంస్కారంఉన్నా అది సంప్రదాయానుకరణ శీలాన్ని కోల్పోతుంది. తన సంస్కారానికే సరికొత్త వ్యాఖ్యానం చెప్పుకొంటుంది జాతిచైతన్యం. అట్టి పరిణామావస్థలో జాతిలో వెలువడే భావాభివ్యక్తి రెండుధారలుగా ప్రవహిస్తుంది. ఒకటి- సంప్రదాయార్థాలను సరికొత్త సమన్వయాని కుపయోగించుకొనే శక్తిని సాధించుకోవటం. రెండు- సరికొత్తభావాలకు సరికొత్త అభివ్యక్తి మార్గాలను అన్వేషించటం. ఈరెండిట్లో మొదటిదానికంటె రెండవదే శక్తిమంతమని భావించేవారు కొందరున్నారు. వారుకూడా-పరిణామదశలో మొదటిమార్గాన్ని అవలంబింపక తప్పదని భావిస్తారు. కొత్తపాతల మధ్య ఈ మొదటిమార్గం సమన్వయానికీ, ఆస్వాదన సౌలభ్యానికీ తోడ్పడుతుందని అంగీకరిస్తారు.

సాహిత్యంలో నూత్నప్రయోగాన్ని చేసే కవి కూడా జాతిలో ఒక భాగమే అయితే, జాతిలోని అభివ్యక్తి అతణ్ణి ఆశ్రయించి ఆకృతి దిద్దుకుంటుంది. అతని మాట అభ్యుదయపథానికి అక్షరమార్గమౌతుంది. శ్రీ శ్రీ తెలుగు సాహిత్యంలో నిర్వహించిన పాత్ర అటువంటిదే. ఆయన చేసింది నూత్నసృష్టి. అది ప్రధానంగా ఆలోచనకు సంబంధించింది; భావవిప్లవానికి సంబంధించింది. దానిని వ్యక్తీకరించడానికి శ్రీశ్రీ పైన చెప్పిన రెండుమార్గాలనూ అనుసరించాడు. పైన పేర్కొన్న రెండోగేయం 'అవతారం' మొదటి మార్గానికి ప్రతినిధి అయితే, మొదటి గేయం 'నవకవిత' రెండవపద్ధతికి ప్రతినిధి,

'నా రచనలలో లోకం ప్రతిఫలించి
నా తపస్సు ఫలించి
నా గీతం గుండెలలో ఘూర్ణిల్లగ
నా జాతి జనులు పాడుకొనే
మంత్రంగా మోగించాలని'

కవిత్వం వ్రాసినవాడు శ్రీశ్రీ. జాతి జనులు పాడుకొనే పాటలలో దేశీయమైన సంస్కారం సంవాసితమౌతుంది. కొత్త విషయాన్ని చెప్పినా ఆ సంస్కారానికి సన్నిహితంగా ఉన్నప్పుడు వాళ్ళకు అందిపుచ్చుకొనే సౌలభ్యం ఏర్పడుతుంది. సాహిత్య ప్రక్రియలన్నిట్లో సమాజవ్యాప్తి కలిగింది పురాణ ప్రక్రియ. ఈసత్యం ప్రపంచ సాహిత్యాలన్నిటిలోనూ సర్వసాధారణమైనదే. శ్రీ శ్రీ తన కొత్తమార్గానికి

ప్రజావ్యాప్తి కల్పించాలంటే వారికి సుపరిచితాలైన పురాణ ప్రతీకలనే గ్రహించవలసి వచ్చింది. ఇందులో 'మంత్రంగా' ప్రయోగించాలనటంలోకూడా ఆ రహస్యముంది. శివపంచాక్షరి, రామతారకం, మొదలైన మంత్రాలు జాతిలో జ్ఞానాన్నీ, భక్తినీ బోధించే ప్రాథమిక వాఙ్మయ సూత్రాలుగా వెలసియుండటం మనకు తెలుసు. అలాగే ఆధునిక సాహిత్యాన్ని గురించి చెప్పుకొనే తనయుగంలో తన గీతాలతోనే దాని అధ్యయనం ప్రారంభంకావాలని శ్రీశ్రీ అభిలషిస్తున్నాడు. నిజానికి 'గీతంగా' అనటం సాభిప్రాయం. గీతానికి మంత్రానికున్న ప్రామాణికత్వం లేదు. తన కవితా సిద్ధాంతాల, ప్రవచనాల, ప్రబోధాలకు తన కవిత అంత ప్రామాణికంగా ఉంటుందని శ్రీశ్రీ నిర్దేశించాడు. అది నిజమని కాలం నిరూపించిందికూడ.

సింబాలిజంలో ఒకచిన్న చిక్కుకూడా ఉంది. కవి తనభావాభివ్యక్తికి ఎన్నుకొనే ప్రతీకలలో అతని సంస్కారముద్రకూడా ఉంటుంది. అభివ్యక్తి చేయబడుతుంది కవి అనుభవస్థితి అయినా అది విశ్వజనీనంగా ఆస్వాదింపబడే ప్రతీకలద్వారా వ్యక్తమైనప్పుడే కవిత సామాజికుల హృదయాలకు సన్నిహితమౌతుంది. పురాణ ప్రతీకలకు మిగిలిన ప్రతీకలకంటే విశ్వజనీనతకు విస్తృతమైన అవకాశం ఉంది. వీటికంటే విశాలవ్యాప్తి కవిసమయాలకు సంబంధించిన ప్రతీకలకు ఉంటుంది. కవి వీటిని ఎన్నుకోవటంలోనూ, ప్రయోగించటంలోనూ తన వ్యక్తిత్వాన్నీ, అభిరుచినీ, అంతః సంస్కారాన్నీ, అనుభవ విశేషాన్నీ ప్రదర్శిస్తాడు. అది విశ్వజనీనతకు, కావ్య సమన్వయానికి అంతరాయంగా నిలువదు. కాని, కొందరు కవులు వైయక్తిక ప్రతీకలు **(Private or personal symbols)** వాడతారు. వాటి అర్థం అవే చెప్పాలి. లేక కవియే చెప్పాలి. వాటికి లోకరూఢి లేదు; జాతి సంస్కారానికి అవి అజ్ఞాతాలు. కవి జీవితంతో గాఢంగా పరిచయమున్న పఠితకుగాని వాని అర్థం బోధపడదు. అందువల్ల కావ్య సమన్వయాని కవి సార్వజనీనంగా తోడుపడవు. వైయక్తిక ప్రతీకలకు కవితలో విలువలేదని చెప్పలేముగాని[2], విశ్వజనీనమైన అవగాహన ఉండదని పేర్కొన

---

2. "It is an attribute of many private symbols, and one reason why they are an irreplaceable literary device, that they sujjest a direction, or a broad area of reference rather than, like an item in an allegorical narrative, a single and specific reference."

వచ్చును[3]. అభ్యుదయ కవిత్వయుగంలో వైయక్తిక ప్రతీకలను చాల తక్కువగా వాడి, పురాణ ప్రతీకలను ప్రయోజనాత్మకంగా ప్రయోగించి, కొత్తభావాలకు కొత్త ప్రతీకలను సృజించుకున్నా వాటిని జాతి జీవితంలోనుంచి తీసికొని ప్రజాహృదయాలకు దగ్గరగా కవిత్వాన్ని తీసికొనిపోయిన కీర్తి ప్రప్రథమంగా శ్రీశ్రీకి దక్కుతుంది. శ్రీశ్రీ ప్రతీకలు ప్రజాహృదయ స్పందనకు ప్రతిబింబాలు. వాటిలో - అందులోనూ పురాణ ప్రతీకలలో-శ్రీశ్రీ సంస్కారముద్రా, విశ్వజనీనతను కల్పించే వినూత్న చైతన్యం ఎలా సంగమించి ఉన్నాయో మరికొన్ని పురాణప్రతీకలను పరిశీలిస్తే బోధపడుతుంది.

భారతదేశం వేదభూమి; కర్మక్షేత్రం. ఈ దేశంలో ఏ కొత్తమతం పుట్టినా, ఏ నూత్న ధర్మం పుట్టినా వేదప్రామాణ్యాన్నీ,కర్మసూత్రాన్నీ, అంగీకరించాలి. అలా కాకపోతే కలకాలం నిలవటం కష్టం అయితే, వేదధర్మాలకూ, కర్మసూత్రాలకూ సంబంధించనిదీ, శ్రామిక కల్యాణసాధకమైన మార్క్సిజాన్ని ప్రబోధించే శ్రీ శ్రీ ప్రబోధం మాటేమిటీ? తానుచెప్పేది వేదార్థం కాకపోయినా తన వాదమూ ఒకవేద మనాలి; తాను చేసేది యజ్ఞం కాకపోయినా తనయత్నమూ యజ్ఞంలాంటిదే అనాలి. తన ఉద్యమం త్రేతాగ్ని అని ఘోషించాలి. ఇందులో మానసికశాస్త్ర రహస్యం ఒకటి ఉంది. జాతి జీవనాడుల్లో తన ప్రబోధం జీర్ణించాలంటే అనంతకాలంనుంచి అందులో ప్రవహిస్తున్న సంస్కార చైతన్యాన్నే సాధనంగా వాడుకోవాలి. 'భూతాన్ని, యజ్ఞోపవీతాన్ని, వైప్లవ్యగీతాన్ని!' అని చెప్పుకున్న శ్రీశ్రీ తత్వం ఏమిటి? నేడు ఆయన విప్లవగీతమే- నిన్న యజ్ఞోపవీతం- మొన్న- గతం. యజ్ఞోపవీతం ఈ జన్మలోనే పునర్జన్మకు ప్రతీక. అందుకే ఉపనయనం చేసుకున్నవాడు ద్విజుడౌతున్నాడు. అంతకు ముందాతనికి కర్మకధికారంలేదు. అప్పటినుంచి కర్మధికారం వస్తుంది. దీన్ని లౌకికంగా అన్వయిస్తే కర్మాధికారి కార్మికుడు, అంతకుపూర్వం అతడుభోక్త. భోక్తృత్వం నుండి కర్తృత్వంలోనికి పరిణామం చెందటం పాలకవర్గంమీద కార్మికవర్గ సాధించిన విప్లవం. ఈ విప్లవ గీతం అనంతకార్మిక ఉద్యమ సంగ్రామగీతం.

---

**3. "Some poets, however, often use simbols whose significance they mainly generate for themselves, and these set the reader a more difficult problem in interpretation."**

**— A Glossory of Literary rerms. M. H. Abraham.**

'వ్యధార్త జీవిత యధార్థదృశ్యం
పునాదిగా ఇక జనించబోయే
భావివేదముల జీవనాదముల
జగత్తుకంతా చవులిస్తానోయ్.'

అని ప్రతిజ్ఞచేసిన శ్రీశ్రీ తనవాదాన్ని వేదంగా పేర్కొన్నాడు. ఆ ప్రతీక భారతీయుల జీవనాదమని ఆయనకు తెలుసు. అందుకే ఆ శబ్దాన్ని ఆ నాదాన్ని తన నినాదంలో నిన దించుకొన్నాడు. 'త్రిలోకాలలో - త్రికాలాలలో- స్వస్తివాక్యములు సంధానిస్తూ' ఈ వేదాలను పఠిస్తాననటం జాతి మనోచైతన్యాన్ని స్వాయత్తంచేసుకోవటానికే. త్రిలో కాల ప్రసక్తి ప్రజా విశ్వాసాన్ని చూరగొనే పురాణ ప్రతీకేగాని మూడు లోకాలున్నా యని కవి విశ్వాసంకాదు. అలాగే స్వర్గం, నరకం అనే ప్రతీకలుకూడాను. 'నేనొక దుర్గం-నాదొక స్వర్గం-అనర్గళం అవితరసాధ్యం నా మార్గం'-అన్నప్పుడు ధర్మరాజు స్వర్గానికి మహాప్రస్థానంచేసిన మార్గం మన సంస్కారంలో మేలుకొంటుంది: ధర్మ కర్మకు ఫలం ఆ మార్గం, ఆధ్యేయం. శోకంలేని అనంత సుఖానికి ప్రతీక స్వర్గం. శ్రీశ్రీ చేయమన్న మహాప్రస్థానం ఆ స్వర్గానికే, కాని, దానిలో పౌరాణికార్థంలేదు. వర్గ పోరాటంలేని కార్మికరాజ్యవ్యవస్థలో పీడితవర్గంపొందే జీవితసౌఖ్యం స్వర్గంగా భావించి గమించమన్న సూచన ఉంది. ఆ సూచన సూత్రప్రాయంగా చెప్పితే జాతి జీవాన్ని పట్టుకోదు. దానికి వచ్చిన మాటల్లో చెప్పాలి; మంత్రముగ్ధంచేసి ముందుబాట చూపిం చాలి. శ్రీశ్రీ పురాణ ప్రతీకల్లోని మనోరహస్యం ఇదే. 'మరణానికి ప్రాణంపోస్తాం, స్వర్గానికి నిచ్చెనవేస్తాం' (అద్వైతం) 'స్వర్గద్వారపు తోరణమై వ్రేలిన నా మస్తి ష్కంలో' (కవితా ! కవితా !)- ఇలా స్వర్గప్రతీకను ఎన్నోచోట్లవాడి స్వర్గసుఖాన్నే పరమ ప్రమాణమని భావించే తన జాతికి తనభావాన్ని దేశీయంగా బోధించాడు శ్రీశ్రీ.

భారతీయుల దృష్టిలో యజ్ఞం పవిత్రకర్మ; దేవతలా యజ్ఞంవల్ల సంతుష్టులై భూతలానికి మేలు కలిగిస్తారని విశ్వాసం. అగ్నిముఖావై దేవతాః. మంత్రపూతాలైన హవిస్సులు అగ్నిముఖాన సమర్పిస్తే అమరులందుకుంటారని వేదాలు ఘోషిస్తున్నాయి. మనవారు స్త్రీ పురుష సంయోగ రూపమైన కామకర్మంకూడా యజ్ఞరూపంగా భావించిన ఉదాత్తచిత్తులు. పవిత్రతకు, ఉదాత్తకర్మకు, విశ్వహితార్థబుద్ధికి యజ్ఞం ఒక ప్రతీక. యజ్ఞంలో పవిత్రతకు చిహ్నం అగ్ని. త్రేతాగ్ని కర్మదీక్షకు సంకేతం. శ్రీశ్రీ తాను చెప్పదలచుకొన్న మార్క్సిస్టు వ్యవస్థను యజ్ఞప్రతీకతో ఉదాత్తం చేయటం విశేషం. యజ్ఞభావనలో ఉన్న వాతావరణాన్ని తన వాదానికి ప్రచ్ఛన్నంగా సంతరించటం

ఈ ప్రతీక ప్రయోగంలో ఉన్న పరమార్థం. 'కనపడలేదా మరోప్రపంచపు- కణకణ మండే త్రేతాగ్ని ?' అని ప్రశ్నించినప్పుడు- పతితమైన భారతీయుని చిత్తానికి మరో ప్రపంచం విదేశీయంగా స్ఫురింపదు: స్వదేశీయంగా స్పందన కల్పిస్తుంది. 'కనపడ లేదా మరోప్రపంచపు.... హోమజ్వాలల భుగభుగలు' అని గేయం ముగించేటప్పటికి పతిత హృదయం కావ్యతాత్పర్యాన్ని స్వాయత్తం చేసుకుంటుంది.అగ్ని ప్రతీకలో ఒక విశేషం ఉంది. దాన్ని ప్రళయాగ్ని అని చెప్పకపోతే నిర్మాణాత్మకమైన ఉత్సాహాన్ని వ్యజింపచేస్తుంది. ఆ అగ్ని ప్రతీకను శ్రీశ్రీ విప్లవానికి ప్రతీకగా వాడతాడు. 'నేను సైతం ప్రపంచాగ్నికి-సమిధ నొక్కటి ఆహుతిచ్చాను' అన్నప్పుడా ప్రతీక కదే అర్థం. దానిచుట్టూ యజ్ఞవాతావరణాన్ని కల్పించి విప్లవానికి విలువైన పావిత్ర్యాన్ని, ప్రామాణిక భావాన్ని పరివేషంలా పరిథవింపజేస్తాడు. ఇందులో మరోవిశేషం ఉంది. సవనాగ్ని సనాతనమైంది. విప్లవంకూడా పురాతనమైందే. గతితార్కిక భౌతికవాదం చరిత్రగతిని పునర్వీక్షించి పునర్వ్యాఖ్యానించింది, ఇది లోకానికి కొత్తకాదు: వేదంలా పాతదే అనే స్ఫూర్తి ఈ ప్రతీక సూచిస్తుంది. శ్రీశ్రీ ఆ ప్రతీకలోనిశక్తినంతా కొల్ల గొట్టేట్లు తన ఖండకావ్యాల్లో వాడుకొన్నాడు. 'ఇది సవనం-ఇది సమరం' అన్నాడు. (జగన్నాథుని రథచక్రాలు.)

కావ్య రచనలో ప్రతీకల ప్రయోజనాలను వివేచించిన విమర్శకులు అవి వస్తు సమన్వయానికి తోడ్పడతాయని కావ్యాస్వాదన సౌలభ్యానికి ఉపకరిస్తాయనీ,సుప్తమైన స్మృతులనూ సుప్తచైతన్యాన్నీ జాగృతం చేయటానికి సాధనాలౌతాయనీ, అలంకా రాలుగా శోభను చేకూరుస్తాయనీ పేర్కొన్నారు. 'జగన్నాథుని రథచక్రా'లన్న ఖండ కృతిలో 'శనిదేవత రథచక్రపు-టిరుసులలో పడి నలిగిన-దీనులార! హీనులార!.... జగన్నాథుని రథచక్రాల్-రథచక్ర ప్రళయఘోష- భూమార్గం పట్టిస్తాను! భూకంపం పుట్టిస్తాను'- అని విరుద్ధ ధర్మాలుగల ప్రతీకలను వాడినప్పుడు వాటి తారతమ్య పరి శీలనంవల్ల తాత్పర్యం తెలుసుకొని వస్తు సమన్వయం చేసుకోవటం సులభ మౌతున్నది4. ఈ ప్రతీకలు ప్రాచీనాలుకావు; పురాణసంస్కారంతో శ్రీశ్రీకల్పించినవి.

4. జగన్నాథ రథచక్రాల ప్రతీకకు వివిధ వ్యాఖ్యానాలున్నాయి. దీనికి సాంఘిక న్యాయమనే అర్థం చాలమంది భావించారు. విశేషాలకు చూడుడు-ఆధునికాంధ్ర కవిత్వము, డా॥ సి. నారాయణరెడ్డి. పుటలు, 577-578.

అందువల్ల అన్వయానికి విమర్శకులు బహువిధాల పరిశ్రమించారు. అయినా ఆ గేయంలో అన్వయ సూత్రాల నందించేవి ఆ రెండు ప్రతీకలే,'జ్వాలా తోరణం'లోని భావాస్వాదనకు తోడ్పడేవి పురాణ ప్రతీకలు.

'ఇదేమి లోకం హిరణ్యనేత్రుని
పదాహతమున ప్రతిధ్వనింపగ
కురుక్షేత్రమున క్రుద్ధ వృకోదరు
గదాఘాతమున గజగజలాడగ'

'జాతి జాతి నిర్ఘాతపాత సం
ఘాత హేతువై, కాలకేతువై
అదె సంవర్తపు తుఫానుమేఘం
తొలిగర్జించిన తూర్యవిరామం!

ఈగేయంలో ఈ ప్రతీకలే వాతావరణాన్నీ, ఆస్వాదన సౌలభ్యాన్ని అందిస్తున్నాయి. జాతి సుప్తచైతన్యాన్ని జాగృతం చేయటానికి పురాణ ప్రతీక లెలా తోడ్పడతాయో వెనుక గమనించియున్నాం. వైయక్తిక స్మృతులను జాగృతంచేసే ప్రతీకలుకూడా ఉంటాయి. 'జడలు విచ్చిన, సుడులు రెచ్చిన, కడలి నృత్యం శమిస్తుందా? నడుమ తడబడి, నడలి ముడువక, పడవ తీరం గమనిస్తుందా?' అన్న పాదాలలో కవి వైయక్తికమైన భావావస్థ రూపుకడుపుతున్నది. అది పఠితలో సజాతీయ మానసిక స్థితులకు జ్ఞాపకమై భావాతాదాత్మ్యాన్ని ప్రసాదిస్తుంది. ఇక అలంకారాలుగా కావ్య శోభ నినుమడించే ప్రతీకలు శ్రీశ్రీ కవిత్వంలో కోకొల్లలు. అందులో పౌరాణిక ప్రతీకలు ఒక భాగం మాత్రమే. 'మహాప్రస్థానం'లో 'తాచులవలెనూ, రేచులవలెనూ. ధనంజయునిలా సాగండి' అంటాడు శ్రీశ్రీ. 'ధనంజయ' శబ్దప్రతీక శ్రీశ్రీకి ప్రీతి పాత్రం. అష్టదిగ్విజృంభణకూ, అప్రతిహత పురోగతికీ ధనంజయ శబ్దం వెనుకగల సంప్రదాయం తులలేని ప్రతీకగా నిలిచిందని డా॥ సి. నారాయణరెడ్డిగారన్నారు. ధనికవర్గంపై సాధించే విజయానికి ఆ శబ్దం ధ్వని ప్రతీకగా శ్రీశ్రీ గ్రహించాడన టంలో మరింతసార్థక్యం ఏర్పడుతుంది. 'పర్జన్యశంఖం పలికించు రష్యా! అన్నప్పుడు పిడుగులసవ్వడి ధ్వనించాడు శ్రీశ్రీ. ఇలాగే- "ఎగిరి ఎగిరి పడుతున్నవి ఎనభై లక్షల మేరువులు, తిరిగి తిరిగి సముద్రాల్, జలప్రళయ నాట్యంచేస్తున్నవి." (మహాప్రస్థానం): 'మహాప్రళయం జగం నిండా, ప్రగల్భిస్తుంది' (జయభేరి):

'ప్రపంచమొక పద్మవ్యూహం' (ఋక్కులు): 'కళాయజ్ఞాశ్వముల్' 'అనలవేదిక ముందు అస్రనైవేద్యం, 'పరమేష్ఠి జూకాలు నా మహోద్రేకాలు' (ఐ): 'పరమాత్మలు-ఓ చిరుతల్లారా!' 'కంచు వృషభముల అగ్నిశ్వాసం' 'పాతాళానికి పల్లేర్కొట్టి, వైతరణీనది లోతులుచూస్తూ (శైశవగీతి); 'యుగాల రథనాదం' (ఒక క్షణంలో); 'తాణికిన స్వర్గం' (పరాజితులు); 'మోహినీ గంధర్వగానం' (స్విన్‌బర్న్ కవికి); 'జగమంతా బలివితర్ది' 'తిరుగుబాటు మా వేదాంతం' (అభ్యుదయం); 'యంత్రభూతముల కోరలుతోమే' (ప్రతిజ్ఞ) 'నానుడి నీగుడిగా! నాగీతం నైవేద్యంగా' (కవితా! కవితా!); 'బీభత్సరసప్రధానం-పిశాచగణసమవాకారం' (దేశ చరిత్రలు); 'చావుపుట్టుకల పొలిమేరల్లో-ఆవులించె నొక చితాగ్నికుండం' (జ్వాలాతోరణం); 'పరపీడనాపరుల ప్రాణాల భైరవి' (గర్జించురష్యా); 'నటధూర్జటి-నిటలాక్షి పగిలిందట; నిటలాక్షి రగిలిందట (జగన్నాథుని రథచక్రాలు) ఎన్నో ప్రతీక లలంకారాలుగా రాణిస్తున్నాయి.

నర్రియలిజంలో సమర్థవంతమైన ప్రయోగాలు సాగించిన శ్రీశ్రీ 'భ్రమర గీత' నాలపించాడు. 'రుద్రవీణ నిస్వహణ ప్రణవం-అది నా హృదయంలో రుధిర జ్వలనం-గీతాజననం' అని అభినవగీతావతరణాన్ని స్మరించాడు. 'సాయుధ విప్లవ బీభత్సుని సారధినై భారత కురుక్షేత్రంలో-నవయుగ భగవద్గీతా ఝంఝుని ప్రసరిస్తా'నని ఈనాడూ గీతను తన కవితలో అలంకారంగా అనుసంధిస్తూనే ఉన్నాడు. పురాణ ప్రతీకల పునస్సంధానం అతని జాతిజీవనాడుల రక్తప్రసారనినాదానికి సంవాదం. విప్లవ కవిత పాడేటప్పుడుకూడా ఆయన ప్రతిజ్ఞలో చివరకుమిగిలేది సర్వనాద మూలబిందువైన ఋతం-అదే ప్రణవం!

"కమ్మరి కొలిమీ, కుమ్మరి చక్రం
జాలరి పగ్గం
సాలెల మగ్గం
శరీరకష్టం స్ఫురింపజేసే
గొడ్డలి, రంపం, కొడవలి, నాగలి
సహస్రవృత్తుల సమస్త చిహ్నాలు-
నా వినుతించే
నా విరుతించే

నా వినిపించే నవీనగీతికి
నా విరచించే నవీనరీతికి
భావం!
భాగ్యం!
ప్రాణం!
ప్రణవం"!*



* ఈ వ్యాసం- 1976 జనవరి 'విమర్శిని'లో ప్రకటితం. (విమర్శిని ఇప్పటి కాకతీయ విశ్వవిద్యాలయం తెలుగుశాఖ ప్రచురించే పరిశోధనపత్రిక.)

# మహాకవి దాశరథి

"నేనురా తెలగాణ నిగళాల తెగగొట్టి
ఆకాశమంత యెత్తార్చినాను
నేను రాక్షసిగుండె నీరుగా పద్యాలు
పాడి మానవుని కాపాడినాను
నేను వేస్తంభాల నీడలో నొక తెల్గు
తోట నాటి సుమాలు దూసినాను
నేను పోతన కవీశాను గంటములోని
ఒడుపులు కొన్నింటి బడసినాను
కోటి తమ్ములకడ రెండుకోట్ల తెల్గు
టన్నులను గూర్చి వృత్తాంత మందజేసి
మూడుకోటుల నొక్కటే ముడి బిగించి
పాడినాను మహాంధ్ర సౌభాగ్యగీతి."

కొదమసింగం గర్జించి నట్లున్న ఈ పద్యం దాశరథిది. పద్యరచనలో ఆయన మహాకవిగా సాక్షాత్కరిస్తాడు; వస్తువులో దేశ చరిత్రను తీర్చిదిద్దిన మహా నాయకుడుగా దర్శన మిస్తాడు. తెలుగుదేశచరిత్రలో ముడిపడి ఉంది దాశరథి కవిత్వం. తెలంగాణా బంధాలు తెంచటం, రాక్షస పాలన నీరయ్యేట్లు చేయటం, తెలంగాణాలో సాహిత్యచైతన్యాన్ని కల్పించటం, తెలుగు పద్యరచనకు కొత్త ఒరవళ్లు పెట్టడం, మహాంధ్రోదయానికై కృషి సాగించటం-దాశరథి జీవితంలోనూ, సాహిత్య జీవితంలోనూ ఉజ్జ్వలంగా ప్రకాశించే ప్రథమాధ్యాయంగా భావించవచ్చు.

దాశరథి 1927 సెప్టెంబరులో తెలంగాణాలోని ఖమ్మం జిల్లా, మానుకోట తాలూకాలోని గూడూరు గ్రామంలో జన్మించారు. పుట్టింది పండిత వంశం కావడం చేత చిన్నారి పొన్నారి చిరుత కూకటి నాటికే వన్నెమీరిన కవిత అల్లటం మొదలు పెట్టారు దాశరథి. దాశరథి పుట్టుకతోనే అగ్నిశిఖలాంటి ప్రతిభామూర్తి. పదేళ్ళ

వయస్సుకే ఆయన హృదయంలో వింత త్రేతాగ్నులు ప్రజ్వరిల్లాయి. ఆయన జీవితాన్ని ఒక మహాకవితా యజ్ఞంగా తీర్చిదిద్దాయి.

ఆత్రేతాగ్నులు-కేశవార్యశాస్త్రి వ్యాఖ్యానించిన ఉపనిషద్వాక్యాలూ, జనాబ్ జక్కీ-సాహెబ్ వినిపించిన ఇక్బాల్ విప్లవ గీతాలూ, చూడామణి చూపుల్లోని వెచ్చదనాలూ. దాశరథి 'నందిని' ప్రభావానికి' వ్రాస్తూ ఇలా అన్నారు-"కేశవార్యశాస్త్రి జన్మతఃశాస్త్రి కారు. ఆయన శాస్త్రాధ్యయనం చేసి శాస్త్రి అయినారు. కేశవయ్య కేశవార్యశాస్త్రిగా ఖ్యాతిపొందారు. నాకు పట్టుమని పదేళ్ళ వయసైనా లేనినాడు ఖమ్మంలో గుంటి మల్లన్న వీధిలో సంస్కృత పాఠశాల పెట్టి ఉదయం, సాయంత్రం హోమం చేస్తూ, (ఘుమఘుమలాడే ఘృతంతో) వేదం పఠిస్తూ ఉండేవా రాయన. ఆయన గంభీరకంఠం వినడానికి వెళ్లే వాణ్ణి. నాతోవచ్చిన తోటి బాలురు 'మామ కాని మామ చందమామ' అంటే 'శాస్త్రి కాని శాస్త్రి కేశవార్యశాస్త్రి' అనేవాణ్ణి. ఆయన నవ్వుకొని 'నువ్వన్నది నిజం. నా మతం కులాలను అంగీకరించదు' - అనేవారాయన. 'అగ్నిర్వాగ్భూత్వా ముఖం ప్రవిశత్' అనే ఐతరేయోపనిషత్సూక్తికి అర్థం చెపుతూవుంటే-'ఆ భగవంతుడి నోట్లోకి అగ్ని యెలా ప్రవేశిస్తుంది?' కాలదూ? అని అడిగే వాణ్ణి. "శబ్దరూపంలో అగ్ని ప్రవేశిస్తుంది కనుక కాలదు, ఇతరుల గుండెల్లోని అజ్ఞానాన్ని కాలుస్తుంది" అనేవారు ఆయన. మత విశ్వాసాలలో నాకు విశ్వాసం లేకపోయినా, వేదాల్లోని, ఉపనిషత్తులలోని అగ్నిని గూర్చి ఆయన చెప్పినప్పుడల్లా సాహిత్య పరంగా అన్వయించుకోడానికి తప్పటడుగులు వేసేవాణ్ణి.

ఇటు 'మదర్సాకు' వెళ్ళితే జనాబ్ జక్కీ సాహెబ్-ఇక్బాల్ కవితలు చదివి వివిపించి అర్థాలు చెప్పేవాడు.

"జిస్ ఖేత్ దహఖాఁకొమయస్సేర్ నహోఁరోజీ
ఉస్ ఖేకె హర్ ఖూషయె గందంకొ జలాదో"

(యే చేను కృషీవలునికి ఈయదో తిండి, ఆ చేనున ప్రతి మొక్కను కాల్చేయండి) ఇందులోని అగ్ని విప్లవాగ్నియై నాలో చొరబడేది. కాని, ఇక్బాల్ రాజకీయ సిద్ధాంతంతో నేను ఏకీభవించలేదు.

'ఇటు కేశవార్య శాస్త్రి, అటు జక్కీ సాహబ్-ఈ ఇద్దరూలేని సమయాల్లో నన్ను కవ్వించే మాబంధువు లమ్మాయి చూడామణి-శృంగార మంటే తెలియని రోజుల్లో-ఏదో గిలిగింత మనసులో, తనువులోనూ కలిగిస్తుండేది.'

'ఉపనిష ద్వాక్యాలూ, ఇక్బాల్ విప్లవ గీతాలలోని అగ్ని, చూడామణి చూపుల్లోని పెచ్చదనం అడపా తడపా నామీద దాడిచేసి నన్ను లొంగదీశాయి. ఆనాడే అంగారం, శృంగారం నన్ను ఆవహించాయి. గ్రామీణ ప్రమదా వినీల కబరీ రంగస్థలీ లాసికా' అని చాలాకాలం తరువాత వ్రాసిన పంక్తిలో ఈ రెండు (రసాలు?) కలగలిసి పోయాయి. పలాశ కుసుమ లాసిక అగ్ని బాలిక!'

'నేను ఆ విద్వాంసు లిద్దరికి దూరమైనా, నా చూడామణి దక్కక పోయినా, నాలో ఆనాడు వారి వలన ప్రవేశించిన అగ్ని రమారమి నలభై ఏళ్ళుగా నన్ను వెంటాడుతున్నది. 'అగ్నయే నమః'

అగ్ని సంఘర్షణ వల్ల పుడుతుంది. ఆవేదనగా, ఆవేశంగా ప్రజ్వలిస్తుంది; రౌద్రంగా నర్తిస్తుంది. దాశరథి నూనూగు మీసాల నూత్న యౌవనంలో అడుగిడే నాటికి తెలంగాణా తీగెలు తెగిన వీణలా మూగవోయి వుంది. నిజాం నిరంకుశ పాలనలో ప్రజల బాధ హృదయవిదారకంగా వినపడుతోంది. సామాన్యుల రక్తం పిండి సామ్రాజ్యాన్ని నిర్మించుకొంటున్న కసాయి ప్రభుత్వం చేసే అరాచక కృత్యాలకు కవి అంతరంగం అగ్నిగుండంలా మండింది. ఆతని నాల్కమీద అగ్ని ధారగా కవిత ఆవిర్భవించింది.

'అది తెలంగాణలోన దావాగ్ని లేచి
చుట్టు ముట్టిన భయద సంక్షోభవేళ
అది నిజాము నృపాలుని అండదండ
చూచుకొని నిక్కినట్టి పిశాచ హేల -
నాడు మానవతీ నయనమ్ములందు
నాగసర్పాలు బుసకొట్టి నాట్యమాడె
నాడు మానవతయు నవనాగరకత
తన్నుతిన్నది రాక్షసత్వమ్ము చేత.'

అఖిల భారతం స్వాతంత్ర్య సమరం సాగిస్తుంటే-నిజాం రాష్ట్రంలో తెలుగు వారు స్వీయభాషా గౌరవాల కోసం, బానిసత్వ శృంఖలాలను తెంచుకోవటం కోసం జీవన్మరణ సమస్యలతో హోరాహోరీ పోరాటం సాగించారు. నిరంకుశ శక్తులతో ప్రజాశక్తి ప్రచ్ఛన్న యుద్ధం సాగించింది. నిజాం రాష్ట్రంలో అధిక సంఖ్యాకులు తెలుగువారు; కాని వారి భాషకు పరువులేదు ప్రభుత్వంలో. నవాబు ఖజానాలో

మూర్గే బంగారం తెలంగాణా రైతుల స్వేదజలాల సారం. అధికారికి అన్నంపెట్టే రైతుకు అన్నం లేదు. ప్రపంచంలో ప్రముఖ సంపన్నుడు నిజాం నవాబు. ఆయన ధనకోశానికి పణం పెట్టాడు తన అన్నకోశాన్ని తెలంగాణా రైతు. రెక్కలు విరుచుకొన్నా డొక్కలు నిండని సామాన్య జనుల దుర్భర జీవితగాథ తెలంగాణాలో కార్చిచ్చును మండించింది. తెలుగుమాట పల్కటానికీ,తెలుగు పండుగ చేసుకోటానికీ, తెలుగువారు కలిసి మాట్లాడుకోవటానికీ వీలుపడని నిషేధాజ్ఞలు చేయించిన నిజాం ప్రభుత్వం తెలుగు తల్లిని చెరలో పెట్టింది. తెలుగుబిడ్డల తీరుతెన్నుల మీద తీరని ఆంక్షలు మోపింది. భారత స్వాతంత్ర్యం వచ్చినా తెలంగాణా ప్రజల బాధలు తీర లేదు. రజాకార్ల దుండగాలతో తెలంగాణా అవమానాల పాలైంది. ఆస్తుల దోపిడీలూ గృహదహనాలూ, స్త్రీల మానాపహరణాలూ, తల్లి బిడ్డల కడుపు చిచ్చులూ, ప్రజా నాయకుల కృష్ణజన్మస్థాన ప్రయాణాలూ, హత్యాకాండలూ, అమానుష కృత్యాలూ తెలంగాణాన్ని కలత పెట్టి వేశాయి. ఈ అత్యాచారాలను చూచి దాశరథి ఆగ్రహో దగ్రుడైనాడు. అంతటికి కారకుడైన ఆ నిజాం నవాబును కవితా ఖడ్గంతో ఎదిరించాడు.

ప్రాణములొడ్డి ఘోర గహనాటవులన్ బడగొట్టి మంచి మా
గాణములన్ సృజించి ఎముకల్ నుసి జేసి పొలాలు దున్ని భో
షాణములన్ నవాబునకు స్వర్ణము నింపిన రైతుదే, తెలం
గాణము రైతుదే, మునలినక్కకు రాచరికంబు దక్కునే?'

'ఓ నిజాము పిశాచమా! కానరాడు
నిన్నుబోలిన రాజు మాకెన్నడేని
తీగెలను తెంపి, అగ్నిలో దింపినావు
నా తెలంగాణ కోటిరత్నాలవీణ'

'తరతరాల స్వప్నాల సుందరఫలమ్ము
స్వైర భారతభూమి చూపడెనా లేదా
విషము గుప్పించినాడు నొప్పించినాడు
మా నిజాంనవాబు, జన్మజన్మాలబూజు'

'అచట పాపము దౌర్జన్య మావరించి
తెలుగుదేశాన నెత్తురుల్ చిలికి చిలికి
మతపిశాచము పేదల కుతుక నమిలి
ఉమ్మి వేసెను పిప్పి, లోకమ్ము మీద'.

'నా తెలంగాణ కోటిరత్నాలవీణ
తీవియలు తెగి, విరిగి నదించకుండె
నా తెలుగుజాణ ప్రాణమానాలు దోచి
ఈ నిజాము పిశాచి కన్నెర్రచేసె.'

నిజాం ప్రభుత్వం ఈ అగ్గిపిడుగును ఇనుప గొలుసులతో బంధించింది. ఓరుగల్లు నగర వీధుల్లో నడిపించి హసించింది; నిజామాబాదు సెంట్రల్ జైలులో నిర్బంధించింది. బందీఖానాలో రామదాసులా ఆక్రందించలేదు దాశరథి; బడబాగ్నిలా ప్రజ్వలించాడు. వట్టికోట ఆళ్వారుస్వామి వంటి ప్రజల మనుషులు కటకటాల వెనుక కనుపించారు. వారితో కలిసి వ్యక్తిత్వాన్ని పెంచుకున్నాడు. తన విప్లవ కవిత్వాన్ని జైలుగోడలమీద శిలాక్షరిగా లిఖించాడు. ఆళ్వారుస్వామి దాన్ని అన్ని వైపులా చిత్రించాడు. 'ఓ నిజాము పిశాచమా:....నా తెలంగణా కోటి రత్నాల వీణ' అన్న పద్యం ఫిరంగిగుండులా ప్రభుత్వాన్ని భయపెట్టింది. ప్రజల హృదయాలకు సమర సంగీతంలా వినిపించింది. పద్యాలతోనే ఆగిపోలేదు దాశరథి! గీతాలలో కూడా నవాబును పడతిట్టాడు. కవితార్చితో కనకపు సింహసనాన్ని చుట్టుముట్టాడు!

ఇదేమాట ఇదేమాట పదే పదే అనేస్తాను!
ఖదంతొక్కి పదంపాడి ఇదేమాట అనేస్తాను:.....
జగత్తంత రగుల్కొన్న కృధాజ్వాల వృధాపోదు!
అడుగడుగున యెడదనెత్తు గడగడమని త్రాగినావు!

పడతుల మానాలు దోచి గుడగుడ మని 'హుక్క' త్రాగి!
జడియక కూర్చుండినావు మడికట్టుక నిలిచినావు !
దగాకోరు బడాచోరు రజాకారు పోషకుడవు !
వూళ్ళ కూళ్లు అగ్గిపెట్టి ఇళ్ళన్నీ కొల్లగొట్టి !

తల్లిపిల్ల కడుపుకొట్టి నిక్కిన దుర్మార్గమంత !
నీ బాధ్యత! నీ బాధ్యత !
'కోటిన్నర' నోటివెంట పాటలుగా మాటలుగా
దిగిపొమ్మని దిగిపొమ్మని ! ఇదేమాట అనేస్తాను,
వద్దంటే గద్దె యెక్కి ! పెద్దరికం చేస్తావా ?
మూడుకోట్ల చేతులు నీ మేడను పడతోస్తాయి; మెడనే విడదీస్తాయి !
నీకు నిలుచు హక్కులేదు నీ కింకా దిక్కులేదు !
(చరిత్ర బొంగరం తిరిగి కిరీటాలు నేల కొరిగి)
ధరాధిపులు నశిస్తుంటే బరాయెనాం నవాబా! పరాక్రమం చూపేవా!
దిగిపొమ్మని జగత్తంత నగారాలు కొడుతున్నది.
దిగిపోవోయ్, దిగిపోవోయ్ తెగిపోవోయ్, దిగిపోవోయ్ !
ఇదేమాట ఇదేమాట పదే పదే అనేస్తాను !"

భారత సైన్యాలు హైదరాబాదు విముక్తికి సన్నాహ మౌతున్న కాలంలో నవాబును దాశరథి అపహాస్యంగా అధిక్షేపించాడు-

"నడిగడ్డమ సముద్రాన పడకుండా కాపాడే
బడాయి నీ కెందుకు రాజా! లడాయి నీ కెందుకు ?
నీతుపాకి నిప్పులతో చేతులు కాల్చేసుకోకు !
నీళ్ళమీద నిప్పులుపడి చల్లబడక పోతాయా ?
నడింగడ్డ కడుపులోని నదులుకూడ అటువైపే
సముద్రాన్ని రమ్మంటూ సైగలు చేస్తున్నవిరా !
అంతర్బహిశ్చ తత్సర్వాం శత్రువులే నిండినార్రు-
ఇంకేమి బింకంరా ! ఓ లంకాద్వీపపు రాజా!"

హైదరాబాదు సంస్థానం భారతదేశంలో విలీనమై పోవటంతో తెలంగాణా విముక్తి సమరం ఫలించింది. నిరంకుశ పాలనం పోయి ప్రజా ప్రభుత్వం వచ్చింది. నిజాం ప్రభుత్వం నీరై పోవటానికి కాలం పెట్టిన శాపాన్ని దాశరథి భరత వాక్యంలా పేర్కొన్నాడు.

'మూడవపాలు తెల్గుపటమున్ తన పాలికి కత్తిరించుకొ
న్నాడు కదా నిజాము నరనాథుడు మున్నొక రెండుమూడు నూ
ర్లేడులనాడు! వాడు తొలగించిన ఆంధ్రమహాపతాక క్రీ
నీడలు నాగుపాములయి నేటికి కాటిడె వాని వంశమున్"

దాశరథి మొదటి కవితా సంపుటి 'అగ్నిధార' తెలంగాణా విముక్తి పోరాటంలోని తెలుగువారల సమరగీతం దాశరథికంఠంలో కాహళగా వినిపిస్తుంది. జైల్లో, ఉద్యమంలో వ్రాసిన కవితాఖండిక లున్నా యిందులో బహుళంగా, సమకాలీన ప్రజా ఉద్యమాన్ని ప్రజ్వలింప చేసిన వైతాళికుడు దాశరథి. ఉద్యమం దాశరథిని అగ్నికీలగా మండించింది; ఆయన కలం 'అగ్నిధారగా' రవ్వలు కురిపించింది.

"దాశరథి నిజమైన ప్రజాకవి. ప్రేక్షకుని వలె గాక ప్రజల కష్ట నిష్ఠురాలలో తానొకడుగా కలసి పోయినాడు. అందుచేతనే దాశరథి 'అగ్నిధార' లో అణుమాత్రమైనా కాల్పనికతగానీ అవాస్తవికతగానీ కనిపించదు. తెలంగాణ ప్రజల స్వాతంత్ర్య ఉద్యమానికి ప్రతిబింబం దాశరథి కవిత్వము' అన్నారు శ్రీ దేవులపల్లి రామానుజ రావుగారు.

ఆధునికాంధ్ర సాహిత్యచరిత్ర వ్రాసేటప్పుడు దాశరథి కొక ప్రత్యేక అధ్యాయం కేటాయించవలసి వుంటుంది. అది ఆయన ప్రత్యేకతకు తార్కాణం. ఆ ప్రత్యేకత అగ్నిధారతోనే ప్రారంభమైంది. తెలంగాణంలో ఉండటం చేత దాశరథి భారత స్వాతంత్ర్యపోరాటంలో ప్రత్యక్షంగా పాల్గొనే అవకాశం లేకపోయింది. హైదరాబాదు రాష్ట్రేతర ప్రాంతంలో వెలసిన నవ్యసాహిత్యంలో జాతీయోద్యమ, ఆంధ్ర రాష్ట్రోద్యమ ప్రబోధాత్మకమైన కవిత్వం ఒక ప్రత్యేకశాఖగా వర్ధిల్లింది. అందులోనూ జాతీయోద్యమానికి సంబంధించిన కవిత ప్రధానంగా గేయరూపంలో వెలువడింది; రాష్ట్రగానం పద్యమయంగా జాలువారింది. ఆంధ్ర ప్రశస్తిని, ఆంధ్ర తేజాన్నీ, కీర్తించే ప్రబోధకవిత్వం కూడా ప్రధానంగా పద్యాలలోనే వెలసింది. రాయప్రోలు తెలంగాణంలో ఉన్నా ప్రాచీనాంధ్రప్రశస్తిని కీర్తించారే కాని, నిజాం పరిపాలనలో మ్రగ్గిపోయిన తెలుగువారి అగచాట్లను చిత్రించే కవిత వినిపించలేకపోయారు. దాశరథి తెలుగుదేశంలో ఒకభాగమైన తెలంగాణా స్వాంత్రోద్యమానికి శంఖం పూరించాడు. తాను ఉద్యమంలో వీరుడుగా పాల్గొని కష్టనష్టాలకు గురి అయ్యాడు. ప్రజాశక్తులతో కలిసి జనంలో కవితావేశాన్ని కల్పించి వారిని కార్యరంగంలో దూకించాడు. విశాలాంధ్రచరిత్రలో తెలంగాణా విషాదగాథను, విప్లవచరిత్రను కలసి చదువుకొన్నప్పుడే సమగ్రత వచ్చేది. తెలుగు దేశంలో మూడవవంతు తెలంగాణం. దానిని మేల్కొల్పి యావదాంధ్రంతో చెలిమి కలిపిన కవికిశోరం దాశరథి. ఆయన ప్రభావంతో ఆ తరువాత ఎందరో ఆ రంగంలో దూకి పనిచేశారు. ఒక విధంగా దాశరథి

తెలంగాణంలో నవ్య కవికుల గురువు! ఆయన కవితకు తెలంగాణంలోనూ, తెలుగు దేశమంతటనూ ఎందరో అనుయాయులున్నారు. ఆశుకవిత్వంలోని వేగం, ఆధునిక కవిత్వంలోని ఆవేశం, ప్రబోధకవిత్వంలోని వైభవం ఆయన కవితలో సంగమించాయి తెలంగాణా స్వాతంత్ర్యోద్యమ కవిత దాశరథిగళంలో పద్య గేయ రూపాలలో సాగినా, ప్రజలు మెచ్చింది, సాహిత్య జగత్తుకు నచ్చిందీ ప్రధానంగా ఆయన పద్యకవితయే. ఉద్యమకవిత్వాన్ని పద్యంతో నడిపిన కీర్తి దాశరథికి దక్కుతుంది. అదే అయన ప్రత్యేకత!

తెలంగాణా విముక్తి పోరాటంలో విశాలాంధ్రకు బీజాలున్నవి. విముక్తి లేనిదే సమైక్యం లేదు. ఆ సమైక్యం గత వైభవ కీర్తనంవల్ల కాదు. సమకాలీన ప్రజా సమస్యలను పరిష్కరించటం వలన కలుగుతుందంటాడు దాశరథి?

'పటుబాహాబలురైన ఆంధ్రుల గతప్రాశస్త్యముల్ వల్లెవే
యుటలో కొన్నితరాలు దాటినవి; పూర్వోదంతముల్ నేటి సం
కటముల్ తీర్పవుగాక; నాటి జ్వలితాంగారమ్ము లీనాటి కుం
పటిలో బూడిద కప్పుకొన్నవి; రగుల్పన్ లెమ్ము వీరాంధ్రుడా!'

'ముక్కలు ముక్కలై చెదరిపోయెనురా! మనజాతి; హూణభూ
భుక్కుల రాజనీతికి కవుంగిట లొట్టిన 'రాజు' చేతిలో
చిక్కెను కోటిమంది నివసించెడు బంగరుతెల్గునేల; నే
డక్కడ తెల్గుటంగనల మానము ప్రాణము దక్కకుండెడిన్.

రాయప్రోలు కంటె దాశరథి త్రొక్కిన కొత్తబాట ఈ మాటలలో అర్థమౌతుంది. తెలంగాణ మంటే దాశరథికి కన్నతల్లి జ్ఞాపకం వస్తుంది. ఆమెను వేనోళ్ళ కీర్తించాడు దాశరథి. తన 'రుద్రవీణ'ను ఆమెకే అంకితం చేశాడు.

'నను గని పెంచినట్టి కరుణామయి నా తెలంగాణ! నీ గృహాం
గణవనసీమలో బరుసుకంపలు నాటిన మా నిజామురా
జును పడద్రోసినట్టి రణశూరుల వెచ్చని నెత్రుచుక్కలే
మణికృత దీపమాలికలమాదిరి నీకు వెలుంగులిచ్చెడిన్'

'పాటలు పాడితిన్ తెలుగుబాబులు నిద్దురమేలుకోగ, పో
రాటము సేయగా కరకురాచరికమ్మును కూలద్రోయగా

కోటిగళాల నొక్కకడ గూర్చితి విప్లవశంఖ మొత్తితిన్
నాటికి నేటికిన్ తెలుగునాటికి వెచ్చదనంబు లూదితిన్"

తెలంగాణను విముక్తిచేసిన ఈ తెలుగు కవివీరుడా తల్లిని చివరకు కోరే వరం విశాలాంధ్ర:

'తుంగభద్రానదీభంగమ్ము లిరుకేవ
లొరసిపారుచు రుచు లరయుచుండ
కృష్ణవేణీతరంగిణి నాలుకలు సాచి
దరుల రెంచిట 'మజా' లరయుచుండ
గోదావరీ వీచికా దివ్యహస్తమ్ము
లిరుకెలంకుల మన్ను తరచుచుండ
బోటి కిన్నెరసాని మాటిమాటికి పొంగి
రెండువైపుల దరు లందగొనగ
ఇటునటును తెల్గునేల లారటము జెంది
కలసిపోజూచుచున్న యట్టులనె తోచు
కలిపివేయుమి, నా తెలంగాణతల్లి!
మూడుకోటుల నొక్కటే ముడిబిగించి.

"నాకోర్కె తీర్చుమమ్మా!
నీకు మదీయాశ్రుకణవినిర్మితమాలా
నీకమ్ము సమర్పించెద
గాక; విశాలాంధ్ర మనెడి కల నిజమగుతన్"

విశాలాంధ్ర సమైక్యభావానికి నదుల నిలా సమన్వయసూత్రంగా వాడుకున్న పద్యాలు తెలుగులో అరుదు. దాశరథి విశాలాంధ్రభావనం అఖండభారతభావన కనుబంధం.

'జండా ఒక్కటి మూడువన్నెలది; దేశం బొక్కటే భారతా
ఖండాసేతుహిమాచలోర్వర; కవీట్కాండంబులోనన్ రవీంద్రుం డొ
క్కండె కవీంద్రుడు; దూర్జితజగద్యుద్ధాలలో శాంతి కో
దండోద్యద్విజయుండు గాంధి ఒకడే తల్లీ! మహాభారతీ!

దాశరథి కవిత్వానికి జాతీయాభిమానం జీవితం; మహాభారతంలో మహాంధ్రం అఖండంగా ఉండాలనే ఆయనభావం: ఆయన ఉద్యమానికి అదే లక్ష్యం!

# 2

నిజాంపాలనకు వ్యతిరేకంగా ప్రజావిప్లవంలో పాల్గొన్న దాశరథికి సామ్యవాద సిద్ధాంతం మీద సానుభూతి కలిగింది. ప్రపంచంలో ప్రచండంగా వ్యాపిస్తున్న సోషలిష్టు దృక్పథం ఆయన్ను ఆకర్షించింది. చరిత్రగతిలో వర్గసంఘర్షణం వలన కలిగే విప్లవాల స్వభావం అవగతమైంది. అగ్నిధారలో మెరిసే మరో పదునైన అంచు పీడిత ప్రజాసముద్ధరణ సంకల్పం: అగ్నిధార ఉత్తరార్ధంలో దాశరథి సామ్యవాద కవితా దృక్పథం ప్రపంచింపబడింది.

ఆధునికాంధ్రసాహిత్యంలో ఈ మార్గానికి ప్రయోక్తగా నిలిచిన యుగకర్త శ్రీశ్రీ. ఆయన ప్రభావం దాశరథి మీద బలంగా కనపడుతుంది. శ్రీశ్రీ తిరుగుబాటు సంప్రదాయం మీదా, ఛందస్సులమీదా, సమాజవ్యవస్థ మీదా ఒక్కసారిగా ఉవ్వెత్తున సాగింది. దాశరథి తిరుగుబాటు సమాజవ్యవస్థకే పరిమితమైనట్లు కనబడుతుంది. పద్యాల్లో తన నూత్నచైతన్యాన్ని అంతర్నాదంగా వినిపిస్తాడు అగ్నిధారలో-

"నాగీతావళి ఎంతదూరము ప్రయాణం బౌనొ; అందాక ఈ
భూగోళమ్మున అగ్గిపెట్టెదను; నిప్పుల్ వోసి హేమంత భా
మాగాంధర్వ వివాహమాడెదను; ద్యోమణ్యుష్ణగోళమ్ము పై
ప్రాగాకాశనవారుణా ప్రజలధారల్ చల్లి చల్లార్చెదన్"

"వీణియతీగపై పదను పెట్టిన నాకరవాలధారతో
గానము నాలపింతు; కవికంఠము నుత్తరణం బొనర్చి స్వ
ర్గానకు భూమినుండి రసగంగలు చిమ్మెద; పీడిత ప్రజా
వాణికి 'మైక్' అమర్చి అభివాదులకున్ వినిపింప జేసెదన్"

సంకల్పం పద్యంలో చేసినా సాధన గేయంలోనూ, వచనంలోనూ సాగింది తర్వాత-

"అనాదిగా సాగుతోంది-అనంత సంగ్రామం
అనాథునికీ ఆగర్భ-శ్రీనాథునికీ మధ్య
సేద్యం చేసే రైతుకు-భూమి లేదు పుట్ర లేదు
రైతుల రక్తం త్రాగే-జమీందార్ల కెస్టేట్లు.

మిల్లు నడిపి, క్రోట్ల డబ్బు-కొల్లగ లాభం తెచ్చే
ఘూల్లోనిది కాదు మిల్లు-మిల్ మ్యాగ్నేటొక సేటు
కర్షకులు కార్మికులు-మధనపడే మేధావులు
తమశ్రమలకు తగినఫలం-ఇమ్మంటే తిరుగుబాటు
షావుకారు వడ్డీలకు-జమీందార్ల హింసలకు
వేగలేక ఆగలేక-తిరగబడితె అతివాదం"

అని సమీక్షించి, 'ప్రజాద్రోహి వర్గానికి-లయకాళిక శ్రమికజాతి; జగద్విప్లవ గళంలో జయమాలిక శ్రమికజాతి; మేల్కొన్నది; మేల్కొన్నది!' అని గుర్తించాడు దాశరథి. పశ్చిమఖండాల సామ్రాజ్యతత్వానికి ఎరయై శల్యావశిష్టమైన ప్రాగ్భూమిని చూచి విస్తుపోయాడు దాశరథి.

"పడమటి బొల్లిగద్దలు-పొడిచి పొడిచి తిని విడిచిన
అగ్నిసంస్కారం నోచని-నగ్నశవం ప్రాగ్భూమి!
"మతాలతో గతాలతో- చితి రగిల్చి పడి చచ్చే
అన్నాదమ్ముల చల్లని-కన్నతల్లి ప్రాగ్భూమి!
కరువుల తెరచాటున-మరణాంగనాలింగనంలో
కనుమూసిన నిరుపేదల-ప్రణయశాల ప్రాగ్భూమి!
లక్షలాది పేదల ప్రాణాల్-అక్షింతలుగా చల్లుకొన్న
లక్షాధికార్ల పాలిటి-లక్ష్మీదేవి ప్రాగ్భూమి!"

ఆసియాలో ఉదయించిన నవారుణ చైతన్యం దాశరథి కవితకు సమసమాజ స్పృహను కల్పించింది. 'రుద్రవీణ'లో అతనికంఠం మరింత స్పష్టంగా తన భవితవ్యాన్ని చెప్పింది.

"రానున్నది యేది నిజం?-అది వొకటే సోషలిజం!
కలపండోయ్ భుజంభుజం-కదలండోయ్ గజంగజం!
అడుగడుగున యెదద నెత్రు-మడుగులుగా విడువండోయ్!
పడిపోయిన గుడిగోడలు-విడిచిపెట్టి నడవండోయ్!
ఉదయాకాశ పతాకం-యెదలో కదలాడె నేడు!
హృదయావేశ తటాకం-నదిలా పొరలాడె నేడు"

మరో ప్రపంచాన్ని చూపిస్తూ ముందుకు తోస్తున్న శ్రీశ్రీ లాగ దాశరథీ ప్రజలను

ప్రబోధించాడు. 'గతాన్ని విస్కీ గా తాగిన కవిన్నేను: భవిష్యత్తు నిషానిజం!' అని. దాశరథి విస్కీపుచ్చుకున్నా శ్రీశ్రీ అంతవేగంగా ముందుకుతూలి సాగలేకపోయాడు. అందులోనే ఉంది ఆయన ప్రత్యేకత!

శ్రీశ్రీ లాగా దాశరథి సమాజంలోని కొన్ని చీకటికోణాలను చూపి సామాజికుల్ని కరుణార్ద్రుల్ని చేయటమే కాకుకడా, సమాజం కన్నులు తెరిపించాడు.

"ఈ సమాజాన దోపిడికే నివాన
మిందు నీకేమి లేదు; సహింపరాని
వేదనయె కాని వేరు కన్పింపబోదు
లే, చివాలున లేచి మళ్ళించు రథము!

'నరజాతి చరిత్ర సమస్తం పరపీడన పరాయణత్వం' అన్న సత్యానికి ఈ పద్యం వ్యాఖ్యానం. 'తాజ్‌మహల్ నిర్మాణానికి రాళ్లెత్తిన కూలీ లెవ్వరు?' అన్న సామాజిక ప్రశ్నకు ప్రత్యుత్తరంగా ఒక కూలిదాని చిత్రాన్ని మనముందు దాశరథి గీసి చూపిస్తాడు. ఆమె నుదుట అగ్నికుంకుమం దిద్ది ఆశ్వాసిస్తాడు.

"ఓసి కూలిదానా! అరుణోదయాన
మంటితట్ట నెత్తిన బెట్టి మరుగు లేని
యెత్తు రొమ్మును పొంగించి యెందుకొరకు
ఉస్సు రనెదవు? ఆకాశ ముడికి పోవ.

అంబరచుంబి సౌధముల కాయువు పోసెడి నీశ్రమ ప్రభా
వంబు నెఱుంగలేని ధనవంతుల బంగరుపళ్లెరాలలో
అంబలిపోసి త్రావుసమయంబులు దగ్గరె లెమ్ము! నీ నవా
స్యంబున రుద్రనేత్ర విలయాగ్నుల కుంకుమబొట్టు పెట్టుమా."

ఇంతకంటే దయనీయమై, సాంఘికవ్యత్యాసాలను చిత్రించే మరో చిత్రం చూడండి:

"చింతలతోపులో కురియు చిన్కులకున్ తడిముద్దయైన బా
లింత యొడిన్ శయించు పసిరెక్కల మొగ్గనుబోని బిడ్డకున్
బొంతలు లేవు కప్పుటకు బొంది హిమంబయి పోవునేమొ; సా
గింతును రుద్రవీణపయి వించుక వెచ్చని అగ్నిగీతముల్"

సమాజంలోని ఎత్తుపల్లాలను దాశరథి చూచి నిర్వేదపడ్డాడు; ఆగ్రహావేశపరుడై

నాడు. దీని పరిష్కారం సోషలిజమని విశ్వసించాడు. వర్గసంఘర్షణచరిత్ర సత్యమైతే ఒకవర్గం మరోవర్గాన్ని విప్లవం ద్వారా తొలగించి అధికారంలోకి వస్తుంది. అయితే విప్లవం శాంతివిప్లవమా ? లేక సాయుధవిప్లవమా ! అన్నది సమస్య, ఆధునిక ప్రపంచంలో ఏయిజాన్ని ఆశ్రయించిన పెద్ద దేశమైనా తనస్వార్థంకోసం పరపీడన పరాయణత్వాన్ని అమలులో పెడుతూనే ఉంది. వర్గరహిత సమాజవ్యవస్థా స్థాపనం కోసం మరోవర్గాన్ని మారణహోమం చేసిన ఘట్టాలూ కనపడుతున్నాయి. ప్రచ్ఛన్నంగా ప్రపంచాధిపత్యానికి ప్రణాళికలు తయారు చేస్తూనే ఉన్నాయి. వర్గాలమధ్య సంఘర్షణ యేర్పడినా, దేశాల మధ్య సంఘర్షణ యేర్పడినా, ప్రపంచసంస్థలు ఎన్ని కృషి చేస్తున్నా-వీటన్నిటి వెనక నున్న మానవుణ్ణి మాత్రం చాలసార్లు విస్మరించటం జరుగుతున్నది. శాస్త్ర విజ్ఞానం చంద్రమండలయాత్రకూ, మారణహోమానికీ కూడా వినియోగపడుతున్నది. విజ్ఞానం రాజకీయస్వార్థశక్తుల చేతుల్లో పడి విలయతాండవం చేస్తోంది. ప్రపంచమంతా శాంతిని కాంక్షిస్తోంది. ఎన్నిమార్పులు వచ్చినా, ఎన్ని ఇజాలు మారినా, ఎన్నిప్రభుత్వాలు మారినా ప్రపంచ శాంతికీ మానవత్వానికీ మహోన్నత స్థానం రావటంలేదు. ఇటువంటి విశ్వవాతావరణంలో ఏదో ఒక వాదానికి కట్టుపడటం విజ్ఞతకు లక్షణంకాదు. ఆర్థిక సమానత్వాలు తొలగటానికి సామ్యవాదం ఉపాధేయమే; కాని విప్లవం హృదయచైతన్యం రూపంగా రావాలి కాని రక్తపాతంతో కాదు! మనిషి కోసమే ఈ ప్రపంచ మైనప్పుడు మానవతావాదం వీడలేము.

ఈ మూడుసూత్రాల ముడిలో శాంతి భద్రంగా ఉండాలి. అదే విశ్వశ్రేయస్సు. ఈ విధమైన అవగాహనం భారతదేశనాయకులు రూపొందించిన శాంతి పథంలో ఉంది. దాని ప్రవక్త గాంధీ; దానికి రూపకల్పన చేసింది నెహ్రూ! అందుకే భారతదేశం సామ్యవాదాన్నీ శాంతిపాఠాన్నీ కలిపి చదువుతుంది; స్వతంత్ర శక్తుల్నీ! సత్యాగ్రహ విప్లవాన్నీ సమర్థిస్తుంది; ప్రజాస్వామ్యాన్నీ ప్రగతిశీలాన్నీ ముడివేస్తుంది; ఆర్థికాభివృద్ధితోపాటు హార్థికస్నేహాన్ని పెంపొందించ మంటుంది. దాశరథి ఈ సమన్వయ మార్గంలో నడిచే శాంతి విప్లవవాది.

దాశరథి శాంతి విప్లవ బీజాలు పునర్నవంలో పొడకడతాయి
"తెలంగాణలోని కోటి-ధీరులగళధ్వనినే గాక
ఇలాగోళమందుండెడి-ఎల్లరి శబ్దాన్ని నేను-
నా పేరు ప్రజాకోటి-నా ఊరు ప్రజావాటి."

"గతమే జీవిత మనుకుని-వర్తమానమే వలదని
వెనక్కు నడిచే వారిని-వెక్కిరించు కోర్కి లేదు."
"గతమంతా బూదికుప్ప-కావాలి మనోజ్ఞ భావి
తిరుగబడండని అరచే-బిరుసువారి నిందింపను"
"ఇవి రెండూ ఒక కత్తికి-అటూ ఇటూ రెండంచులు
నే మాత్రం రెండంచుల-సాము చేయగలను లెండి!"

"గతాన్ని కాదనలేను-వర్తమానం వద్దనబోను
భవిష్యత్తు వదలుకోను-కాలం నా కంఠమాల
నా పేరు ప్రజాకోటి-నా ఊరు ప్రజావాటి"

బాంబులలో బలం చచ్చి-పాములలో విషం చచ్చి
ప్రేమములో బలం హెచ్చి-స్నేహములో శక్తి హెచ్చి
చిన్నపాటి అంకుశమున-గున్నయేనుగును వంచే
కొత్తరకం పద్ధతి కను-గొన్నానండో-రండో!"
"భరతభూమి నేర్పినదో-ప్రజాకోటి నేర్చినదో
నిజం ఏమిటో గాని-వట్టిచేతితో శత్రువు
పై దుమికే శక్తివుంది"
"ఎర్రజెండ పట్టుకొని-ఎగసిపోవువాడి తోటి
పచ్చజెండ పట్టుకొని-పరుగుతీయువానితోటి
మైత్రీ బంధం కూర్చే-మహాశక్తి నా కున్నది."
"ఎవడైనా మానవుడే-ఎందుకు ద్వేషించడాలు
రాక్షసినైనా మైత్రికి-రానిత్తును భయం లేదు!"
"హృదయం వినా నాదగ్గర-ఏ వస్తువు లభింపదు
ఉదయం వినా నాకంటికి-ఏ వస్తువు రుచింపదు!
"అందరికంటే ముందే అణ్వస్త్రము గొనిపోయి
అఖాతాన పడవేసితి-సుఖపడగా ప్రజాకోటి!

"కత్తిపట్టి గెలిచినట్టి-ఘనుడగు వీరుండెవ్వడు ?
మెత్తనిహృదయం దాటికి-తుత్తునియలు కానిదెవడు ?
అజ్ఞానపు అడుసుకడిగి-అసలు విషయ మెరుంగుడీ-
ఘర్షణలో ఏనాటికి-హర్షం లభియింపబోదు".

దాశరథి సామ్యవాదం మానవతావాదంతో పునీతమైంది. కొత్తకాంతితో కపోత సందేశం వినిపించింది. శాంతి విప్లవవాది ధరించేది మారణాయుధాలు కావు: శాంతి పుష్ప బాణాలు. 'శిశిరమనే రాక్షసిని కసితీరగ సరుకుటకు, అంతకన్న నిశితమైన ఆయుధ మక్కరలేదు!' మానవతామలయవాయు సంచారములే చాలును. శాంతిపుష్ప బాణాలను కురియించుటయే చాలు' నంటాడు దాశరథి.

"ఏనా డెవ్వడు కత్తితో గెలువలే దీ విశ్వమున్; ప్రేమ పా
శానన్ కట్టుము నాలుగుంబది ప్రపంచాలన్; మహత్మ్యం డిదే
జ్ఞానోద్బోధము చేసె; నెవ్వడు వినెన్; సాహిత్యసామ్రాజ్యమం
దైనం కొంతగ శాంతి పాడుకొననిమ్మా! నీకు పుణ్యంబగున్!"

అని ఆధునిక ప్రపంచాన్ని అనునయిస్తాడు మహేంద్రోదయంలో దాశరథి.

ఆధునికాంధ్ర సాహిత్య క్షేత్రంలో భావచైతన్యస్రవంతి మూడుపాయలుగా చీలి ప్రవహిస్తోంది. ఒకటి: సంప్రదాయ చైతన్యధార. దీనికి నాయకుడు కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ. రెండు: సాయుధ విప్లవచైతన్యధార, దీనికి నాయకుడు మహాకవి శ్రీశ్రీ. మూడు: శాంతివిప్లవచైతన్యధార. దీనికి నాయకుడు మహాకవి దాశరథి. ఇందులో మొదటిరెండూ రెండు తీవ్రవాదాలు, వాటిని సమన్వయిస్తూ అభ్యుదయాన్ని వరించే మధ్యేమార్గం దాశరథిది. ఆయన మధ్యేమార్గపు మాగ్నకార్టాలు "తిమిరంతో సమరం" "ఆలోచనాలోచనాలు"

"తిమిరంతో ఘనసమరం-జరిపిన బ్రతుకే అమరం
కవితాతేజోవలయం-అవని శాంతి కది నిలయం"

ఈ గీతం ఆయన జీవితాని కెలా వర్తిస్తుందో-ఆయన కవితా సిద్ధాంతాని కలా అనువర్తిస్తుంది. తిమిరం నలుపుకు ప్రతీక. విశ్వశ్రేయస్సుకు, విశ్వశాంతికి, విరుద్ధమైనభావం తిమిరం. అభ్యుదయానికి అవరోధంగా నిలిచేది తిమిరం. మానవజీవితం సాధించే చివరిమెట్టు అమరత్వం. అమరత్వం అనవరత సమరసంకేతం. అది చేసేది

చీకటితో సమరం: తిమిరమంటే అజ్ఞానం కావచ్చు; అహంకారం కావచ్చు; నిర్దయ కావచ్చు; పారతంత్ర్యం కావచ్చు; పరులను దోచుకోవడం కావచ్చు; శత్రువ్యూహం కావచ్చు; మిత్రద్రోహం కావచ్చు; స్వార్థం కావచ్చు; సామ్రాజ్యవాదం కావచ్చు; వేదన కావచ్చు; వేర్పాటు ధోరణి కావచ్చు; అనైకమత్యం కావచ్చు; అవినీతి కావచ్చు; హింస కావచ్చు; రక్తపాతం కావచ్చు-ఇలా ఏకాలంలో ఏప్రాంతంలో ఏవిధంగా తిమిరం తీండ్రించినా దానితో సమరం చేయడమే కాంతికిరణానికి లక్షణం: ఈ కాంతికిరణం కలంలో మొలవ్వచ్చు, కరవాలంలో మోహరింపవచ్చు: ఒక్కొక్కసారి రెండూ కలిసి శాంతికవాటం తెరవచ్చు. అయితే కలాన్నీ కరవాలాన్నీ కదిలించేది మానవుడు. కదిలించిన ఆరెండూ మనిషినే బలితీసుకోరాదు. మనిషిని మరిచిపోయిన మహాసమరం కూడా తిమిరమే. ఆ తిమిరాన్నుంచి దూరం కావాలని విశ్వాత్మ ఘోషిస్తున్నది. చరిత్రలో దాని అడుగుల చప్పుడు వినపడుతున్నది. దాశరథికవితలో ఆ ధ్వని వినిపిస్తోంది. 'మానవత్వం గెలుస్తుంది; దానవత్వం ఓడుతున్నది: అవనిలో హృదయాలలోగల, అంధకారం వీడుతున్నది'. ఇటీవలి వియత్నాం, బంగ్లాదేశ్ ప్రజల విజయాలు ఆ సత్యాన్ని ఘోషిస్తున్నవి.

దాశరథి ఆవేశానికి ఆలోచనాలోచనాలు తెరిపించారు. తమ రెండవ సంపుటిలో సేనాధ్యక్షుడుగా సంఘం మొగదల నించొని శాంతివిప్లవ ఆదేశాన్నీ సాయుధ విప్లవ ప్రతిఘటనాన్నీ ప్రబోధిస్తాడు దాశరథి. సాటిరచయితల నుద్దేశించి, "అశాంతినీ, అరాచకాన్నీ, అన్నిదిశల వ్యాపింపచేసే ఆ విషహృదయాలపై, దాడిచేయండి గళాలతో, ఆ విషవలయాలను దండించండి కలాలతో" అని నిర్దేశిస్తూ "మాకర్తవ్యం మీరు నిర్వహించండి, లోకానికి నిజం తెలియచెప్పండి' అని ధర్మగీతను ఉద్బోధిస్తాడు. "హింసనుండి సమసమాజహంస ఉద్భవించుననే, అసత్యాన్ని నమ్మకు హంతకుడవు కాబో"కని హెచ్చరిస్తాడు యువశక్తిని. 'నిన్ను నీవు తెలుసుకొని, నీ కన్నులు తెరుచుకొని, విజృంభించినప్పుడే విప్లవమని నేనంటా"నని తాను నమ్మిన సత్యాన్ని నిర్మొగమాటంగా ఉద్ఘోషించాడు. నిరాశా దురాశలు నిరంతరం దాడిచేస్తున్న ఈనాడు దాశరథి నిస్సందేహంగా నిలిచిన ఆశావాది. ఆయన దర్శించే భవిష్యత్తు మానవతా కేతనం 'నవకవితా పతాకతో, యువతా శశిరేఖతో అజ్ఞానాంధకారాన్ని అణగిస్తూ, అమాయకుల ఆక్రందనను తొలగిస్తూ, పదవీదాహదావానలాన్ని చల్లారుస్తూ అవకాశవాద పిశాచాన్ని హతమారుస్తూ, అపరిపక్వమైన విప్లవాండాన్ని అవియించ జూచే వినతల్ని అనాదరిస్తూ, కాలచక్రాన్ని వెనక్కి తిప్పాలని కడుప్రయత్నించేసే కాలాంతకుల్ని కాలరాస్తూ, రావాలి, భవిష్యత్తని భావిని ఆహ్వానించాడు. విప్లవనినాదాలు చేసే వీరావేశపరుల్ని చూచి అధిక్షేపిస్తూ వారి సమస్యకు పరిష్కారం చెప్పాడు.

"వీరంగం వేస్తుంటేరాదు విప్లవం-
తారంగం పాడుతుంటే రాదు సమరథం
అందుకోసమే నేనంటాను
ఏ లేహ్యం తిన్నాగాని రాదు యౌవనం
రక్తం నదులై పారకపోతే రాదా రెవల్యూషన్?
బుర్రలు బుర్రలు పగులక సమస్యకు లేదా సొల్యూషన్?
హింసా, యుద్ధం ఔట్ డేటెడ్ అని నే నంటాను,
శాంతి ఒక్కటే మానవజాతికి సరియగు సాల్వేషన్ !"

దాశరథి బోధించే మహావిప్లవం మానవత్వంతో ముందునడిచే క్రాంతిపథం. శాంతి దానికి మూలసూత్రం. ఆ శాంతిపాఠం గాంధీగా రిచ్చిన అమరసందేశం. ధరిత్రికంతా గాంధేయ ధర్మమే తరణోపాయమని దాశరథి నిశ్చానం.

"ప్రతి యెదలో మహాత్ముడే-ప్రతిష్ఠితుడు కావాలి
అతని అడుగుజాడలందు-అఖిలజగం నడవాలి
నేటి క్లిష్ట సమస్యలకు సూటి జవా బతడు
నేటి అస్థిరత్వమునకు-మేటి సవా లతడు
అత డొకడే ఈ జగతికి ఆశాజ్యోతి
అతడే ఈ కవిగళమున-ఆనందగీతి!"

ఈ గాంధేయ విప్లవవాది విప్లవం హింసతోకంటె ప్రేమతోనూ, త్యాగంతోనూ సాధించ వచ్చునని నమ్ముతాడు. విప్లవవాదికి అందుకనే తన నిర్వచనం చెప్పాడు దాశరథి.

"విప్లవమంటే అర్థం తెలియనివారికి
పిస్తోలు పట్టినవాడే విప్లవవాది,
విప్లవం అంటే అర్థం తెలిసినవారికి
పిస్తోలుకు గురియైనవాడే విప్లవవాది!"

సూర్గకవుల్లో దేశికవిలాగా విప్లవవాదుల్లో దాశరథి జాతీయవాది. తాను పుట్టిన మట్టికి మన్నికతెచ్చే మహావిప్లవం రావాలంటా డాయన. 'ఏదో ఒకదేశంలో ఏదో అయితే, అలాగే మనదేశంలో అవాలని అనకండ'ని సాయుధవిప్లవవాదుల్ని సాధిస్తాడు. విదేశీ విద్యావిధానాలను విద్యార్థులమీద పులిమినట్లు విదేశీయ విప్లవాలను

స్వదేశంలో దేశకాల పాత్రాలను గమనించకుండా ప్రయోగించవద్దంటాడు దాశరథి. విప్లవయజ్ఞానికి త్రేతాగ్ని సంపుటిగా మూడు సమాజశక్తుల్ని గుర్తించాడాయన.

"నేను త్రేతాగ్నిలో ఒక అగ్నిని
కర్షక కార్మిక కవిశక్తులు
కలసి, వెరసి త్రేతాగ్ని అనుకునేవాణ్ణి.
ఈనగ్నోద్విగ్న త్రేతాగ్నికి
నవసమాజ నిర్మాణ ధర్మకర్మ నిష్ఠాపర
అనేకానేక మహాప్రజాహృదయ రుధిరధార
ఆజ్యధార !"

పరానుకరణం దాశరథికి గిట్టదు. స్వదేశాభిమానం ఆయనలో చావలేదు. అందువల్లనే ఈ మార్గం ఆయన తొక్కాడు.

"అమ్మా! భారతీ!
నేను మరోదేశాన్ని అనుసరించి, అనుకరించి
అడుగు ముందుకు వేయలేను"

అని మాతృభూమికి నివేదించాడు. ప్రజాస్వామ్యవ్యవస్థలో శాంతివిప్లవమే ప్రయోజనాత్మకమని దాశరథి సందేశం! ఆధునికాంధ్రసాహిత్యంలో ఆయన కవిత జాతి కందించిన శాంతిగీత !

# 3

ఆంధ్రులనూ అనైకమత్యాన్నీ కలిపి చదువుతుంటారు చాలమంది. ఐకమత్యం ఉంటే అఖిలభారతంలో అగ్రతాంబూలం వారిదే అని ఆశాగీతాన్ని ఆలపిస్తున్నారు అందరూ ! అన్నివేళలా ఆశల్ని నిరాశలు చెయ్యలేదు ఆంధ్రులు. ఆంధ్రులు అవన రాలకోసం అలజడులు రేపుకున్నా ఆఖరికి అన్నదమ్ముల్లా ఉండటానికి అంగీకరిస్తారు. అంగీకారానికి అవధులు పెట్టుకోకపోయినా అన్నమాట కాదనకూడదనే ఆచారాన్ని గౌరవిస్తారు.

భాషారాష్ట్రప్రాతిపదికమీద ఆంధ్రరాష్ట్రోద్యమాన్ని నడిపిన వారాంధ్రులు. నాల్గుగుదశాబ్దాల పోరాటానికి ఫలంగా పొట్టి శ్రీరాముల ఆత్మార్పణ మూలంగాఆంధ్ర రాష్ట్రం వచ్చింది. నాల్గు చెరగుల తెలుగు బిడ్డలు వెల్లురేకల్లా కలిసి వెలగాలని విశా

లాంధ్ర ఉద్యమం మోసులెత్తింది అవగాహన ప్రాతిపదికగా ఆంధ్రప్రదేశ్ అవతరించింది. ఆంధ్రుల చిరకాల వాంఛితం ఫలించింది.

ఈ ఫలం ఐక్క రోజున ఊడిపడింది కాదు; ఒక్కొ రెవరో పండించింది కాదు. అయినా తెలంగాణం ఆంధ్రరాష్ట్రంలో కలియటానికి ఎన్నో తికమకలు పుట్టాయి. భావ సమైక్యానికి అవకాశాలు లేని ఆరోజుల్లో తెలంగాణా నాయకులతో పాటు, కవులు కూడా తెలుగుప్రజలకు 'కలిసి ఉంటే కలదు సుఖ' మన్న ప్రబోధాన్ని వాడవాడలా వినిపించాలసి వచ్చింది. సాహిత్యరంగంలో తెలంగాణా రచయితల సంఘం ఆ పాత్రను సమర్థవంతంగా నిర్వహించింది.

తెలంగాణా రచయితలసంఘానికి రూపకల్పనచేసిన ప్రధాన శిల్పి శ్రీదాశరథి. విశాలాంధ్ర భావానికి కవితాకల్పకాన్ని సృష్టించిన మనీషి దాశరథి. కాళోజీ, దేవులపల్లి, వానమామలై, రామరాజు, నారాయణరెడ్డి, వట్టికోట, పల్లా దుర్గయ్య, ప్రభృతులను చేరదీసి తెలంగాణంలో నిర్విరామంగా పర్యటించి కవితాగానాలుచేసి సాహితీ చైతన్యాన్ని కల్పించటంతో పాటు, రాష్ట్రసమైక్యభావాన్ని ప్రబోధించాడు దాశరథి. తీరాంధ్రంలో నవ్యసాహిత్య పరిషత్తు పక్షాన శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి ప్రభృతులు నిర్వహించిన సాహితీయజ్ఞం లాంటిదే తెలంగాణా రచయితలసంఘం చేసినకృషి. దాశరథి 'మహాంధ్రోదయం' విశాలాంధ్ర కెత్తిన స్వాగతం.

దాశరథి పిలుపును ఆంధ్రదేశమంతా అందుకొన్నది. తెలుగుపత్రికలు పతాక శీర్షికల్లో, సంపాదకీయంల్లో దాశరథి పద్యాలను పేర్కొంటూ సమైక్యకంఠంతో సమైక్యాంధ్రను సమర్థించాయి. విశాలాంధ్ర కనుమేరలో కనిపించినప్పుడు దాశరథి క్షీరశరధిలా ఉప్పొంగి పోయాడు.

'కోటిగొంతులు విచ్చి మేటి తెలంగాణ
జోహారులను పల్కె జొచ్చె నేడు;
మంజు మంజీరాకుమారి రాజకుమారి
వోలె నీటుగ తెల్లు పొంగు సూపె;
వేకంబములగుడి ప్రిదిలిన తనగాథ
మరచిన కొత్త వెలుంగు పరచె దెసల;
ఎనిమిదిమండలాలేక కంఠమ్మున
తెలురాష్ట్రమునకు దివ్వెలెత్తె

"మంగాళాత్రికమ్ముల పొంగిపోయె
ఆంధ్రరాష్ట్రము వచ్చె; మహాంధ్రరాజ్య
మేరుపడురోజు పొలిమేర జేరినిలచె
నా తెలంగాణతల్లి ఆనందపడగ !"

తెలంగాణానికి ప్రతినిధి దాశరథి. ఆయన కవిత అంతా ఆత్మాశ్రయమే. ఆయన పలికిన పలుకులన్నీ ప్రజాకోటి ముక్తగీతాలే. విశాలాంధ్రావని అంతా దాశరథి హృదయంలో ప్రతిధ్వనించింది. ఆయన ఒక తెలంగాణా కవిగానే కాదు తెలుగు వారందరి ఆత్మ తేజస్సులా ఆవిర్భవించింది-'ఏది కాకతి? ఎవతి రుద్రమ? ఎవడు రాయలు? ఎవడు సింగన? అన్నీ నేనే; అంతా నేనే; వెలుగు నేనే; తెలుగు నేనే' అని అఖండాంధ్ర తేజంలా ఆనాందనాట్యం చేశాడు.

కలసి ఉన్న రాష్ట్రంతో కలతలు రేగి వేర్పాటు ఉద్యమాలు ప్రజ్వలించి తెలుగు నేల మరలా రెండు మూడు ముక్కలయ్యే విపత్తు సంభవించిన నాడు దాశరధి హృదయం దద్దరిల్లి పోయింది. తెలంగాణాకు కొత్త నిర్వచనం ఇచ్చాడు దాశరధి. అఖిలాంధ్రకు మారుపేరు కాదా అని ప్రశ్నించాడు.

'కమ్మని నాతెలంగాణ తొమ్మిది జిల్లాలేనా?
బహుళాంధ్రకు తెలంగాణ, పర్యాయపదంకాదా?

(ఈ మాట దాశరధి అన్నప్పుడుండే విలువ మరెవరైనా సాహిత్యజగత్తులో అంచే లేదేమో)

వేర్పాటు ధోరణిని మందలించాడు-

'కుడికంటిని యెడమకన్ను పొడిచేనా?
కుడిచేతిని యెడమచేయి నరికేనా?
ఒకదేహం-ఒకగేహం-మరిరావా?
ఒక్కతెలుగు-ఒక్కవెలుగు-మురిచావా?'
'విడిపోవుట చెడిపోవుట
విడిపోవుట పడిపోవుట
కలసియుంట గెలుచుకొంట
తెలుగువిలువ తెలుసుకొనుట !
'గుండెను రెండుగ చీల్చే-మొండితనం పనికిరాదు
మనసుల నేకం చేసే-మంచితనం కావాలి.'

సమైక్యవాదులు తాలుక కదపటానికి జంకిన రోజుల్లో నరానరి ప్రజలను నంబోధించిన సాహసికుడు దాశరథి. 'ఒక్క తెలుగు-ఒక్క వెలుగు' అన్నది ఆయన నినాదం. 'తెలుగుజాతి ఒక్కటి; భరతజాతి ఒక్కటి, ప్రపంచమే ఒక్కటి, శశి బింబం ఒక్కటి, రవిబింబం ఒక్కటి, నవంబరు ఒక్కటి, మనమంతా ఒక్కటి;' అని చాటి చెప్పాడు దాశరథి. సూర్యచంద్రు లున్నంతవరకూ తెలుగుజాతి ఏక సూత్రంపై నిలవాలని ఆయన ఆకాంక్ష! ఐక్యతకోసం ప్రాణాలనైనా బలిధానం చేస్తా నన్నాడాయన. తెలుగువారు మరలా ఒక్కటై నిలచిననాడు తెలుగుతల్లి పాదాలను ఆనందాశ్రువులతో అభిషేకించాడు దాశరథి.

'తల్లి! నిను ముక్క లొనరింప దలచువారి
ఆశ లడియాసలై యున్న అవసరాన
నీపదమ్ములపై తలమోపి నేడు
చిందుచుంటి ఆనందాశ్రు బిందువులను.

మహాంధ్రోదయ గాథతో ఈ మహాకవిచరిత్ర ముడిపడి ఉంది. తిక్కన శ్రీనాథుల తరువాత తెలుగు దేశాన్ని ఇంతగా ప్రేమించిన కవి లేడు.

# 4

అంగారం, శృంగారం దాశరథి రచనలో కలిసి ఉంటాయని శ్రీ డి. రామ లింగంగా రన్నారు. శృంగార వీర రసాలు కలగలిసి తనలో పెల్లుబికేవని దాశరథి గారూ ఒప్పుకున్నారు. దాశరథిగారి ఈ ఉదంతం వినండి నెల్లికుదురు (మానుకోట తాలూకా) గ్రామంలో పోలీసుస్టేషనునుంచి తప్పించుకొని అడివిలోపడి పరుగెత్తి నప్పుడు గుఱ్ఱాలమీద నలభై మంది సైనికులు నన్ను వెదుకుతూ వెంటాడుతున్నప్పుడు, క్షణం ఆగకుండా అరణ్యంలో పరుగెత్తుతుంటే ఎక్కడో పది గుడిసెలు, చిన్నపల్లె. అక్కడ కాస్తసేపు ఆగి మంచినీళ్ళు అడిగితే అప్యాయంగా గళాసులో నీళ్ళు అందించిన రైతుపిల్ల ఒయ్యారం, ఆమె కళ్ళలోని అమాయకత నన్ను మైమర పించాయి. జైల్లో కిటికీలోంచి చూస్తే బయట మామిడికొమ్మ చిగిర్చి, పూలుపూస్తే లక్ష ఉగాదులు ఒక్కసారి హృదయంలో దూకినట్లుండేది! దాశరథి ఎంతటి సాహస వీరుడో అంతటి సహృదయ రసికుడు. 'శృంగారీ చేత్ కవిః కావ్యేజాతం రసమయం

జగత్' అంటాడు ఆనందవర్ధనుడు. శృంగారి అంటే కాముకుడని భావంకాదు. స్త్రైణమైన ప్రకృతి సౌందర్యాన్ని రసికచిత్తంతో ఆరాధించగలిగే చిత్తవృత్తిగలవాడని తాత్పర్యం. భోజుడు పరోక్షంగా దీనినే అహంకారమని అదే శృంగారస్థాయి అనీ తన శృంగార రస సమీకరణ సిద్ధాంతంలో ప్రతిపాదించాడు. గాఢమైన ప్రేమ ఉంటే సహృదయుడు. సౌందర్య రసా సాధనతో కూడిన ప్రేమముంటే సత్కవి; సత్కవిగా, వీరుడుగా వెలుగొందే కవి మహాకవి దాశరథి.

దాశరథిలో ధర్మవీరం స్థాయి. శృంగారం హేల. మాతృభూమిపై శత్రువు దాడిచేసినప్పుడు ఆయన సైనికుడౌతాడు. పెన్ జేబులో పెట్టి గన్ చేతపడతాడు. భారత దేశంమీద పాకిస్తాన్ దాడిచేసినపుడు దాశరథిలో దేశాభిమానం ఉద్వేత్తగా లేచింది.

'కత్తికంటే కలంగొప్ప దన్నమాట
కల్లకాకపోవచ్చును గాని
కలంబలం తెలియని కరకురక్కసికి
కలంనాల్క చిల్కపల్కులు వినలేని చెవిటికి-
నెత్తురు తాగి జీవించే
నిర్దయుడికీ
మర్దనం ఒక్కటే మహౌషధం!
అందుకే తాత్కాలికంగా
పెన్ను జేబులో పెట్టి- గన్ను చేత పట్టాను.
ఏం చేయను ?
ఎంత శాంతించినా తప్పలేదు
కొన్ని మాటలు వినటానికి వీణపలుకులు
అవి ఆచరణలో ఇనుపములుకులు,

దాశరథి దేశభక్తి శత్రువు మీద రౌద్రోద్రేకాన్ని ప్రకటింప చేసింది. సహనశీలిలో పుట్టే వీరంగాని, రౌద్రంగాని శక్తిమంతగా ఉంటుంది. దౌర్జన్యానికి తలవంచటం సహనం కాదు; శత్రువువల్ల కలిగిన పగను సహించటం సహనం కాదు; దౌర్జన్యంలోని దాష్ట్యాన్ని సౌజన్యంతో తొలగించటం సహనం. సామం పనిచేయకపోతే సాహసంతోనైనా ఆత్మగౌరవాన్ని కాపాడుకోవటం సహనం; సహనం సమర్థులకు పిరికిమందు కాదు; అవసరమైతే పగవారిగుండెల్లో సెగలు కమ్మించే మందుగుండు; రణపోతం

పరించినా దానికి ఫలం పగవాడికి గుణపాఠం, సహనం ప్రాణాలను బలికోరదు. పరులలో పరిణామాన్ని కోరుతుంది. మనిషిలోని పశువును చంపి పరమాత్మను ప్రబోధిస్తుంది; అధర్మాన్ని శిక్షించి ధర్మాన్ని రక్షిస్తుంది. దాశరథి వీరం మానవత్వాన్ని వీడని మహాగ్నిజ్వాల.

ప్రపంచంలో మానవత కెక్కడ విజయం లభించినా దాశరథి తన విజయంగా భావించి పరవశిస్తాడు. బంగ్లాదేశ్ విజయానికి పరమహర్షం వెలిబుచ్చాడు; దక్షిణ వియత్నాం వికాసానికి దరహాసం చిందించాడు; మిసిసిపీ విశ్వవిద్యాలయంలోని తొలి నీగ్రో పట్టభద్రుడు - జేమ్స్ మెరిడిత్‌కు నీలిరవ్వను కానుకగా పంపాడు. దాశరథికి నీగ్రో నీలమేఘశ్యాముడుగా కనిపిస్తాడు - పోతన్న కృష్ణుణ్ణి కీర్తించినట్లే దాశరథి అతణ్ణి వర్ణిస్తాడు -

'నల్లనివాడ, జ్ఞాన నయమ్ములవాడ! మనస్సులోపలన్
తెల్లనివాడ, హింసను వధించిన నల్లనివాడ! శాంతి పై
జల్లినవాడ, తెల్లని విషమ్మునకున్ విరుగైన వాడ! నా
ఉల్లములోని వాడ! పదవోయి విశాల విభాపథాలపై.'

నలిగిన నల్లవాడు! వెలిగే తెల్లవానిపై సాగించే స్వాతంత్ర్య సమరం దాశరథి కవిత్వానికి ధర్మతేజం!

పోతన భక్తికి శృంగారం ఎలా శక్తినిచ్చిందో దాశరథి వీరానికి శృంగారం అలా రక్తి నిస్తుంది. అంగారం శృంగారంలో మండుతున్నప్పుడు హిమజ్వాల ప్రజ్వలించి నట్లుంటుంది. శృంగార రసపోషణలో దాశరథి తరుణ హిమజ్వాల!

'నా చెవులలోన రుధిరవీణాకఠోర
ఘోర ఝుంకార మేల డాగుకొన జూచె
నో? నిశాహిమానీ తరుణీ నితంబ
లంబి వేణిక నగ్నిపుష్పంబు లేలనో!

అని దాశరథి ఆత్మావలోకం చేసుకున్నాడు అగ్నిధారలోనే. దాశరథి శృంగార ఖండికలు అగ్నిపుష్పాలు.

దాశరథికి మోదుగు పూలంటే బలేయిష్టం. వాటిన్నీ అగ్నిపుష్పాలుగా భావిస్తాడాయన. ఆయన చిత్తవృత్తికి ప్రతిబింబం అపలాశపుష్పంలో కనపడుతుంది ఆయా కావ్యాల్లో ఎక్కడ చూచినా-

"అగ్నిజ్వాలిక వోలిక
నగ్నముగా నాట్యమాడు నవవానంతో
ద్విగ్న పలాశప్రసవా
లగ్న జపాల క్తరక్తరమ కనుపించెన్."

దాశరథి శిశిరాన్ని సైతం శృంగారమయం చేసిన ధీమంతుడు.

'ఆకులు రాలిపోయె, దెస లన్నిట చీరెలు జారిపోయె, న
గ్నీకృతయై మహాప్రకృతి నేలకు మోమును వాల్చె: దుష్ట వా
తాకులమై శరీరము, హృదంతర మంతయు బీటలెత్తె; బా
లా! కటిపోకముళ్లు విడలాగెద శైశిరకాలధర్మమై.'

ఈయన ఋతుషట్కంలో అంతస్సూత్రం వసంతం. ప్రకృతిలోని ప్రణయరహస్యం ఆయన శృంగార రస పారవశ్యం!

'గుమగుమలాడి నా మనసుగొన్న నవాబ్దనఖీ ముఖానురా
గమున సుమించె చంపకము; కౌగిలిలో ప్రసవించె గోరటల్
సుమరమణీయమై సగె నశోకము తచ్చరణాహతిన్; ప్రహా
సమున సుమించె పొన్నలు; పసందగు నందన దివ్యవాటిలో.'

కవిసమయాలతో కవిప్రతిభ శృంగారావతారాన్ని తాల్చిందీ పద్యంలో. విశాలాంధ్రోదయ భానుబింబాన్ని దర్శించిన దాశరథి శృంగారరసోన్నిద్రుడై ఇలా వర్ణించాడు-

'తరుణీ సుందర దంతఘట్టన లసత్ తాంబూల రాగప్రభా
స్ఫురణీయాధర బింబమట్టు లదిగో సూర్యుండు, ప్రాచీధరా
ధరకూటమ్ము పయిన్ పదమ్ములిడి సౌందర్యమ్ము చేకూర్చె ను
ర్వరకున్; నిద్దురలెండు తెల్గుజనులారా! సుప్రభాతం బిదే!

వీరానికి శృంగారాన్ని విభావంగా నిలిపే శిల్పం దాశరథి కవితకు ఉగ్గుతోవచ్చిన విద్దె సూర్యోదయంతోపాటు చంద్రోదయం కూడా అంతే-

'వచ్చినవాడు చంద్రముడు; పాలసముద్రపు మూలనుండి గో
ర్వెచ్చని మీఁగడల్ మెసవి రేజవరాలి వరాలబుగ్గలన్
గిచ్చి, నవారుణాస్ర మొలికించుచు తూరుపులోన కాగడా
తెచ్చెనొ ఆరకాసి జిగిదేరిన వెన్నెలజ్వాల లెత్తగా-'

వీరావతారుడైన విప్లవుని ప్రవేశాన్ని సూచించే పద్యపు ఎత్తుగడ: కాని, వర్ణన చల్లని వెన్నెల తేని రాకడ: చల్లనివాడైనా తెచ్చింది వెన్నెలజ్వాల!

దాశరథి శృంగార రచనలకు భారతి పరవశించి ఇలా పలికినట్లున్నది:

"నరకానన్ బడి కుర్రింగుచున్న నను గంధార్వాప్సరః కామినీ
తరుణస్వాదు నవోపగూహన వథాంతర్వర్తిగా జేసి, దు
ర్భరదారిద్ర్య పిశాచినీ రుధిరధారా క్రూర దంష్ట్రాగ్రహా
తరిరంసా పరిఖిన్నతన్ మరపునొందం జేతువోయీ కవీ!"

# 5

ఆధునికాంధ్ర సాహిత్యోద్యానవనంలో ఉర్దూ పారసీక కవితా సౌరభాలను వెదజల్లే వింత కావ్యలతలను పుష్పింపచేసిన నవవసంతుడు దాశరథి. ఆయన కవితా పుష్పకం, గాలిబ్ గీతాలు తెలుగులో ఆయన పెంచినపూలతోట! అందులో అంద మైన గులాబీలూ ఉన్నవి; వాటి క్రింద వాడియైనముళ్లూ ఉన్నవి, ఉదధిలా పొంగే విరహమూ ఉంది; మనసుకు మైమరపించే మధువూ ఉన్నది; మగువ రేపే మంటలూ ఉన్నవి; మనసుపడే బాధా ఉన్నది! వేదనలో నుండి వెలువడ్డ కవిత గాలిబ్‌ది. ప్రేమ, సూఫీతత్వం అంతర్లయగా సాగినా జీవితసారాన్ని వడియగట్టిన రసాయనం ఆయన కవిత. దాశరథి గాలిబ్ గజళ్లను తెలుగుకు పరిచయం చేశాడు. కవితాపుష్పకంలో మీర్, జఫర్ (బహద్దర్‌షా) లాంటి మహాకవుల అనువాదా లున్నాయి. రవీంద్ర కవీంద్రుని గీతాలనూ కొన్ని అనువాదం చేశాడు దాశరథి. మొత్తానికి దాశరథి శృంగార కవిత తెలుగుశిల్పి నిర్మించిన మధుశాల!

అందులో అడుగిడిన ప్రతి రసికుడూ
'అందగత్తెల సాహచర్యమ్మునందు
కొద్దినాళులు గడిపిన గూడ చాలు
ఘోరనిస్సారసంసారకుండమందు
శతయుగమ్ములు జీవించజాలుకంటె!'

నని భావిస్తాడు. కాని కొంత కొంత లోతుకు దిగిం తరువాత మధువులోని, వధువు లోని మాధుర్య సౌందర్యాలతో పాటు బాధలోని, బ్రతుకు లోని పరమార్థాన్ని కూడ తెలుసు కొంటాడు. ఈ రెండు గీతాల్లో ఆ రెండు అంచులు కనపడతాయి.

"జాబిలి అందం, చెలిఅందం-సరితూచా లనుకున్నాను
షరాబువద్దకు వెళ్ళాను- తరాజులోపల వుంచాను-
జాబిలి ఉండిన పళ్ళెరము- చప్పున చేరెను ఆకసము
అందాలొలకే చెలిమోము- అవని నిలిచె నాకోసరము."

'జాబిలికంటె చెలి మోము అందం' అన్న తాత్పర్యాన్ని గాథగా, వక్రోక్తి సుందరంగా చెప్పి రక్తిని పొంగించిన దాశరథి కలంనుంచే

"నీవు పుట్టిననాటి రోదన-నీకు జ్ఞాపక మున్నదా?
నీదుబందుగులెల్ల నవ్వుట - నీకు జ్ఞాపక మున్నదా?
అట్టులే నీ అంత్యసమయ - మ్మందు అందరు ఏడ్వగా
నీవు నవ్వులలోన తేలుట - నేర్చుకొనరా సోదరా!"

అన్న తత్వగీతం జాలువారినప్పుడు రక్తివిరక్తుల వ్యత్యాసాన్ని చూడగలం. జీవితంలోని ఉభయ సంధ్యలను ఉద్విగ్నంగా చిత్రించే ఉర్దూ కవితా పరిమళం దాశరథి కవితాభారతి కిచ్చిన కాంతి పరివేషం!

శృంగారరసాన్ని భోగదృష్టితో పోషించే విధంవేరు; తత్వదృష్టితో ఉపాసించే పద్ధతి వేరు. భావుకుడైన దాశరథి ప్రణయమూర్తిపై వలపును పచరించే పద్యాలల్లినాడు. కాని ఆ మూర్తి భౌతికమూర్తి కాదు. భౌతికాకృతి నందిన ప్రణయ తత్వం. అందులో అన్వేషణ, ఆవేదన, ఆరాధన, అస్వాదనావస్థలు భాసించవచ్చును, విప్రలంభ, వియోగావస్థలు వెలుగొంద వచ్చును, సాత్విక తాత్వికావస్థలు రూపొందవచ్చును, వీనిలో ఉత్తరోత్తరాలు బలీయాలు. దాశరథి శృంగారకవిత ప్రణయమూర్తి సాత్విక రక్తిని సాక్షాత్కరింప చేస్తుంది. సాత్విక మనోవృత్తి నుండి తాత్విక రేఖను వ్యంగ్యంగా మెరిపించటం దాశరథి కళారహస్యం. దాశరథి కవితలో స్త్రీ ప్రతీక మాత్రమే. ఆయనకు శాంతి, క్రాంతి, ఉగాది, పయోధి, హేమంతం, లతాంతం, మోదుగు, గానుగు, ఇరులు, ఝురులు - అన్నీ స్త్రీలుగా సాక్షాత్కరిస్తాయి.

'పూలను ముద్దుపెట్టుకొని, ముండ్లను వద్దనబోకు నీవు, నీ
కేలటు తాకినంత పులకింపవె కంటకముల్ సుమమ్ములై
నీలనిశా శిరోజముల నిండు శశాంకుని చెండు చెక్కగా
జాలిన నీహుభాంబుజము చాలు అమావసయే పౌర్ణమాసిగాన్'

అవి శాంతిని సంబోధిస్తున్నప్పుడు - సుఖ దుఃఖాలలో కవి శాంతికోసం చేస్తున్న అన్వేషణ తత్వగంభీరంగా కనపడుతుంది. దాశరథి ప్రకృతిని మధురంగా దర్శిస్తాడు. మాధుర్యం వెనుక మంటలాంటి సత్యాన్ని స్వాయత్తం చేసుకుంటాడు. ప్రణయంలో ఆత్మ పరిశోధన దాశరథి శృంగార కవితా తత్వం -

"ఆమె నన్ను చూడగానె
అంతరించె ఆవేదన;
ఆగిపోయె పెనురోదన
సాగె హృదయ పరిశోధన!"

# 6

"మంచి కవిత్వం ఏభాషలో ఉంటే అదే నాభాష
మంచికవి ఎవరైతే అతడు నామిత్రుడు
నాకు ఉరుదూ, తెలుగూ రెండు కళ్ళు
ఈ రెండుకళ్ళతో అన్నిభాషలనీ చదవగలను
హృదయం ఒకటైతే లోకమంతా ఒకటి."

తెలంగాణాలో పుట్టిన దాశరథికి తెలుగూ ఉరుదూ రావటం అబ్బురం కాదు; ఆధునికయుగంలో నివసిస్తున్నందుకు ఆంగ్లం రాటవంలో ఆశ్చర్యంలేదు, సంస్కార వంతమైన కుటుంబంలో పుట్టి సంస్కృతభాషాపాండిత్యం గడించటం గొప్పతనం కాదు. 'మంచికవిత్వం ఏ భాషలో ఉంటే అదే నా భాష' అనే విశాలదృక్పథం ఏర్పడటం విశేషం. ఆధునిక మహాకవి కుండవలసిన మహనీయ గుణాల్లో ఇది మొదటిది.

దాశరథి హృదయవాది.అనుభూతియే అర్థవంతమైన భాష ఆయనకు.లోకంలో హృదయవాదులు రెండురకాలు.ఒకరు అనుభూతితో ఆర్ద్రులై కరిగిపోతారు. మరొకరు అనుభూతిని ఆత్మప్రత్యయంతో ఆవిష్కరిస్తారు. మొదటివారు సహృదయులౌతారు. రెండవవారు సత్కవులౌతారు. హృదయవాదులకు భిన్నులు రీతివాదులు. వీరికి అను భూతి కంటె ఆకృతివిలాసం హెచ్చు. వీరికంటె మరియొక్కరు అలంకారవాదులు. వారి కాకృతి విలాసం కంటె అలంకార భేషజం అధికం. అనుభూతి వాదులు శబ్దశక్తిని ఉపాసిస్తే, రీతివాదులు శబ్దసౌందర్యాన్ని సేవిస్తారు. అలంకారవాదులు శబ్ద చమత్కా-

దాన్ని సాధిస్తారు. చమత్కారం వల్ల హృదయం వికసిస్తుంది. రచనా సౌందర్యం వల్ల హృదయం రమిస్తుంది: అర్థప్రసాదం వల్ల హృదయం ద్రవిస్తుంది.

దాశరథికి హృదయ మెంత ఉందో అభిమానం అంత ఉంది. ఆయన పసివాడి వలె నవ్వగలడు; ప్రౌఢునివలె పలకగలడు. మనస్విగా అనుభవించి, ఓజస్విగా పలుకగలడు. ఈరెండు లక్షణాలు జంట కుదరటం కష్టం. దాశరథి రచనలో ఓజస్సు తేజస్సును వెలిగ్రక్కుతుంది; పలుకులోని వాడిదనం భావంలోని వేడిదనాన్ని పరవళ్ళు త్రొక్కిస్తుంది; గతిలో అదనెరిగి పదును, కదను పదంకలుపుతూ నడక సాగిస్తుంటవి. పద్యంగాని, గేయంకానీ, వచన గీతంకానీ, దాశరథిహృదయంలో ఉవ్వెత్తుగా లేచిన ఒక 'మూడ్'ను ముమ్మూర్తులా సాక్షాత్కరింప చేస్తుంది. 'మూడ్'ను 'భావావేశం' అంటున్నాను. భావగతికి అనుగుణంగా వృత్తగతి. గేయగతి, వచన చరణ విన్యాసం వింత సోయగాలుపోతాయి. పద్యంలో శైలినీ,గేయంలో గతినీ,వచన కవిత్వంలోని అంతర్లయనూ శాసించేది భావావేశమే. భావావేశంలో పదాడంబరాన్ని ప్రదర్శిస్తారు కొందరు. విశిష్టపదరచనా విన్యాసంతో కూడిన ప్రౌఢిని చూపిస్తారు కొందరు. అనుప్రాసక్రీడలతో శ్రవణానందాన్ని సాధిస్తారు కొందరు; అలవోకగా వచ్చే శబ్దార్థాలంకార శిల్పంతో రచనను అలంకరిస్తారు కొందరు. దాశరథి రచనలో భావావేశంవల్ల అలవోకగా సాగివచ్చే పదరచనాప్రౌఢి కనవస్తుంది ప్రౌఢి సమాసరచనలోనే ఉంటుందను కుంటారు. అది నిజం కాదేమో! భావాభివ్యక్తికీ, భావావేశానికి తగిన పదబంధాలను సంవిధానం చేయటంలోనే అది ప్రత్యక్షమౌతుంది. పదబంధం తెలుగు జాతీయాన్ని ఒలకపోయవచ్చు. సమాస సంగ్రథనాన్ని సాధింపవచ్చు; అంటే వాటిని భావావేశాభివ్యక్తికి బహిస్సాధనంగా ఉపయోగించుకొనే నేర్పే ప్రౌఢి అన్నమాట. మాటల్లో మరులుకొల్పే లక్షణం,అభివ్యక్తిలో ప్రౌఢిని ప్రదర్శించే ప్రాభవం దాశరథి కవితకు సహజాలంకారాలు. దాశరథి మనిషిగా జీవిస్తూ మనీషిగా, మహాకవిగా కావ్యాలను రచిస్తాడు. ఆయన 'బాల్యం' మ ని షి గా స్పందించే ఆయన మనస్సుకు వ్యాఖ్యానం.

"అస్మదంతరంగ వర్తి-బాలుడు
అతన్ని ఆనందరూపుణ్ణిగా మలచి
అఖండ బ్రహ్మాండంలో మానవుని
జీవితంలో కొన్నేళ్ళ పాటు
అమూల్య ఆనందాన్ని అందించే-అమృతశక్తి-బాల్యం!"

దాశరథి 'బాల్యం' అమృత హృదయాన్ని ఆవిష్కరించిన గేయం. దాశరథి అమృత హృదయం అందులో అద్దంలో ప్రతిబింబంలా ప్రతిబింబిస్తుంది.

దాశరథి మేధను మనసులో ఉపలాలిస్తాడు. మనసులేని మేధ మానవజాతిని మారణహోమం చేస్తుందని ఆయన మతం 'మస్తిష్కంలో లేబొరేటరీ' గేయం ఆయన మానవతా వాదానికీ, హృదయ వాదానికీ మచ్చుతునక.

"ఈ లెబొరేటరీలో కూచుని
లోకం నిండా విరివిగా శాంతిపండే రీతిని
కొత్త రకం విత్తనాల్ని
కనిపెట్టే వీలున్నది.
ఈ లేబొరేటరీలో కూచుని
కలంపాళీ కొసల్లోంచి
ఎంత బలం గల కవిత్వం సృష్టించవచ్చో!"

అని సూచిస్తాడు. విజ్ఞానం విశ్వశాంతికి విలువైన సాధనంగా భావిస్తాడు దాశరథి పలుకుల్లో పారుష్యంగానీ, సమాసాల కసరత్తులుగానీ, ప్రాసలకోసం అడియాసలుగానీ దాశరథి రచనల్లో-ముఖ్యంగా వచనకవిత్వంలో-కనపడదు. తెలుగుదనంలో కనబడే వెలుగుదనం కవితనిండా కనిపిస్తుంది.

ఆధునికుల్లో దాశరథి ఉభయకవి మిత్రుడు. పద్యం పాతబడ్డ ప్రక్రియగా భావించి, ఛందఃపరిష్వంగాలను వదలి, గేయంలో, వచన గీతంలో ప్రజాశక్తిని సమర సన్నాహం చేసే అభ్యుదయరచయితలకు పద్యంలో సమరశంఖాన్ని వినిపించి, గేయంలో వైతాళికగీతాన్ని అలపించి, వచనంలో విప్లవ సందేశాన్ని అందిస్తున్న దాశరథి అభ్యుదయ కవుల్లో అతిరథు డనిపించుకున్నాడు. ప్రక్రియ యేదైనా పలికే శక్తిలో ఉన్నది పటుత్వం అన్నది ఆయన కవిత సమకాలీన కవుల కిచ్చే సందేశం:పద్య రచనలో తరతరాలుగా వస్తున్న నిలకడతనాన్ని తొలగించి పాదరసంలా పరుగెత్తే గుణాన్ని కల్పించాడు దాశరథి; పద్యధారకు వింతపదును పెట్టాడు దాశరథి. శబ్దం పద్యంలో ఇదివరకు నినదించేది-దానికి నినాదం నేర్పాడు దాశరథి. గేయంలో గతి వేగంతో కదను తొ్రొక్కించే ప్రక్రియ ఒకవైపూ, ఆంగ్లశబ్దాల వింతశ్లేషలతో నవ్య ప్రయోగాలుచేసే చమత్కార వైఖరి మరియొకవైపూ, ఆగ్రహానికీ అధిక్షేపానికీ అనువైన ఆకృతిశిల్పాన్ని కల్పించే అధివాస్తవిక ధోరణి మరియొకవైపూ-కనపడుతుంటే

గేయానికి కదను తగ్గించి పదనుచేశాడు; ప్రయోగాలను ప్రయోగాలకోసం కాకుండా ప్రయోజనంకోసం చేశాడు. అధివాస్తవికతకు ఔచిత్యాన్ని అలవరచాడు. వచన కవితలో ఆకృతి శిల్పాన్ని ఆవేశానికీ, ఆలోచకూ సవ్యసాచిగా ప్రయోగించాడు. ఈ విధంగా ఆధునిక రచనాప్రక్రియల్లో రెండంచుల కత్తిగా కవితను వాడుకొన్న దాశరథి 'ఉభయకావ్యప్రౌఢి పాటించు శిల్పమునన్' పారగుడైనాడు.

దాశరథి మహాకావ్య రచనకు ఉపక్రమించ లేదు. 'మహాబోధి'నికథాకావ్యంగా చిత్రించి కావ్యరచనా సామర్థ్యం ఉందని చూపించాడు; ఆ కావ్యంలో త్రిశరణాల్లాగా ముచ్చటైన మూడు జాతక కథలున్నాయి. బుద్ధజయంతికి కానుకగా ఇచ్చిన పద్య కావ్యం కాని బుద్ధిపూర్వకంగా కావ్యనిర్మాణం చేయటానికి తలపెట్టిన కృతి కాదిది. వస్తువు నాశ్రయించి కావ్యం వ్రాసే ప్రవృత్తి దాశరథిలో తక్కువ. కవితను ఆత్మనాయకంగా వ్రాయడం ఆయన జీవితలక్షణం. వ్యక్తిగా తాను జీవించటానికి కవితా క్షేత్రాన్ని పాలించే స్వభావం ఆయనకు లేదు. తాను జీవిస్తున్న సమాజంకోసం, దాని బాధలనూ, దాని ధ్యేయాన్నీ తనదిగా భావించి ప్రబోధించే స్వభావం ఆయనకల వడింది. సమాజం అతివేగంగా ముందుకు సాగుతున్న రోజుల్లో స్థాయిగా సాంఘిక చిత్తవృత్తిని వ్యంజింపచేసే కావ్యరచనం సాధ్యంకాదేమో! అందువల్లనే ముక్తకకావ్య రచనం,ఖండకావ్య రచనం ఆయన కవితా వ్యవసాయంలో కమనీయ ఫలాలుగా మన కందుతున్నాయి. దాశరథి ముక్తక రచనం మకుటాన్ని ధరించింది. దాశరథి ఉద్యమ కవిత ఉప్పెనలా పొంగుతూ ఉంటే-పంటకాల్వలుగా కనపడేవి ఆయన శృంగార కవితలు, కుంటల్లో నిండిన నీరుగా కనపడేవి ఆయన సూక్తులూ, శతకాలూ, దాశరథి శతకం ఆయన లోకసూక్తి కబ్బిన సుధాకరం, లోకసత్యాలను నిర్మొగమాటంగానూ, వ్యంగ్య సుందరంగానూ, నర్మగర్భితంగానూ, చెప్పిన శతకంలో 'సెటైర్'కు జీవం పోశాడు.

అరలు లేని హృదయం. అరమరలు లేని స్నేహం, స్వార్థంలేని సౌజన్యం దాశరథి వ్యక్తికి తరుగులేని సంపద. కులవర్గాలు లేని సమాజం, మతవైషమ్యాల్లేని మానవత ఆయన సమాజానికిచ్చే సందేశం; విశ్వశాంతి ఆయన లక్ష్యం; కవిత్వం ఆయన జీవితం.

"నాకుల మెద్దియో యెరుగ నామత మెయ్యదియో యెఱుంగగా
లేక దశాబ్దముల్ గడచె; లేళ్ళది యేళ్ళది రాళ్ళ దేకులం
బా కులమే మదీయము, నరాళికి లేని విరాళి గుండెకున్
తాకగ వానిలో కలదు దాశరథీ! కరుణాపయోనిధీ!!

ఆధునిక సాహిత్యంలో విశ్వమానవ భావానికి దాశరథి కవిత ప్రతీక.

దాశరథి జాతీయకవి అనీ, ప్రజాకవి అనీ, ఉద్యమజీవి అనీ, అభ్యుదయకవి అనీ, చైతన్యసారథి అనీ సమవాదదీపస్తంభమనీ, భావుకుడని, ప్రజ్ఞలో త్రివిక్రముడనీ, సమకాలీన విమర్శకులు ప్రశంసించారు. కేంద్ర రాష్ట్రసాహిత్య అకాడమీలు ఆయన కవితలకు బహుమానాలు అందజేశాయి. ఆంధ్ర విశ్వకళాపరిషత్తు వారు 'కళాప్రపూర్ణ' బిరుదాన్ని ఇచ్చి గౌరవించారు. ఈ బిరుదు సత్కారాలన్నీ 'మహాకవి'గా దాశరథి గడించుకున్న ఖ్యాతికి మణిదీప తోరణాలే!

దాశరథి మహాకవిగా ఎంతో మహోన్నతుడో-మనిషిగా అంత మంచివాడు. ఆయన నిలువెల్లా పొంగిన పాలమనసు. స్నేహానికి ప్రాణాన్నిచ్చే స్నిగ్ధమూర్తి. సాటివారి కష్టాలను చూచి కరిగిపోయే కరుణామయమూర్తి. ఆయన తెలుగువారి హృదయాల్లోనూ, కవితా విహాయానంలోనూ, కలకాలం నిలిచే కళాప్రపూర్ణుడు.

దాశరథి కవితాసౌధం ఒక పుష్పకవిమానం. ఎన్ని సంప్రదాయాలైనా, ఎన్ని క్రొత్తదనాలైనా అందులో ఇమడగలవు; అది విప్లవాలను ఆహ్వానిస్తుంది, విశ్వశాంతిని ఉద్బోధిస్తుంది. అదుగో దాశరధి పిలుపు-

"ఈ కవితాసౌధం పుష్పక విమానం లాంటిది
ఇందులో ఎందరు ప్రయాణించినా ఇంకా చోటుంటుంది
అన్నిభాషల వారూ రండి - మా పుష్పకవిమానంలో
ఆనందలోకానికి సంచారం చేయడానికి వెళదాం,
ఆ విమానం ఇక్కడే బయలుదేరుతుంది
మంచి హృదయమే దానిలో ఎక్కడానికి
అర్హతనిచ్చే టిక్కెట్టు
డబ్బు అక్కరలేదు మాకు
ఏకత్వం అనే పెట్రోలుతో ఎగురుతుంది ఈవిమానం.
ఏకత్వం చెడిపోయిననాడు అది కూలుతుంది.
కనుక ఏకంగా వుందాం...ఏకంగా విందాం కవిత
ఏకంగా లోకాన్ని స్వర్గంచేసి విహరిద్దాం!" *

ఈ వ్యాసం యువభారతి వారు 1976లో ప్రచురించిన 'కవితాలహరి'లో ప్రకటితం.

అభ్యుదయ ప్రస్థానంలో తొలిమజిలీ

# నయాగరా

నేను 'నయాగరా' కవితా సంపుటాన్ని చదువుతున్నప్పుడు అలవోకగా నా మనస్సులో 'కనపడలేదా మరో ప్రపంచపు-కణకణ మండే త్రేతాగ్ని' అన్న శ్రీశ్రీ 'మహాప్రస్థాన గేయ చరణాలు' నినదించాయి. ఆ గేయంలో 'త్రేతాగ్ని' ప్రతీకకు అర్థం వేరు, ఈ స్మృతిలోని తాత్పర్యం వేరు. బెల్లంకొండ రామదాసు కుందుర్తి ఆంజనేయులు, ఏల్చూరి సుబ్రహ్మణ్యంగారలు ముగ్గురు కలిసి-ఒక్కొక్కరూ మూడేసి ఖండకావ్యాల చొప్పున-సంకలనంచేసి ప్రచురించిన 'నయాగరా' నాకు త్రేతాగ్నిలా అనిపించింది. ఈ సంపుటి అభ్యుదయ కవితా ప్రస్థానంలో ఒక మజిలీ; 'అభ్యుదయ కవితా యుగంలో అచ్చయిన తొలికావ్యం.'

"శ్రీశ్రీ 'మహాప్రస్థాన' సంపుటిలో సమస్త దేశములకు, ప్రపంచ మానవులకు సంబంధించిన సంఘటనలను, అనుభవములను మాత్రమే వర్ణించినాడు. ప్రత్యేకముగా కొన్ని దేశములలోని ఉద్యమముల నీతడు స్వీకరింపలేదు. శ్రీశ్రీ వదలిన యీ యంశమును తరువాతి అభ్యుదయ కవులు స్వీకరించిరి. 1944లో, వెలువడిన 'నయాగరా' కవితా సంపుటి ఈ ధోరణికి ప్రతినిధి వంటిది.... సీతారామరాజు మన్య విప్లవము, దండి సత్యాగ్రహమున పాల్గొన్నందున ప్రభుత్వముచేత యావజ్జీవ కారాగార శిక్ష విధింపబడిన విప్లవనాయకుడు ఠాకూర్ చంద్రసింగ్ వీర చరిత్ర మున్నగు సంఘటనలు వీరి కవితా వస్తువులైనవి. అంతేకాక పారీస్ వీధులు, చైనా లోయలు, బర్మా అడవులు, మాస్కో గేట్లు, సోల్జర్లు, టాంక్ డ్రైవర్లు, గెరిల్లాల గుంపులు, కొడవలి పదును, 'ఎర్రజెండా', నమ్మెట పెట్టు నిప్పుల గొంతుక మున్నగునవి వీరి గేయములలో స్థాన మేర్పరచుకొనినవి. శ్రీశ్రీ స్వీకరించిన **'జగన్నాథ రథ చక్రములు', 'అవతారము' లోని యముని మహిషపు లోహఘంటల వంటి సంకేతములు కాక, వాస్తవిక సంఘటనలు, నగ్నానుభూతులు స్వీకరింప బడినవి. అభ్యుదయ కవిత్వ వికాస దశలో గమనింపదగిన మజిలీ 'నయాగరా'**

కవితా సంపుటి. రమణారెడ్డి గారన్నట్లుగా "శ్రీశ్రీ కల్పించింది వాతావరణం మట్టుకే కాగా 'నయాగరా' కల్పించింది ఆ వాతావరణం లోని స్థూల రేఖలు!"[1]

'నయాగరా'లోని కుందుర్తి అంజనేయులుగారి కవితా ఖండాలను గురించిన సమీక్షే యీ వ్యాస తాత్పర్యం. కుందుర్తి తమ కవితా స్వభావాన్ని పేర్కొంటూ అన్నమాటలు ముందు మనవి చేస్తాను. "ఆ రోజుల్లో కుండపోతగా ఆవేశం కుమ్మరించటమే కవిత్వమనే వాదం మాది. దీనికితోడు ఎర్రజెండా నాయకత్వాన యీ సమాజ వ్యవస్థ మారాలని మా కవితలో వుండే సందేశం. కమ్యూనిష్టు మానిఫెస్టోను మించిన ఉత్తమ కవిత్వం ప్రపంచంలో లేదని మేం వాదిస్తూవుంటే సంప్రదాయ వాదులైన కవి మిత్రులు కొందరు నిర్ఘాంతపోయి వింటూండేవారు. వాళ్ళు రసమనీ, వ్యంగమనీ, ధ్వని అనీ పూర్వ అలంకారిక పారిభాషిక పదాలు వాడుతూ వుంటే వాటిని ఆధునిక కవిత్వానికి అన్వయించి చెప్పే పని నాదిగా ఉండేది....అభ్యుదయ కవిత్వం నయాగరా రోజులనుండి ఎన్నో మలుపులు తిరిగి మజిలీలు దాటి, ఎంతో దూరం ప్రయాణం చేసింది. ఇప్పటి విప్లవకవుల వీరావేశాన్నే చూస్తూంటే ఆది ఒక ఋజు రేఖలో కాకుండా ఒక వలయాకార పరిధిమీద తిరుగుతూ మళ్ళీ అదే స్థానానికి వచ్చిందా అనిపిస్తుంది."[2]

ఈ మాటల్ని బట్టి మనకు తెలిసే విషయాలు ప్రధానంగా మూడు, ఒకటి; 'నయాగరా'లోని అంజనేయులుగారి కవిత్వానికి. అభ్యుదయ కవిత్వానికి అది ధర్మమైన, ఆవేశం మొదటి లక్షణం. రెండు: సామ్యవాద సిద్ధాంతానికి సంబంధించిందే కవితా వస్తువు. మూడు; ప్రాచీనాలంకార్మికులు చెప్పిన పారిభాషిక పదాలతోను, ప్రక్రియా నిర్వచనాలతోనూ, ప్రమాణాలతోను వీరి కవిత్వాన్ని పరిశీలించటం కాకుండా కవిత్వానికుండే మౌలిక ధర్మాలను దృష్టిలో పెట్టుకొని గమనిస్తే ఈ కవిత్వంలోనూ కవితాంశ కనపడుతుంది. మరొకటి కవితా లక్షణం కాకపోయినా చారిత్రక సత్యం. ఈనాటి విప్లవ కవిత్వంలో కనపడే ఆవేశం అనాటి అభ్యుదయ కవితారంభ దశలో వెలువడిన ఆవేశం లాంటిదే. ఈ అంశాలు నయాగరా కవిత్వ స్వభావ, స్వరూప, ప్రమాణ, ప్రాశస్త్యాలను క్రమంగా నిరూపిస్తున్నాయని తెలుసుకోవడం సులభం.

1. ఆధునికాంధ్ర కవిత్వము-డా॥ సి. నారాయణరెడ్డి పుట 695
2. 'నయాగారా' - ద్వితీయ ముద్రణ పీఠిక - శ్రీ కుందుర్తి

కుందుర్తి కవిత్వానికి ప్రజోద్యమాల చైతన్యం ప్రాణం. ఆ చైతన్యానికి స్పందించివెలువడేదే ఆయన కవిత్వం. "సాధారణంగా నే నెన్నుకొనే కావ్య వస్తువులు చైతన్యవంతమైన ప్రజోద్యమాలకు సంబంధించినట్టివిగా వుంటాయి. ఏదో ఒకరూపంలో ఆనాటి పాలకవ్యవస్థమీద ప్రజలు చేసిన తిరుగుబాటు నా హృదయంలో చైతన్యస్ఫోరకములై నన్ను ఆపాదమస్తకం కదిలిస్తాయి. వాటి జయాపజయాలతో నిమిత్తం లేదు....రాజకీయ నాయకుల సిద్ధాంత భేదాలతో నాకు నిమిత్తం లేదు గాంధీజీ తన అహింసా దృష్టితో చూచి కాదన్న మాత్రాన అల్లూరి సీతారామరాజు మహావీరుడు కాకుండా పోడు. అదే విధంగా కమ్యూనిష్టు సిద్ధాంత వేత్తలు కాదన్నంత మాత్రాన గాంధీజీ తన వుద్యమాలద్వారా ప్రజలలో తెచ్చినచైతన్యానికి చరిత్రలో స్థానం లేకుండాపోదు. ఈ దృష్టితో చూచినపుడు ఎన్నిలోపాలువున్నా ప్రజలలో ఉవ్వెత్తుగా పొంగిన చైతన్య మహాసముద్రతరంగాలన్నీ నాకు కావలసినచుట్టాలే. ప్రేమకవిత్వాన్ని వదలిన తరువాత తెలుగుకవిత్వంలో విజృంభించింది ప్రధానముగా వీరరసము. దానికితోడు అత్యధిక సంఖ్యాకులైన సామాన్య ప్రజానీకపు విముక్తికి సంబంధించిన ఊహలోవున్నటువంటి కరుణరసం అంతర్వాహినిగా వుండనేవున్నది. ఆధునిక కాలంలో వచ్చిన కవిత్వమంతా ఈ రెండింటి సమ్మేళనమే"-[3] అన్నవాక్యాలు- కుందుర్తి కవితాసమీక్షకు పనికివచ్చే ప్రమాణ సూత్రాలు.

కుందుర్తి కమ్యూనిస్టు సిద్ధాంతాలకు కట్టుబడినా, వాటిని మించిన మానవతా వాదాన్ని మన్నించినవాడు. ప్రజా ఉద్యమాలు ఏ ప్రాంతానికి సంబంధించినా ఏ సిద్ధాంతాలను ఆశ్రయించి నడిచినా ఆయన ఆదరాభిమానాలను చూరగొన్నాయి. కుందుర్తి విప్లవం ఒక రాజకీయ సిద్ధాంతానికి కట్టుబడింది కాదు,అభ్యుదయ పథానికి అంకితమైనది. పీడిత ప్రజ చేసే ఉద్యమం ఆయన కవితకు ఊపిరి, కుందుర్తి వ్యక్తిత్వం అభ్యుదయ సాహిత్యంలో ప్రత్యేకత సాధించుకున్నది ఈ ప్రవృత్తి వికాసంతోనే. అందువల్లనే ఆయన మానవతా వాదాన్ని మన్నించిన మార్క్సిస్టు కవిగా మన్ననలు పొందుతున్నారు.

కుందుర్తి కవితా ప్రవృత్తిని తీర్చి దిద్దింది. ఆయన ప్రయోగశీలం. "ఆధునిక తెలుగు కవిత్వానికి సంబంధించి నేను ప్రతిపాదించి ప్రచారం చేసిన మరొక ముఖ్య విషయము కథా కావ్య సిద్ధాంతము. దీనికి ఆద్యుడైన శ్రీశ్రీ మొదలుకొని బాల

---

3. కుందుర్తి కృతులు-పీఠిక. శ్రీ కుందుర్తి వుటలు 3-4.

గంగాధర్ తిలక్ వంటి అనేక మంది ప్రముఖులు అంగీకరించటానికి ఇష్టపడక పోయినా ఆధునికుల రచనలను జాగ్రత్తగా పరిశీలిస్తే ఇది ఇప్పటికే చాలావరకు చాలా చోట్ల ప్రవేశించినట్లు స్పష్టంగా తెలుస్తుంది. నేననేది ప్రతి ఒక్క కవీ బృహత్కావ్యాలే రాయాలని కాదు. కొందరికి అంత శక్తి కూడా లేకపోవచ్చు, కాని 'పూర్ణమ్మ కథ', 'విదూషకుని ఆత్మహత్య', 'బాటసారి', 'భిక్షువర్షీయసి' మొదలగు వాటిలోవలె కథాంశమేదైనా వుంటేనే నాకు బాగుంటుంది. ఈమాత్రం కథాంశం కూడా లేని కవితలు కేవలం ప్రబోధ గేయాలు,వర్ణనాత్మక రచనలుగా సాహిత్యంలో వుండవచ్చు. కాని, రసపోషణ మొదలగు కావ్య లక్షణాలకు ఇవి అంతగా సరిపోవని నా అనుమానం."[4] అన్న కుందుర్తిగారి మాట లిక్కడ గమనింప దగినవి.

ప్రబోధం, వర్ణనం, కథనం-అనే మూడు పద్ధతుల్లో మూడవ పద్ధతిని గూడా అభ్యుదయ సాహిత్యంలో సాధించే ప్రయోగాన్ని కుందుర్తిగారు సమర్థించారు. మార్గ దర్శకాలైన రచనలు వెలయించారు. అయితే, కుందుర్తి కథనం పురాణ కథనం కాదు. ప్రబంధ కథనం కాదు, అది ఒక విధమైన కథా సమీక్షణం, కథను కథగా చెప్పటం ఆయనధ్యేయం కాదు, కథలోని వస్తువును కవితామయంగా వాఖ్యానిస్తూ కథా సూత్రాన్ని అంతస్స్రోతస్వినిగా ప్రవహింపజేయటం ఆయన రచనాస్వభావం.

"మతానికి నవాబు పెట్టిన ముద్దు పేరు
ఆనాటి రజాకారు
తెలుగుజాతి గుండెమీద
కుంపటిలా రజాకార్లు గ్రామాలను మండించారు
దండించారు; పాపం పండించారు,
తల్లి ఒడిలోకి తరలిపోనున్న తెలుగునేల చెక్కమీద
దండయాత్ర చేశారు
నవాబు దర్జాల రాజ్యం ఏక ఖండగా
స్వతంత్రంగా ఉండాలని వాదించారు."

ఇలా సాగిన 'తెలంగాణా' కావ్యరచనం కథాకథనమే ప్రధానంగా కలది అనుకోలేం. ఒక ఇతిహాసాన్ని సమీక్షించే సాహిత్య చరిత్రకారుని కవిత్వ సముల్లాస మనుకుంటాం.

4. కుందుర్తి కృతులు - పీఠిక-శ్రీ కుందుర్తి పుట 3.

కథ కవితా శైలితో మజ్జనోన్మజ్జనం చేయటం కుందుర్తి కావ్యశిల్పం. అందుకే 'తెలంగాణ' ఒక కొత్త రకం కథా కావ్యం.

కుందుర్తి కథా కావ్య రచనా ప్రవృత్తి ఆయన కవితకు సమీక్షా దృష్టిని ప్రసాదించింది. ఈ లక్షణం మొదటి కావ్యం అయిన 'నయాగరా'లో కనపడు తుంది. ఒక కవి భావి కవితా జీవితంలో పండించుకొన్న ప్రయోగ శిల్పాల బీజావస తొలి కవితల్లో కనపడటం సహజం. బీజమే ఒక మహా వృక్షానికి తొలిరూపం.

నయాగరాలో ఆంజనేయులుగారి మొదటి కావ్యఖండం 'మన్యంలో' ఇందులో వస్తువు అల్లూరి సీతారామరాజు విప్లవం. దాన్ని కథగా రాస్తే నవల కావచ్చు. పెంచిరాస్తే ప్రబంధం కావచ్చు. కుందుర్తి దాని కథను చెప్పటానికి వ్రాయలేదా కావ్యం; విప్లవ తత్వాన్ని చెప్పటానికి వ్రాశారు. "సమిష్టి సత్యాగ్రహం దేశాన్ని సకలం ముంచెత్తిన రోజులు" అంటూ పూర్వరంగాన్ని సూత్రబద్ధం చేశారు. "మన్యంలో, తిరుగుబాటు, ప్రభుత్వం విరగబాటు అణి చేసిన, గొడ్డలి పెట్టు' అని ప్రస్తావనను నిర్వహిస్తూ కథా తత్వాన్ని సూచ్యార్థ సూచనంగా అందించారు 'మదరాసు నుండి, మలబారునుండి, తోలుకవచ్చిన సైన్యంలో కమాండరిన్ చీఫులు, శివాలయం గోడమీద, చెక్కించిన, విగ్రహాలు:- ఇందులో కథా ఉంది; శిల్పమూ ఉంది; కమాం డరిన్ చీఫుల కథ చివరి మూడుముక్కల్లో అలంకార ధ్వని నాశ్రయించి అద్భుత శిల్పాన్ని ప్రదర్శించింది. ఇటువంటి సంగ్రహ సమీక్షలో కుందుర్తి కవితాశక్తి అణు శక్తిలా ప్రత్యక్షమౌతుంది. బంధించిన, బానిసత్వ, విచ్ఛేదక వీరమూర్తి, విప్లవ శరదాకాశం, వెలిగించిన విద్యుద్దీపం, రామరాజు హృదయంలో, రగిలిన స్వాతం త్ర్యేచ్ఛ,' అనేభాగంలో ఆవేశం ఉంది, వర్ణనం ఉంది. వీరుణ్ణి ఆశ్రయించి కథాస్మృతి ఉంది, 'మన్యవిప్లవం, మా చరిత్రలో, వీచిన జంఝూనిల వీచిక' అంటంలో సమీ క్షాత్మకమైన ప్రబోధం ఉంది. మొత్తానికి 'మన్యంలో' కవిత కుందుర్తి కవితలో ఉన్న కథాత్మక, వర్ణనాత్మక, ప్రబోధాత్మక చైతన్యానికి సూక్ష్మదర్శిని. ముప్పేటగా సాగిన కవితా గుణస్రవంతులకు సంగమతీర్థం.

'జయిస్తుంది' ఖండకావ్యం కుందుర్తి కవితావేశానికి ప్రతినిధి. వస్తు స్వభా వాన్ని బట్టి రచనా ప్రవృత్తిని, ప్రక్రియా ప్రస్తారాన్ని సారించటం కుందుర్తిగారి కున్న సహజగుణం. శ్రీశ్రీ 'మరోప్రపంచం' గేయచ్ఛాయల్లో నడిచిన ఈ కవిత విప్లవ సైన్య ప్రగతికి విజయ దుందుభి. శ్రీశ్రీ గేయంలో గతి నాశ్రయించి ఆవేశం

ఉరకలెత్తింది. 'జయిస్తుంది' కావ్యం వచన కవితా ఖండిక. అంతర్లయతో నిండిన భావోద్వేగం దీనికి ప్రాణం:

'గతకాల కథల్లో లేందీ
కన్పించే నేటిది కాందీ
మరో ప్రపంచపు
మహదాశయమే
మార్గదర్శిగా
నడిచే
సైన్యం
కదలిన
కనకరథంలా
వదలిన
బ్రహ్మాస్త్రంలా
ఫెళ ఫెళ ఫెళ ఫెళ
నడిచే
విప్లవ సైన్యం
జయిస్తుంది! జయిస్తుంది!'

ఈ ఖండికలో శ్రీశ్రీ రచనలో ఉన్న కదను లేదు; కాని కుందుర్తి రచనలో కనపడే పదనుఉంది. శ్రీశ్రీ నాదవంతమైన జలపాతాన్ని సృష్టించాడు ; కుందుర్తి రాళ్ల గుళ్ల మధ్య ఒంపులు తిరుగుతూ ఒడుపుగా పారే సెలయేటిని సృష్టించాడు. ఒకటి గేయ గతివల్ల సాధ్యమైంది; మరొకటి వచనగతివల్ల సాధ్యమైంది. ఒకటి ఆలోచనను ఆవేశంలో అంతర్భవింప చేస్తుంది. అక్కడ శబ్దంవెంట అర్థం పరుగెడుతుంది. ఇక్కడ అర్థంవెంట శబ్దం అనుసరిస్తుంది. అక్కడ శ్రవణానందంతో కవితానందం శ్రుతికలుపుతుంది; ఇక్కడ కవితానందం మననానందంగా మలుపు తిరుగుతుంది. ఒకటి ఆబాలగోపాలాన్ని వెంట తీసుకుపోతుంది; మరొకటి బుద్ధిజీవుల్ని పలకరిస్తుంది. అందువల్లనే కుందుర్తిగారన్నారు— వచనకవిత్వం మొదలగు ఈ రూపాలు కొద్దో

గాఢ్పో చదువూ సంస్కారం గల మధ్యతరగతి ప్రజలను మాత్రమే ప్రబోధితం చేయగలుగుతాయి—" అని.

'తరువాత' కావ్యఖండిక అంతర్లయతో ఆలోచనను రంగరించిచేసిన రచన. గతితార్కిక భౌతిక వాదానికి కవితారూపాన్ని కల్పించిన ప్రయోగం. శ్రీశ్రీ దేశ చరిత్రల ప్రభావం దీనిమీద బలంగా ఉంది. అందులోకంటె కొన్ని అంశాలను సుస్పష్టరేఖలతో వాచ్యంచేసే యత్నం ఇందులో కనపడుతుంది.

'అన్యాయం అక్రమమూ
సంఘంలో చదరంగం
పరస్పరం దొమ్మిదోపిడి
అరంభించని
ఆదియుగంలా
మంచిమీద బ్రతకమంది'
అందరికీ
అవకాశాలూ
సరిపోయే వస్తూత్పత్తి
పంపిణీలో సమానభాగం
కోరుకొను హక్కుందట."

ఈ ఖండికలో ప్రతిపాద్యాంశానికున్న ప్రాధాన్యం ప్రతిపాదన విధానానికి లేదు. వస్తువు నలంకరించి స్పష్టతకు దూరంకావటం ఇష్టంలేకపోవటమే కుందుర్తి నీ కృతి నిలా రచింపచేసింది.

కవిత్వపుశైలి సామాన్యప్రజల సంభాషణస్థాయికి రావాలనే లక్ష్యంతో కలం పట్టిన కవి శ్రీ కుందుర్తి. ఈ లక్ష్యం గేయంతో సాధించటం, బుర్రకథల వంటి ప్రక్రియలతో సాధించటం తేలికఅనికూడా కుందుర్తికి తెలుసు. అయినా వచన కవితకు ఆశక్తిని సాధించాలని కుందుర్తి సాహిత్య జీవితలక్ష్యం. కుందుర్తి కవితా శైలి తెలుగుదనంలోని బలాన్ని పుంజుకున్న పలుకుబడులతో సరళంగా సాగుతుంది. మనసులోనుండి దూసుకొనివచ్చే భావాలకు ఛందస్సుల వేషాలు వేయకుండా, రంగ లాస్యం చేయించకుండా, శ్రీరంగనీతులు చెప్పకుండా, చురుకుతనంతో చలాకీ

తనాన్నీ, సమీక్షాగౌరవంతో సౌజన్యశీలాన్నీ, సూటిదనంతో సౌకుమార్యాన్నీ, ఆవేశంతో ఆలోచననూ, అంతర్లయతో అంతర్నియమాన్నీ, కథతో బోధనూ, వక్రోక్తితో వ్యంగ్యాన్నీ, వాస్తవంతో వర్ణననూ, విప్లవంతో వివేకాన్నీ, మార్క్సిజంతో మానవత్వాన్నీ, సమ్మిళితంచేసి వచనకవితా ప్రపంచంలో ప్రముఖాచార్య పీఠాన్ని ఆక్రమించిన శ్రీ కుందుర్తి సాహిత్యయాత్రలో మొదటి మజిలీ 'నయాగరా'.

ఈ జలపాతంలో ప్రభవించిన విద్యుత్తే కుందుర్తికృతులనిండా వెలుగు వాకలుగా ప్రవహించింది.



* 'అడుగుజాడలు' (కుందుర్తి కృతులపై సమీక్షావ్యాస సంకలనం)లో ప్రచురితం. జనవరి 1976. సం: డా॥ పోరంకి దక్షిణమూర్తి; ప్రచురణ : శ్రీనివాస సాహితీ సమితి, హైదరాబాదు.

' మంటలూ - మానవుడూ '

# అంతర్వ్యక్తి - అభివ్యక్తి*

ఆధునికాంధ్ర సాహిత్యంలో నేడు వచనకవితకు ప్రత్యేకస్థానం ఏర్పడినది. అభ్యుదయ పథంలో పయనించే కవుల కలాలు వచనకవితలనే ఆవిష్కరిస్తున్నవి. పద్యం కన్నా, గేయం కన్నా వచన కవిత్వం వ్రాయటం అసిధారావ్రతంలాంటిది. అక్షరచ్ఛందంగానీ, మాత్రాచ్ఛందంగానీ కవి వాక్కుకు గతిని నిర్దేశిస్తుంది. గతానుగతికమైన ఆగతి అభ్యుదయశీలికి అవరోధంగా కనిపిస్తున్నది నేడు. అతడు కవితకు గతికంటె ప్రగతి కావాలని కోరుతున్నాడు. ప్రగతికి ప్రాణం స్వేచ్ఛ, సేచ్ఛ సూటిదనాన్ని కోరుతుంది.ఛాదనాన్ని చీదరించుకొంటుంది. కవితకు ఛాదనాన్ని తొలగించినా ఆహ్లాదం అంతర్ధానం కారాదు. ఆహ్లాదనాన్ని కలిగించే లక్షణం ఆ ఛాందనంలో లేదంటాడు ఆధునికుడు. ఛందంలో గతి బహిర్వాహిక అయితే ఋతం ఆంతరమైన చేతనం. ఋతంభరత్వాన్నే రిదం (Rhythm) అంటున్నాం. ఆ రిదం బహిర్వాహికయైన గతి నాశ్రయించవచ్చునుగాని అది నియతం కారాదంటాడు ఆధునికుడు. అయితే రిదంలో నియతి లేదా అంటే ఉంది. గుండె కొట్టుకోవడంలో ఎంత నియతి ఉందో రిదంలో అంతనియతి ఉంది. దాన్ని కాదంటే వాఙ్మయం నిర్జీవమౌతుంది. అది జీవ చైతన్యానికి చిహ్నం. ఆ చైతన్యం అంతర్వ్యక్తి. అది కవివాక్కులో కృతిగా బహిర్వ్యక్తిని దాలుస్తుంది. అంతర్వ్యక్తి అభివ్యక్త మవుతున్నప్పుడు అవగుంఠనం ఉండాలంటాడు ప్రాచీనుడు. అదే ఆహ్లాదనమంటాడు సంప్రదాయజ్ఞుడు. ఛందోవాహిక ద్వారా అభివ్యక్తమయ్యే కవివాక్కు మేలిముసుగు కప్పుకొని అంచ నడకలు నడిచే మహారాణిలా కనబడుతుంది మనకు. మహారాణుల మేజువాణులు బూజుపట్టిన రోజులివి. మట్టిలో పుట్టి మట్టిలో గిట్టే మగువ కావాలి నేటి మానవతకు. కష్టనిష్ఠురాలను, కన్నీటి జాలులను కత్తిరించకుండా, పన్నీటి సౌరభాలు వెదజల్లకుండా వ్యక్తీకరించాలంటాడు ఆధునికుడు. అనుభూతిని గురించి ప్రాచీనులకూ, అర్వాచీనులకూ భేదాభిప్రాయంలేదు. అనుభూతి ఆవిష్కరణలో ఛాదనం లేకుండానే ఆహ్లాదనాన్ని అందించాలని ఆధునికుల ఆరాటం. దానికోసం వెలసిన నూత్నప్రక్రియ వచనకవిత్వం!

---

* డా॥ సి. నారాయణరెడ్డిగారి 'మంటలూ-మానవుడూ' కావ్యసమీక్ష.

ప్రతి ప్రక్రియకూ బహిరాకృతీ ఉంటుంది, అభివ్యక్తి విధానమూ ఉంటుంది. కాలానుగుణంగా నిత్యనూతనత్వాన్ని అన్వేషించే ప్రయోక్తలు అభినవంగా ప్రక్రియను భావించి ప్రయోగిస్తారు. ప్రయోగం ఫలవంతం కావాలంటే వస్తువు, భాష, అభివ్యక్తి ప్రధాన సాధనాలు.

ఆధునికునికి ఆదర్శం మీదకంటె ప్రత్యక్ష నిదర్శనం మీద నిష్ఠ ఎక్కువ జగత్తును భౌతికంగా చూచి పారమార్థికంగా భావించలేడు. బ్రతుకులో కనపడే పరమ సత్యాలే అతని పరిశీలన క్షేత్రాలు. కళ్లు తెరిస్తే అతడికి కనపడేది మనిషి. మనిషిలో మానవత్వాన్ని దర్శించటం ఆధునికుని లక్ష్యం. మానవత్వానికి బదులు దానవత్వం కనపడితే దుయ్యబట్టడం అతని నైజం. పీడితుడూ, పీడించేవాడూ బ్రదుకులో పరమ సత్యాలు. ఆ సత్యాలకు హేతువులుకూడా భౌతిక సత్యాలే. ఆర్థిక అసమానతలు సమాజంలో సమభావానికి చీడ పురుగులై పుట్టలు పెడుతుంటే, అధికారవర్గాలు నిజాయితీని నల్లబజారులో వేలం వేస్తుంటే, స్వార్థానికి సమాజాన్ని కుదువ పెడుతుంటే ఆధునికుడు ఆగ్రహోదగ్రుడౌతున్నాడు. సమాజ వ్యవస్థలో వినపడవలసిన రిదం అతనికి వినబడటంలేదు. నలుమూలలా అపశ్రుతులు. ఆక్రందనలు. వీటినిచూస్తున్నాడు ఆధునికుడు. శ్రుతిలేని సమాజ జీవన గీతాన్ని పాడాలని గొంతు విప్పుతున్నాడు. బాధలో పాట పలకటంలేదు; వేడి నిట్టూర్పుల సవ్వడులతో వాడియైన మాటలు పుట్టు కొస్తున్నవి. ద్రష్టమైన సత్యానికి తొడుపులు వేయడానికి తీరికా లేదు, కోరికా లేదు. కవి తాను చూచిన అవకతవకల ఆకృతిని అక్షరబద్ధంచేసి ఆవిష్కరించాలి. దాన్ని ఒక నియతమైన రూపంలో నిమంత్రణం చేయలేడు. ఆడంబరమైన శైలిలో అర్భాటంచేయ లేడు. అందరికీ అందుబాటులో ఉండే అచ్చమైన హృదయభాషలో ఆరూపాన్ని అభి వ్యక్తంచేయాలి. అభివ్యక్తిలో కవికున్న కళాశక్తి ద్యోతకంకావాలి. అంతర్వ్యక్తి స్పంద నానికి ప్రతి స్పందనంగా ప్రత్యక్షరం ధ్వనితరంగ విన్యాసం చేయాలి. అంతర్వ్యక్తిలో ఉన్న రిదం భావతీవ్రతకు వింత వింతగా మూర్ఛనలు పోతుంది. ఆ మూర్ఛనలు కవి వాక్కులో ముమ్మార్లుతా మూర్తికట్టాలి. భావతీవ్రతనుబట్టి శబ్దం మోగుతుంది. పదం సాగుతుంది. పదంలో గతి కాదు ప్రధానం. పదాన్ని నడిపిస్తున్న అంతరమైన శ్రుతి. దీన్నే అంతర్లయ అంటున్నాం ఆధునికుని కవితావ్యక్తికి అంతర్లయతో కూడుకొన్న అనియతవచన కవితా రచనమే అనువుగా భాసిస్తుంది. పద్యం ఈ విధమైన అభివ్యక్తికి హృద్యంకాదని ఆధునికుల అభిమతం.

T. S. Eliot అంటాడు-"Some forms are more appropriate to some languages than to others, and all are more appropriate to some periods than to others. At one stage the stanza is a right and natural formalization of speech into a pattern. But the stanza and the more elaborate it is, the more rules to be observed in its proper execution, the more surely this happens, tends to become fixed to the idiom of the moment of its perfection. It quickly looses contact with the changing colloqual speech, being possesed by the mental outlook of a past generation. It becomes discredited when employed solely by the writers, who having no impulse to orm within them, have recourse to pouring their liquid sentiment nto a ready-made mould in which they vainly hope that it will set."

డా॥ సి. నారాయణరెడ్డిగారు భావకవిలాగా పద్యాలు వ్రాయగలిగీ, మధుర కవిలాగా గేయకృతు లల్లగలిగీ వచనకవిత కందుకనే ఉపక్రమించారు. ఆయన అభ్యుదయ పథంలో నడుస్తున్నారు, శృంగార భావ ప్రపంచాన్నికంటే నేడాయన అంగారజ్వాలా తోరణాన్ని దర్శిస్తున్నారు. మధ్యతరగతి మందహాసం వెనుక మానవత మనసులో రగుల్కొన్న మంటల్ని దర్శిస్తున్నారు. మంటలు మనోవ్యధకు జంటలు. వ్యధాక్షుభితమైన వస్తుభాగనం అంతర్వేదనా జ్వలితమై ప్రతిభాశిఖలను పకాశింపజేసింది ఈ కావ్యంలోని ప్రతికావ్య ఖండిక.

వచసకవిలో కవి అనుభూతి కందిన వస్తుధర్మాన్ని వ్యక్తీకరించే విధానానికి ప్రాధాన్యం హెచ్చు. అనుభూతిని రూపు కట్టించటంలో ఆంతరమైన అవస్థలకు అభివ్యక్తిని కల్పించటానికి అక్షర బంధాలను సాధనాలుగా వాడుకుంటాడు కవి. శబ్దం అతని చేతిలో వజ్రాయుధంలా నూరంచుల వాడిదనాన్ని ప్రదర్శిస్తుంది. అంతర్లీనంగా ప్రవహించే లయ శబ్దసంవిధానంమీదా, చరణ విక్రాంతిమీదా, భావ విశ్రాంతిపైనా రాజ్యంచేస్తూ కవితా ఖండిక కళా స్వరూపాన్ని కుశలంగా తీర్చిదిద్దు తుంది. ఆ తీర్పులో కూర్పునుబట్టి ఏర్పడే మార్పులు అనంత విధాలు. అభివ్యక్తికి అనువైన ఆకృతి శిల్పాన్ని ఆవిష్కరించటంలో కవి కృతకృత్యుడు కావటమే వచన కవితా శిల్పం. అందుకే - ఆధునిక కావ్యమర్మజ్ఞులు-"We admire in a perfect work not the fact that the matter and form are united in it but the admirable form that has been united with a matter" అని అంటున్నారు. నారాయణరెడ్డిగారి వచనకవితా ఖండాలు ఈ శిల్ప రహస్యానికి అనల్ప నిదర్శనాలు.

ఆకృతి శిల్పాన్ని (Pattern) అన్వయ సుందరంగా ఆవిష్కరించటంలో నారాయణరెడ్డిగారు సిద్ధహస్తులు. ఉపక్రమ విస్తారోపసంహారాలను వస్తు స్వభావ విశేషాన్నిబట్టి విశిష్టంగా వైవిధ్య శోభితంగా సంవిధానం చేయటం ఈ సంపుటిలో స్పష్టంగా కనపడుతుంది. ఉదాహరణకు—

1) ఆఖ్యానంతో మొదలు పెట్టి వ్యాఖ్యానంతో ముగించటం : — ఈ పద్ధతి నారాయణరెడ్డి గారికి చాలా యిష్టంలా కనపడుతుంది. మంటలూ,మానవుడూ; అనగా అనగా ఒక రాజుగారూ, చీకటి చదువు, మూడు శిఖరాలూ మూడు తలకాయలూ, సరికొత్త సత్యం, గావుకేక, ఆనందగాత్రి, ఆగామియుగనైమిశారణ్యం- ఈ కోవకు చెందినవి.

2) ఉపాలంభంతో మొదలు పెట్టి ఉపదేశంతో ముగించటం— ఉ॥. పరమ హంసలారా, ఇంకిపోయిన బావీ, చిరునవ్వు, అరిచే నక్కను అరవనీ మొ॥

3) పతాకతో ప్రారంభించి పొడుపు కథగా పొడుగించి ఫలితాంశం ప్రకటించటం — లక్ష రూపాయల బహుమతి.

4) భేదంలో సామ్యాన్ని అన్వేషించటం — ఇద్దరూ ఒక్కటే.

5) ప్రబోధంతో మొదలు బెట్టి ప్రయోజనంతో ముగించటం — కొత్త ముఖం తొడుక్కో, విప్లవాక్షి రెప్పల్లో-

6) శీర్షికతో మొదలు పెట్టి తుదిదాకా సెటైర్‌తో నడపటం — జోడెద్దుల కుమ్ములాట.

7) ప్రశ్నతో మొదలుపెట్టి పరిశీలనతో ముగించటం—చైతన్య ప్రగతి, ఉత్తరాలు, నువ్వు నువ్వేనా, లాభంలేదు లలనా.

8) కాంట్రాస్టును కవితలో ఉల్లేఖించటం — నీకూ నాకూ ఏం పోలిక; నేనూ నా తమ్ముడూ.

9) సన్నివేశం చెప్పి స్వగతంతో ముగించటం — ఆకాశం ప్రసవించింది.

10) సన్నివేశం చెప్పి సాంగంగా వివరించటం—అగ్నిపర్వతం అంచుమీద.

1. World Literary Terms - Ed. by Joseph T.Shipley - Page 170

11) సూత్రంతో మొదలు పెట్టి సూక్తంతో ముగించటం— పొద్దు పొడుపు, ఎదురు తిరిగిన ఉదయం.

12) భిన్నావస్థలను సూత్రగ్రథనం చేయటం—అయ్యో మనిషి.

13) సత్యంతో మొదలు పెట్టి తత్వంతో ముగించటం—1970.

14) సూక్తి ముక్తావళి— మనసు విప్పితే.

ముప్పయి కావ్య ఖండికలలో దాదాపు పదిహేను భేదాలు కనపడుతున్న వంటే ఆకృతిశిల్పంలో రెడ్డిగారు సాధించిన వైవిధ్యం తెలిసివస్తుంది. సృజనాత్మకత సుష్ఠుగా ఉన్న సుకవికికాని ఇంతటి వైవిధ్యం అలవడదు.

ఆకృతి శిల్పాన్ని తీర్చిదిద్దే అభివ్యక్తి అంతర్లయ మీద ఆధారపడి ఉన్నదని చెప్పుకున్నాం. నారాయణరెడ్డిగారి 'మంటలూ-మానవుడూ'లో ఉద్వేగ జనకమైన గమకం కంటె ఉత్తేజకరమైన ఉక్తి నైపుణ్యం హెచ్చు. హ్రస్వచరణాలు ద్రుతగతిని తెలుపుతాయనీ, దీర్ఘ చరణాలు మందగతిని భాసింప చేస్తాయనీ, నాతి దీర్ఘాలు మధ్యమగతిని వ్యక్తీకరింపజేస్తాయనీ స్థూలంగా వివేచించుకుంటే నారాయణ రెడ్డిగారి కృతిలో మధ్యమగతి సర్వసాధారణంగా కనపడుతుంది. అయితే-హ్రస్వ చరణాలు ఉద్వేగ వృత్తిని వ్యంజింపజేస్తాయని అనుకున్నా అవసరం వచ్చినపుడు వాటిగతిని మందీకరించే మహాశక్తి మహాకవి కుంటుంది. నారాయణరెడ్డిగారు ఈ గతిని ఉభయతః నడిపించటంలో సవ్యసాచి.

"పట్ట పగలు
నిట్ట నిలువునా
ప్రజ్వలించే మంటలు
ఉక్కు కట్టడాల నుంచి
సిమెంటు శిఖరాల నుంచి
ఖిల్లాల నుంచి
విల్లాల నుంచి
పగలబడి నవ్వుతున్న
ఫణసహస్రం విప్పుతున్న
పచ్చి మంటలు
పచ్చని మంటలు"

అన్న కావ్యారంభ పాదాల్లో మంటలు వ్యాపిస్తున్న భయానక దృశ్యం ఉద్వేగ జనకంగా చరణ ప్రగతిలోనే చిత్రింపబడింది. ఇటువంటిది మరలా కనిపించేది అనగా అనగా ఒక రాజుగారు'లో.

"కొమ్మలు కొడ్డళ్ళుగా
రెమ్మలు కొడవళ్ళుగా
ఆకులు బాకులుగా
పూలు ఖడ్గాలుగా
నరకబడ్డ చెట్టే ఒక
నవ విప్లవ విరాట్టుగా
విజృంభించింది
విక్రమించింది
అసుర శక్తిని
ఆక్రమించింది".

ఇది భయానకం కాదు అద్భుతం. 'గాగాగాగా' అనే అంత్యాక్షర సంయోజనం వల్ల నోరు తెరిపించే అద్భుత భావాన్ని వేగంగా సృష్టించగలిగారు రెడ్డిగారు. 'నవ విప్లవ విరాట్టుగా' అన్న పాదంలో పతాకస్థాయి ఉంది. అంతకంటే మించి, ఆ తరువాత ఆ విధమైన అక్షర సంయోజనం చేయరాదు. చేస్తే శిల్ప భంగం జరుగుతుంది. ఆ రహస్యం రెడ్డిగారికి తెలుసు. అందువల్లే ఆ తరువాతి చరణ పురోగతిలో బిందు పూర్వక పరుష సరళాక్షర పునరావృత్తిలో ఉద్ధృతి మందీకరింపబడుతుంది. భావం ముగిసేనరికి పరుగూ తగ్గుతుంది.

చిన్న పాదాలలో కూడా తిన్నగా చెప్పిన భావాలున్నవి. ఉ॥ "చీకటి చదువు"లో—

"అది నేర్చిన ఆదిపాఠం
అవివేకం
అంతిమ పాఠం
అరాజకం
దాని వ్యాకరణం
అజ్ఞానీకరణం
దాని ఛందస్సు
అంధ ఛందస్సు."

ఇందులో ఉద్వేగం కాదు ఊనిక ప్రధానం. పదాద్యకారపునరావృత్తి పదాంత పూర్ణానుస్వారం చీకటి చదువులో 'సారం నాస్తి' అని ధ్వనింపజేస్తున్నవి. ఈ సంపుటిలో నారాయణరెడ్డిగారి కవిత కలహంస నడకలా సాగిందే కాని కంఖాణంలా కదను త్రొక్కలేదు. అది ఒక విధంగా కవి మనఃప్రవృత్తికి ప్రతిబింబమేమో అని అనిపిస్తుంది.

ఆధునికుల్లో వచనకవితను అర్థవ్యంజకమైన శబ్దాలంకారాలతో అలంకరింపగలిగిన కొద్దిమంది కవుల్లో అగ్రశ్రేణికి చెందినవారు నారాయణరెడ్డిగారు. అలవోకగా ప్రతిపాదాద్యక్షరం యతిమైత్రి కలుపుతుంది. లేకపోతే ప్రాస క్రీడ చేస్తుంది. అంత్యప్రాస అందుకోకుండా వీరి కవితాకన్య అడుగుముందుకు సాగదు. 'ఆకాశం ప్రసవించింది'లో మొదటి చరణమినహా అన్నిటికీ అంత్యాక్షరమైత్రి ఉంది. 'పొద్దుపొడుపు'లో కూడా ఒక పాదం ఎలాగో ఈ దారి తప్పింది. ఇల్లా ఎన్నితే ఎన్నో ఉదాహరణాలు!

ఆధునిక కవితలో అభివ్యక్తికి అక్షరాలకంటె ప్రతీకలు ప్రధానంగా ఉపయోగపడుతున్నవి."A symbal is the verbal parallel to a pattern of experience" అని Keneth Burke అంటాడు. కవి పొందుతున్న అనుభూతిని పఠితకందించే వాఙ్మయ ప్రతిక సింబల్. ఈ ప్రతీక కావ్యంలో - వస్తు సమన్వయానికి తోడ్పడవచ్చు, కావ్యాస్వాదన సౌలభ్యానికి తోడ్పడవచ్చు, వాస్తవం నుండి కవి తప్పుకోటానికి మార్గం కావచ్చు; సుప్తమైన స్మృతిని జాగృతం చేయటానికి హేతువు కావచ్చు; అలంకారంగా శోభించవచ్చు. నారాయణరెడ్డిగారి కవితలో సింబల్ - వస్తు సమన్వయానికీ, కావ్యాస్వాదానికీ, అలంకారశోభకూ విశేషంగా వాడబడింది.

ఇందులో మంటలు - ఒక ప్రతీక. ఈ ప్రతీకకు రంగులుమార్చి రకరకాలుగా ప్రదర్శిస్తారు రెడ్డిగారు.

1) పట్టపగలు - నిట్టనిలువునా - ప్రజ్వలించే మంటలు.

2) పగలబడి నవ్వుతున్న - ఫణసహస్రం విప్పుతున్న - పచ్చి మంటలు, పచ్చని మంటలు.

3) వెర్రిమంటలు - ఎర్రని మంటలు - ఎంతకూ చల్లారటంలేదు - ఎవరికీ అంతుపట్టటం లేదు.

4) "మంటలార్పటానికి ఒకేఒక్క మందు
విద్యుత్ప్రసారము ఏకాయెకి బందు."

5) "మంటలు కుప్పగూలినై - గుప్పున చల్లారినై
మంటలు చల్లారినైగాని - మనిషి చల్లారలేదు."

6) "నీకు తెలియదు ఆ నెత్తుటి మంటల్లో
నిద్రించిన కన్నీటి చలవ."

7) "శ్రమజీవి చెమట బిందువులో
ఆణిముత్యమూ ఉంది, అగ్ని గోళమూ ఉంది."

8) "మానవుడు అనాదిగా - మంటల్లో బతుకుతున్నాడు
అగ్నిపర్వతం అంచుమీద ఆనందం వెతుకుతున్నాడు."

9) "మంటల గంటలను ప్రయోగిస్తూ-మహోద్యమద్వారాలు తెరుస్తున్నాడు."

10) "తెల్లారేజామున మూడుగంటలకు
నళ్ళిన కీళ్ళమాటున
చల్లారని చిమ్మచీకటి మంటలకు
సిరివరులకు
పురహరులకు
కలిగిన గర్భరోదన కను
విరిగిన వీణావాదన విను."

11) "చిచ్చుబుడ్డీ పేలుతుంది - చిచ్చరకన్నూ పేలుతుంది
ఎండుగడ్డీ మండుతుంది - బడబాగ్నీ మండుతుంది
రెంటిలోనూ మంటలున్నాయ్ - రెంటికీ ఎన్నెన్నో అంతరాలున్నాయ్
జాతరచూపేదొకటి - చైతన్యం రేపేదొకటి
క్షణమాత్రం ఒకటి - అనంతకాలసందీప్తం ఒకటి."

నారాయణరెడ్డిగారు మంటల్ని రెండు భావాలకు ప్రతీకలుగా గ్రహిస్తున్నట్లు పై ఉదాహరణలవల్ల స్పష్టమవుతున్నది. చివరిదాంట్లో రెండు స్వభావాల మంటలు చెప్పబడ్డాయి. అందులో మొదటివైన జాతరచూపే మంటలు మొదటి కావ్యఖండికలో పతిబింబించాయి. 'మంటలూ-మానవుడూ' కావ్యఖండికలో మంటలు చివరికి చల్లారి

పోతాయి. అందువల్లనే మొదట అవి గప్పుమని ప్రజ్వలించాయి. అంత మండినా అవి పచ్చి మంటలు, పచ్చని మంటలు, వెర్రి మంటలు, ఎర్రని మంటలు. ఆ మంటలను చల్లార్పగలిగేది ఫైరింజను వెదజల్లే జలప్రవాహం కాదు; బందైన విద్యుత్ప్రసారం. తాటాకు మంటల్లా గప్పుమని గుప్పున ఆరిపోయే మంటలు మొదటి ఖండికలో ఉన్నా ఆ తరువాతి ఖండికల్లో కనపడే మంటలు చైతన్యం రేపే మంటలు. అవి అనంతకాల సందీప్తాలు. 10వ ఉదాహరణంలోని 'చిమ్మచీకటిమంటలు, ప్రౌఢమైన ప్రతీక. మొదటి కావ్య ఖండికలో మంటల ప్రతీక అలంకార శోభను వెలారిస్తే, చివరి కావ్య ఖండికలోని మంటల ప్రతీక కావ్యాస్వాదనకు తోడ్పడుతున్నది. 'అగ్నిపర్వతం అంచుమీద, ఖండికలో మంటల ప్రతీక కావ్యాస్వాదనకు తోడ్పడుతున్నది. ప్రతీకను వాడటంలో సంశ్లిష్టత ప్రదర్శించినా స్పష్టతను కోల్పోపని ప్రతిభ శ్రీ రెడ్డిగారిది. ఈ సంపుటిలో ప్రతీకాత్మకతా ప్రయోగము లేని కావ్యఖండిక లేదు వాటినన్నిండినీ వివరించడానికి ఇప్పుడు సమయమూ లేదు.

అంతర్వ్యక్తి అభివ్యక్తం కావడానికి ఇంకా ఎన్నో సాధనాలున్నాయి. వాటిని మిత్రులు తమతమ వ్యాసాల్లో పేర్కొన్నారు. ఇక నాకు మిగిలిందీ, తెలిసిందీ కూడా తక్కువే.

'మంటలూ - మానవుడూ, కావ్యంలో డా॥ నారాయణరెడ్డిగారు ప్రజా చైతన్యాన్ని ప్రబోధిస్తున్నారు. చైతన్యంకోసం జ్వలిస్తున్న మానవతను మనకు చూపిస్తు న్నారు. విశ్వవ్యాప్తంగా వ్యాపించిఉన్న ఈ మంటలు మానవత కొక మనుగడ సంపాదించి పెట్టాలని ఆకాంక్షిస్తున్నారు. మంటల్ని వస్తువుగా వర్ణించినా రెడ్డిగారు తాను మంటవలె మండలేదు. ఆయన మానవుడు. మానవుడెన్నడూ చల్లారబోడని ఆయన విశ్వాసం, చల్లారని మానవునిలో చిరంజీవిగా విలిచేది చైతన్యం. అది విలయాగ్నిలా ప్రజ్వలింపదు కాని, విద్యుత్తులా ప్రకాశిస్తుంది. రెడ్డిగారు కోరేది వెలుగు గాని - విప్లవం కాదు. ఆయన అంతర్వ్యక్తి వేదనపడుతుంది, శోధన చేస్తుంది కాని వీరావేశాలను పెంచుకోదు. అందుకే ఆయన రచనల్లో సామ్యవాదంకూడా సౌమ్యంగా వినపడుతుంది. సౌమ్యంగా వినపడ్డా శక్తిని కోల్పోదు, రక్తిని పోగొట్టుకోదు. ఆయనే చెప్పారు-

"పిడుగుల్లో సరిగమలేరుకున్న
దుడుకు మనసు నాది".

---

'చైతన్యశిఖరం'- ('మంటలూ మానవుడూ' కావ్యసమీక్ష)లో
ప్రచురితం- మార్చి 1975; ప్రచురణ:- నవోదయం, హైదరాబాదు.

# "సువర్ణ తిలకం"*

వ్యక్తి విశ్వరూపాన్ని దర్శించటం చెప్పేది మాధవగీత ! విశ్వాన్ని వ్యక్తిలో నిండించటం నేర్పేది మానవగీత ! డా॥సి. నారాయణరెడ్డిగారు మానవగీతను కావ్య గీతిగా ఆలపిస్తున్న అభినవాచార్యులు !

కవి ప్రకృతివైపు చూస్తే ప్రణయగీతి పాడుతాడు; భావంవైపు పరుగెత్తితే ప్రగతిగీతి వినిపిస్తాడు; వస్తువు నెన్నుకుంటే వైదగ్ధ్యాన్ని ప్రకటిస్తాడు; వర్ణన నెన్నుకుంటే వైవిధ్యాన్ని ప్రదర్శిస్తాడు; శిల్పాన్ని ఆరాధిస్తే చిత్రాలను రూపిస్తాడు; చమత్కారాన్ని చిలికిస్తే శబ్దబంధాలను అలంకరిస్తాడు; వాస్తవాన్ని దర్శిస్తే వచన రచన సాగిస్తాడు; సంఘర్షణను సమీక్షిస్తే సమరగీతి నినదిస్తాడు; పెరుగుదల ఆగిపోతే తిరుగుపాటు చేస్తాడు; వెలుగుబాట కనపడకపోతే విప్లవశంఖం పూరిస్తాడు కవిగా నారాయణరెడ్డిగారిలో ఈ కాంతి కిరణాలన్నీ హరివిల్లులా విరిసి, వారిలో ఆధునికతను అందగింప చేస్తున్నాయి.

కాలం వెంట నడవటం, కలాన్ని కళామయుంగా నడపటం, సంప్రదాయం లోని స్తబ్ధతను నిరసించటం, కొత్తదనంలోని ఉత్తమ గుణాన్ని కవితా హృదయానికి హత్తుకోవటం, ప్రయోగాన్ని ప్రయోజనం తెలిసి ప్రయోగించటం. ఉక్తి శక్తితో వస్తుశక్తిని ఉన్మీలింప చేయటం, మట్టిని సైతం మాణిక్యం చేయటం నారాయణరెడ్డిగారి కవితకు ఉగ్గుతో వచ్చిన విద్యలు. వారికి నాదహృదయం తెలుసు, శబ్దసంయోజనం తెలుసు, అర్థ శక్తి తెలుసు. పద్యం వ్రాసినా, గేయం రచించినా, వచనగీతం చిత్రించినా ప్రకృతికి తగిన ఆకృతికీ, నిర్మితికి తగిన నిర్వహణాన్నీ, అభివ్యక్తికి తగిన అలంకృతినీ, శీలానికి తగిన శైలినీ కూర్చటంలో వారిది అందె వేసిన చేయి.

---

*డా॥సి. నారాయణరెడ్డిగారి 'విశ్వంభర' కావ్య సమీక్ష.

ప్రతిభావంతులైన నారాయణరెడ్డిగారు ప్రగతినీ, పరిణామాన్నీ కోరుతారు. ఎప్పుడూ ఎడలెరిపిలేకుండా ఎదుగుతున్న వ్యక్తిత్వం వారిది. వెన్నెలవాడ నుండి విశ్వంభర దాకా ఇప్పటికి సాగింది వారి ప్రస్థానం. పద్యంలో పరవళ్ళు త్రొక్కిన వారు గేయంలో సాగరసంగీతం వినిపించారు. పరిణతికి ప్రక్రియను పాదపీఠికగా నిలపటం నారాయణరెడ్డిగారి ప్రత్యేకత.

డా॥ సి. నారాయణరెడ్డిగారి కవితా ప్రస్థానంలో 'భూమిక' కావ్య రచనం మొదలుకొని ఒక పెద్దమలుపు కనపడుతుంది. మానవవికాసాన్ని ఐతిహాసిక దృక్పథంతో కవితామయంగా చిత్రించాలన్న ప్రయత్నం ఈ అభినవ దృక్పథం. 'భూమిక' ఈ దృక్పథంతో వెలువడిన ప్రథమ ప్రయత్నం. 'విశ్వంభర' పరిణత ప్రయోగం. సాహిత్య ప్రక్రియల్లో కావ్యమార్గం జీవిత రామణీయకాన్ని చిత్రించేది. ఇతిహాసమార్గం జీవిత పరమార్థాన్ని వివేచించేది. పురాణమార్గం సృష్టిరహస్యాలను ప్రతీకాత్మకంగా ప్రపంచించేది. మనవతావాదాన్ని ఆదర్శంగా పెట్టుకొని రచనలు చేస్తున్న సమకాలీనాంధ్ర కవుల్లో నారాయణరెడ్డిగారు విశ్వంభరలో ప్రపంచించిన ఐతిహాసిక స్పృహ వారి కొక ప్రత్యేకస్థానాన్ని కల్పించి పెడుతున్నది.

'ఆది ఉందా ఈ జగత్తుకు
ఆది ఉందా ప్రతిసరిత్తుకు ?
ఆది ఉందా ఓంక్రియామయ
నాదబిందు కళావియత్తుకు ?
ఏది ఆది ? పునాది ఏది ?
మంచుగడ్డల విహ్వలించిన మానవతకూ ?'

అన్న చింతనతో భూమిక ప్రారంభమౌతుంది. ఈ ప్రశ్న పురాణ ప్రక్రియకు పునాది. భూమికలో నారాయణరెడ్డిగారు దర్శించిన మానవుడు 'ఆరిపోని పరిణామజ్యోతి' భూమికలో మానవుని పరిణామ శీలాన్ని చిత్రించిన నారాయణరెడ్డిగారు విశ్వంభరలో ఆ పరిణామ తత్త్వాన్ని సమీక్షించారు. ఐతిహాసిక మార్గంలో పురాతత్త్వచింతనం ప్రక్రియకు పరిణత రూపాన్ని ప్రసాదిస్తుంది. అందువల్లనే భూమికకు విశ్వంభర విశ్వరూపంలా దర్శనమిస్తుంది.

డా॥ నారాయణరెడ్డిగారు విశ్వంభరలో దర్శించిన మూలతత్త్వం-

"సృష్టికి మూలం జ్ఞానబీజం
విశ్వంభరాభ్రమణానికి మూలం
శాశ్వతచైతన్యతేజం" - అని.

మనిషి జ్ఞానబీజంనుండి మొలిచిన చైతన్యవృక్షం. ఆ వృక్షం కొమ్మలు సాచి శాశ్వత చైతన్య తేజాన్ని అందుకోటానికి యత్నిస్తుంది. ఇది మానవ ప్రస్థానం. దీనికి కర్తా, భోక్తా మానవుడే. అందుకే ఈ చరిత్రకు మానవుడే నాయకు డంటారు నారాయణ రెడ్డిగారు. జ్ఞానంవల్ల మనిషి చైతన్యశీలుడైనాడు, పరిణామ ప్రగతిని సాధించాడు. అందువల్లనే

"ప్రకృతిలోని చలనశీలానికి
పరిణామం మనిషి
జగతిలోని భ్రమణగుణానికి
ప్రతిరూపం మనిషి"-అన్నారు రెడ్డిగారు.

నేటి ప్రపంచం పరిణామవాదాన్ని అంగీకరిస్తోంది. మానవతత్త్వాన్ని ఆ దృక్పథంలో అన్వేషిస్తోంది. విజ్ఞానలోకం ఈ ప్రస్థానంలో వివిధ దర్శనాలను సారిస్తోంది. వాటి మధ్య తర్జన భర్జనలు మేధావి వర్గంలో ఉన్నాయి. భౌతికవాదానికీ, తాత్త్విక వాదానికీ, హేతువాదానికీ, ఆధ్యాత్మికవాదానికీ, నాస్తిక దర్శనాలకూ, ఆస్తిక దర్శనాలకూ మధ్య సంఘర్షణ సాగుతోంది. ఇవన్నీ మానవతావాదంలో ప్రతిబింబిస్తున్నాయి. ఈ సంశ్లిష్టప్రయోగాలలో నారాయణరెడ్డిగారి కావ్యం ఒక ప్రశ్నోపనిషత్తులా వెలువడింది.

మనిషిలోని మానవత్వం అంటే ఏమిటి అన్నది ఈ ఉపనిషత్తుకు ఊపిరిగా నిలిచే ప్రశ్న. మానవత్వమే దైవత్వం అనిచెప్పేది భారతీయ తత్త్వం. మానవత్వం దైవత్వం వైపు పయనించటమే జీవితతత్త్వం అని చెప్పేది పాశ్చాత్యతత్త్వం. ఆధునిక భారతీయుడు కూడా పాశ్చాత్య దృక్పథంతో జీవితానికి వ్యాఖ్యానం చెప్పటం సర్వసామాన్యంగా కనపడుతున్న సత్యం. దీనిని ఆలంబనగా చేసికొని నారాయణరెడ్డిగారు విశ్వంభర వస్తువును చిత్రించారు. ఒక విధంగా మానవత్వ దైవత్వాలను విడివిడిగా దర్శించే ద్వైతంనుండి ఏకత్వంగా భావించే అద్వైతం దాకా సాగిన మానవజ్ఞాన ప్రస్థానం ఇందులోని తాత్త్విక సూత్రం.

"మనిషి సాధన త్రిముఖం. కళాత్మకం, వైజ్ఞానికం, ఆధ్యాత్మికం. ఈ సాధనలో అడుగడుగునా ఎదురుదెబ్బలు. క్షతుడైనా మనిషి తిరోగతుడు కాలేదు. "విశ్వంభర" కావ్యరచనకు నాలో గీసుకున్న రేఖాచిత్ర మిది" అని ప్రస్తావనలో నారాయణరెడ్డిగారు పేర్కొన్నారు. కళాసాధన హృదయ సంబంధి; వైజ్ఞానిక సాధన బుద్ధిసంబంధి; ఆధ్యాత్మిక సాధన ఆత్మసంబంధి. హృదయానికి కామం ఊపిరి; బుద్ధికి అన్వేషణ ఆయువు; ఆత్మకు అమృతత్వం ధ్యేయం. కామం సౌంద ర్యాన్ని సాధిస్తుంది; బుద్ధి సత్యాన్ని గవేషిస్తుంది; ఆత్మ శివాన్ని సాధిస్తుంది. సత్యం, శివం, సుందరం మానవజీవిత సాధనత్రయం. ఈ సాధనను భావించటం, చిత్రించటం ఎంత తాత్త్వికమో అంత కళామయం!

ఈ సాధనకు మొదలెక్కడ? అన్న ప్రశ్నకు సమాధానమే ఈ కావ్యానికి ప్రారంభం. డా॥ సి. నారాయణరెడ్డిగారు ఈ మానవేతిహాసానికి ఆదిగా బైబిల్‌లో చెప్పబడిన ఆడమ్ ఈవ్ కథను ఎన్నుకొన్నారు. పేర్లు చెప్పి వస్తువును వ్యక్తినిష్ఠం చేయకుండా ప్రతీకాత్మకంగా చెప్పి విశ్వజనీనతను వెలార్చారు. 'కళాగోపనమే నిజమైన కళ' అన్న శిల్ప రహస్యాన్ని రచనలో వెలార్చారు "ఇతివృత్తం-తేదీలతో నిమిత్తం లేని, పేర్లతో అగత్యం లేని మనిషి కథ"గా నడపాలని వారి వ్రతం. ఇది అసిధారావ్రతం. ఐతిహాసిక స్పృహతో నిర్వహించి వస్తువుకు ప్రతీకాత్మకతను సంపదింపచేయటం ఆధునిక కవిత్వంలో అగ్రగాములు అందుకునే శిల్పప్రస్థానం. దాన్ని కావ్యమంతా నిర్వహించటం ఒక ప్రస్థానకర్త చేసే ప్రయోగం.

ఆదిమానవుడు శుద్ధచైతన్య రూపుడు. దైవత్వానికి ప్రతినిధి. అతని చుట్టూ అద్భుత పరిణామమూర్తి సుందరప్రకృతి. అతని శుద్ధచైతన్యంలో స్పందించిన ప్రథమ వికృతి సౌందర్యరతి. అది అనాసక్తం; ఆలోచనా మధురం. ఆరతిని భోగ భూమికి దింపింది స్త్రీ పుంసయోగ రూపమైన ప్రణయం. దాన్ని పతన మంటుంది దైవత్వం; బ్రతుకు తియ్యదన మంటుంది మానవత్వం. అమృతఫలం ఆనందయోగ మంటుంది దైవత్వం; అది జీవితఫల మంటుంది మానవత్వం దైవత్వాన్ని మానవ త్వంగా మార్చేది అహంకారం. అహంకారానికి అది బీజం కామం. నిరహంకార నిర్మోహ నిష్కామ సాధనం దైవప్రకృతి లక్షణం. సాహంకార, సకామ, సమ్మోహ సాధనం మానవ ప్రకృతి లక్షణం. దైవత్వం సాధించేది సాయుజ్యం; మానవత్వం సాధించేది సంస్కృతి. ఆది దంపతులు ప్రణయ ఫలాన్ని తిన్నారు. వికృతివే

ప్రకృతిగా భావించారు. దైవత్వం ఎలుగెత్తి ప్రశ్నించింది. మానవత్వం ఎదిరించి పలికింది.

"తెలుసా ! శాసనధిక్కారానికి ఫలితం?"
"తెలుసు - మట్టిలో మొలకెత్తే మరో జీవితం"
"ఆ జీవితానికి అనుక్షణం మృత్యుభయం"
"అమృత్యువు కోరలతో ఆడుకోవడం మాకు ప్రియం"
"అయితే వెళ్లిపో మట్టి మనిషీ ! ఆ మట్టిలోకి"
"అలాగే వెళ్లి పొంగిస్తాను ఆ మట్టిని నింగిపైకి"
"అందాకా వచ్చిందా నీ అహంకృతి"
"అక్కడే మొదలౌతుంది మానవ సంస్కృతి" (పుట 9)

ఇది విశ్వంభర కావ్యంలో ఉపనిషత్తుగా చిత్రింపబడిన మానవేతిహాసప్రారంభోదంతం. కవి ప్రతిభకు పతాకస్థానం.

మట్టిని మాణిక్యంగా మార్చి, మృత్యువులోనుండే అమరత్వాన్ని పిండాలని మానవయత్నం. సూర్యుని ఉదయాస్తమయాల్లోనితత్త్వం మనిషికి ఆశాకిరణం. 'ఆత్మరక్ష' అతడు నేర్చుకొన్న 'ఆదిపాఠం', అతనికది 'మృత్యుహత్యకు మూలపీఠం!' 'విశ్వాన్ని ఆత్మీకరించుకుని ఆపకించాడు మనిషి.' మనిషి నాదరూపుడని ప్రథమ దర్శనం. నాదం నుండి సౌందర్యాన్ని గానంగా పిండాడు మనిషి. నాదాత్మ రాగాత్మగా మారింది. ప్రకృతిలోని పరిణామాన్ని భావం భాషగా పరిణమించింది; భాష పాటగా జాలువారింది. పాటలో ప్రకృతికి ప్రతిసృష్టి కనపడింది; దానికి రూపమాధుర్యాన్ని వర్ణచిత్రంలో రూపొందించాడు మనిషి.స్వప్నాలను శిల్పాకృతులుగా మలచుకొన్నాడు. మనిషి తన హృదయప్రస్థానంలో లలితకళాచైతన్యాన్ని వెలార్చి అభినవ సృష్టికర్తగా మారాడు.

'మనిషి మనస్సు చూసుకుంది
తననీడను అగణ్యరూపాలుగా.
రసాహంకృతి కూర్చుకుంది
రక్తిని చైతన్యకోశాలుగా';

అని నారాయణరెడ్డిగారు మానవకళా ప్రస్థానంలో రసాహంకృతి సాధించిన ప్రగతిని సూక్తిమౌక్తికంగా సమీక్షించారు.

మనిషిలో చైతన్యం జ్ఞానబీజం. దానినుండి మనశ్శక్తి ఉద్భవించి తరువులా పెరిగి శాఖలను చాచింది. మనస్సే మానవసంస్కృతికి మూలం. అది 'తెల్లగా నవ్విందా-తెరచాప లెత్తే జ్యోత్స్నాశరత్తులు; నల్లగా నవ్విందా నాగఫణా లెత్తే విషమరాత్రులు; పచ్చగా నవ్విందా - పగుళ్ళు వారిన నేలలో పల్లవజయంతులు; ఎర్రగా నవ్విందా వెర్రెత్తి అరిచే రుధిర స్రవంతులు.' ఈ మాటలు వింటుంటే మనస్సే బంధమోక్షాలకు మూలహేతువన్న వేదాంతులవాక్యం ఆధునికంగా వ్యాఖ్యానించినట్లనిపిస్తుంది. సర్వమానవేతిహాసమూలసత్యంలా గోచరిస్తుంది. రాజర్షి బ్రహ్మర్షిగా మారాలని చేసిన రాజసయత్నంలోనూ, తృష్ణామూలమైన దుఃఖానికి హేతువును గవేషిస్తూ జ్ఞాననేత్రం సాగించిన ప్రస్థానంలోనూ, ప్రపంచాన్నంతా పిడికిలిలో బిగించాలన్న అహంకారం చేసిన లోభజైత్రయాత్రలోనూ, రక్తాభిలాన్నాన్ని కోరి రణరంగంలో రాగాత్మను దర్శించి అహింసాజ్యోతిని వెలిగించిన ధర్మచక్ర ప్రవృత్తిలోనూ, జ్ఞానద్వారం తెరిచిన నేరానికి శిక్షగా విషపాత్ర నందిస్తే అమృతంలా అరగించిన వివేక వీచికలోనూ, 'నెత్తి మీద ముళ్ళకిరీటంతో నిలువెల్లా నాటిన మేకులతో ఆత్మాహుతి చేసికొన్న కాంతికిరణప్రసారం'లోనూ, రచయిత "నవ్యమానవతకు అఖండ దీపికల"ను చూపించారు. ఈ చైతన్యధారల్లో ఒక విశ్వామిత్రుడు, ఒక బోధిసత్వుడు, ఒక అలెగ్జాండర్, ఒక అశోకుడు, ఒక సోక్రటీస్, ఒక క్రీస్తు మన మనోనేత్రాలకు గోచరించవచ్చు. కాని, వారెవ్వరూ వాచ్యం గారీ కావ్యంలో. ప్రగతి ప్రతీకలుగా ప్రతీయమాను లౌతారు. మానవేతిహాసంలో మనిషి తాను చేసిన అహంకారప్రస్థానంలో ఎదురుదెబ్బలు తిని ఆధ్యాత్మికజ్యోతిగా మారిన అమరఘట్టా లవి. వారిని వ్యక్తులుగా చూచి ఆరాధించటం కంటె స్వీయప్రస్థాన శక్తులుగా దర్శించి ఉపాసించటం మానవధర్మ మని ఈ కావ్యం వ్యంగ్యంగా ఉపదేశిస్తోంది. హేతువాదానికి జ్ఞాననేత్రం తెరిపించి మరో ప్రశ్నోపనిషత్తును వినిపిస్తుందీ కావ్యం.

'ఎందాకా ఈ నడక ?
ఈ అడుగు సాగిందాకా.
ఎన్నాళ్ళు సాగుతుందీ అడుగు ?
ఎదురుగా లోయ నిలిచేదాకా.

ఏ మంటుంది ఈ లోయ?
ఈడ్చుకుంటుంది అగాధందాకా.
ఏ మౌతుంది ఆ పైన;
ఇది ప్రశ్నగా మిగిలిన ప్రశ్న. (పుట 63)

ప్రకృతిని జయించా నని అహంకరించే మనిషికి మృత్యువు ముడివిప్పలేని సమస్య. జీవితపరమార్థ మేమిటని ప్రశ్నించుకుంటే సమాధానం దొరకని ప్రశ్న. ఆ ప్రశ్నతో సతమత మయ్యే మానవత మనసులో తిరిగే సుడిగుండాలు-

'జనం లేని స్థితి ఉంటుందా?
గమనం లేని గతి ఉంటుందా?....
అమృతత్వం పైన ఉంటే
అవని కుంటుందా చావుదిగులు?' (పుట 65)

మృత్యువును సత్యంగా గుర్తించే మానవత్వం అమృతత్వం ఉంటుందని అనుభవించ లేకపోతున్నది. మానవత్వానికి,అమృతత్వానికి అడ్డంగా నిలిచింది అహంకారం.అహం కారం చేసే భౌతికజిజ్ఞాస విజ్ఞానశాస్త్రం. దానితో మనిషి "అగోచరంగా పడి ఉన్న అణుగర్భంలో పొదిగి ఉన్న, విశ్వతత్త్వాన్ని గుప్పిట్లో బిగించి, అశ్వక్రీడ లాడు తున్నాడు." ఈప్రస్థానంలో మనిషి ఎంతోదూరం సాగాడు. అయినా,అతనికి ప్రకృతి ప్రసన్నమౌతున్నదే కాని, దాని పరమార్థం ప్రత్యక్షం కావటంలేదు. ఆకృతిస్వభావం తెలుస్తున్నదే కాని ఆత్మచైతన్యతత్త్వం అనుభవానికిరావటం లేదు. ఎంత ప్రగతి సాధించినా ఏదోప్రశ్న మిగులుతూనేఉంది. ఎదురుదెబ్బ తగులుతూనే ఉంది.

పయనంలో పిలుస్తున్న మైలురాళ్లు
పాదాలకు ప్రశ్నార్థకా లౌతున్నాయి. (పుట 73)

అణుశాస్త్రయుగంలో జీవించే మనిషికికూడా ప్రయోగానికందని ప్రశ్నలు ఎదురౌ తున్నాయి. అంతు చూస్తేనే కాని అహంకారం ఆగదు. ఆ ఆది ఏమిటి? ఆ అంతు ఏమిటి? మరలా ఒక ప్రశ్నోపనిషత్తు.

'దృష్టి కందని సృష్టి ఉందేమో?
సృష్టి కందని దృష్టి ఉందేమో?
వాక్కు కందని అర్థ ముందేమో?
మనసు కందని భావ ముందేమో?

వ్యక్తిని ఆవరించే శక్తి ఉందేమో?
శూన్యాన్ని చిత్రించే చైతన్యముందేమో?
ఉన్నట్టే ఉంది-
ఊగింది శిరస్సు పరవశించింది.
ఉన్నట్టే ఉంది-
మోగింది శరీరం పరిస్పందించి." (పుట 76)

ఆధునిక మానవునికి దైవత్వం అనుమాన ప్రమాణం; మానవత్వం అనుభవప్రమాణం. "మనిషి జీవితం అనుభవాంకితం."దైవత్వం సర్వభూతసమత్వాన్ని కోరుతుంది. దాన్ని గతిభౌతికతార్కికసిద్ధాంతాన్ని ఆశ్రయించి సాధించే మార్క్స్ ప్రస్థానముంది. దాన్నిదైవత్వంవైపుపయనింప చేసే గాంధేయప్రస్థానమూ ఉంది. హత్యాగ్రహమూ ఉంది; సత్యాగ్రహమూ ఉంది. శాంతికోసం సాగించిన సంస్కృతి ప్రస్థానంలో మృత్యుభయం నేటికీ వెన్నాడుతున్నది. భౌతికంగా ఆర్థికంగా సమత్వం సాధించటం ఒక ప్రయోగంగా సాగుతున్నది. దాన్ని మట్టిలో పండించాలంటే ముందు మనిషి తన మనసులో పండించుకోవాలి. మట్టిలోని ఎత్తుపల్లాలను సమంచేయవచ్చునేమోకాని ఆధునిక మానవుని మనస్సులో ఉన్న ఎత్తుపల్లాలు సమంకావటం లేదు. మట్టికంటే ముందు మనసులో సమత రావాలి. కళ దాన్ని సాధిస్తుందా? విజ్ఞానం దాన్ని సాధిస్తుందా? ఈ రెండూ విఫలమయ్యాయి. మిగిలింది ఆధ్యాత్మికం. దాని మీద ఆధునికమానవునికి అస్తిత్వబుద్ధి లేదు; అచంచల విశ్వాసం లేదు. భక్తిలేని శక్తిగా మారాడు మానవుడు. పెరగటం తెలుసు కాని విరగకుండా నిలవటం తెలియటం లేదు. విరగటం పరిణామ మని సమాధాన పడినా ప్రశాంతి లేదు. దానికి కారణం మానవ అహంకారం. దాన్ని దైవత్వం నేడు మరిలా ప్రశ్నిస్తున్నది-

"పరమాణువుల శిరస్సుల్లో చొరబడి
పరికించిన సత్యాల పరమావధి
వినూత్న చైతన్య సృజనమా?
విశ్వసృష్టి విధ్వంసనమా?
ఎంత పచ్చగా వెలుగుతున్నది
ఇన్నాళ్ళు నీవు పెంచిన సంస్కృతి
సహమానవ హవనంలో
సమజీవన దహనంలో?"

ఈ ప్రశ్నకు "మనిషి చలించలేదు. మౌనాన్ని వర్షించాడు, మాటల కందని శ్రుతిలో మనస్సుతో ఘోషించాడు." విశ్వంభరకావ్యం ఈ ప్రశ్నతో ముగుస్తుంది. మౌనాన్ని వర్షిస్తూ నిలిచిన మనిషి తా నెవరో తనకు తెలియని వి(అ)జ్ఞాని. నేటి సంస్కృతి విచికిత్సకు పరాకాష్ఠ. ప్రగతి ప్రస్థానపథాన్ని వివేచనకు వదిలే మానవతావాదం లోని మహాపర్వతమంత ప్రశ్న.

ప్రశ్నతో మొదలై ప్రశ్నతో ముగించటం ఈ కావ్యంలోని కమనీయశిల్పం. మానవతత్త్వానికి మణిదర్పణంగా నిలిచిన ఈ కావ్యం మానవతావాద కావ్యాల్లో వెలువడ్డ తెలుగు మహాకావ్యం. దీన్ని మహాకావ్య మనకుండా "వచనకవితలో సమగ్రకావ్యం" అని ముఖపత్రం మీద పరిచయం చేయటం డా॥ సి. నారాయణ రెడ్డిగారి సౌజన్యానికి సువర్ణతిలకం!

ఆధునికుల దృష్టిలో ఎన్నుకున్న వస్తువునుబట్టే కావ్యం విలువ కట్టటం విశేషంగా కనపడుతున్నది. ఆ దృష్టిలోచూస్తే ఆధునిక సాహిత్యంతో మహాప్రస్థానం లాగా విశ్వంభర మరోశిఖరం. ఇందులోని కవితాశిల్పం అనల్పం. విశ్వంభరలో వేయివిధాలుగా అన్వయించే విలువైన అర్థసంపద ఉంది. దాని వివేచనం మరోసారి.*

---

* నారాయణరెడ్డి 50 జన్మదినోత్సవ అభినందన సంచికలో ప్రచురితం-1981
ప్రచురణ: వంశీ ఆర్ట్ థియేటర్స్, హైదరాబాదు.

# లక్షణసూత్రం*

ఆధునికాంధ్ర సాహిత్యంలో మానవతావాదాన్ని మన్నించి వెలువడుతున్న వచన-కవితా ప్రక్రియతో ఒక మహాకావ్యం వస్తే అది ఎలా ఉంటుది? - ఎలా ఉండటానికి వీలుంటుంది? ఇది సాహితీలోకానికి ఆసక్తిదాయకమైన ప్రశ్న.

'నిన్నటి మహాకావ్యం పద్దెనిమిది పర్వాలైతే
నేటి మహాకావ్యం పద్దెనిమిది పేజీలే'

అన్నాడు శ్రీశ్రీ. అంటే ఆధునిక మహాకావ్యానికి పరిమాణం కాదు; ప్రయోగమే ప్రమాణం. వస్తువిస్తారం కంటె వస్తుసారమే నేటి కావ్యానికి గౌరవం.

ఆధునిక కావ్యంలో అనుశీలింపవలసిన అంశాలు ముఖ్యంగా మూడు. 1. వస్తువు లేదా-ప్రతిపాద్యాంశం. 2. ప్రక్రియ. 3. కవితాశిల్పం. ఈమూడింటిలో అభ్యుదయ వాదులు మొదటి అంశానికి ప్రాముఖ్య మిస్తున్నారు. అందులో కొందరు మార్క్సిస్ట్ దృక్పథంతో ఎన్నుకొన్నవస్తువే, అది సమాజానికి అందించే సందేశమే ముఖ్యమని భావిస్తుంటే, మరికొందరు మానవ జీవితప్రగతికి దోహదమిచ్చే ఏ అంశాన్నైనా వస్తువుగా ఎన్నుకోవచ్చునని సంభావిస్తున్నారు. ఏ దృక్పథంతో రచించినా దానికి సామాజిక స్పృహ తప్పకుండా వుండాలని చాలామంది అంగీకరిస్తున్నారు. సామాజిక స్పృహతో పాటు సాహిత్య స్పృహకుకూడా సముచితమైన స్థాన మివ్వాలని మరి కొందరుఅంటున్నారు. ఈ లక్షణాలన్నీ ఉన్నా రచయితకు వస్తువు నెన్నుకొనేటప్పుడు సామాజిక,ఆర్థిక,రాజకీయాది దృక్పథాలతోపాటు సాహిత్య దర్శనం కూడా ఉంటే తప్ప ప్రయోగానికి కావ్యగౌరవం రాదని కొందరు వివేచిస్తున్నారు. ఈ వాదకోలాహలంలో ఒక మహాకావ్యానికి వస్తువు ఎలా ఉండాలి? అనే ప్రశ్నకు సమాధానం చెప్పగల ఒకప్రయోగం వస్తే పరిశీలించాలని సాహితీలోకం తహ తహ లాడుతున్నది.

---

* ఇది కూడా 'విశ్వంభర' కావ్యసమీక్షయే. ప్రచురణ: యువభారతివారి నందిని (సాహిత్య త్రైమాసికపత్రిక)-(ఆలోచనం శీర్షిక క్రింద) ఏప్రిల్ 1981

ఇట్టి తరుణంలో డా॥ సి. నారాయణరెడ్డిగారి 'విశ్వంభర' 1980 నం. డిసెంబరులో వెలువడింది. ఇది సాహితీలోకంలో ఒక సంచలనాన్ని కలిగించినదనటంలో సందేహంలేదు. రచయిత మాటల్లో - "ఈ కావ్యానికి నాయకుడు మానవుడు. రంగస్థలం విశాలవిశ్వంభర. ఇతివృత్తం-తేదీలతో నిమిత్తం లేని, పేర్లతో అగత్యంలేని మనిషి కథ. ఈ కథకునేపథ్యం ప్రకృతి....ఆదిమ దశనుంచీ ఆధునిక దశవరకు మనిషి చేసిన ప్రస్థానాలు ఈకావ్యంలోని ప్రకరణాలు.,ఇది 'వచనకవితలో సమగ్రకావ్యం'.

'ఆధునికాంధ్ర కవిత్వంలో సంప్రదాయం - ప్రయోగం' అన్న అంశంమీద సాధికారికమైన సిద్ధాంతవ్యాసాన్ని రచించిన రచయిత డా॥ సి. నారాయణరెడ్డిగారు, ప్రయోగాన్ని గురించి పరిశోధించిన విద్వత్కవి. వారి 'విశ్వంభర' సమకాలీన ఆంధ్ర కవిత్వంలో వచన ప్రక్రియలో వెలువడిన ఆధునిక మహాకావ్యం. మానవతా వాద ప్రస్థానంలో ఒక మణిదీపం.

డా॥సి.నారాయణరెడ్డిగారి సాహితీవ్యక్తిత్వంలో ఒక ప్రత్యేకత ఉంది. తాము జీవిస్తున్న సమకాలీన సమాజంలో జరుగుతున్న సంఘటనలకు స్పందించి కళాత్మయంగా వ్యంగ్యసుందరంగా కావ్యఖండికలను రచించటం, సాహితీజగత్తులో తలయెత్తుతున్న ఆధునిక కవిత్వోద్యమాలను మానవతాదృక్పథంతో సమీక్షించి తన మార్గాన్ని కవిత్వంలో ప్రపంచించటం, ప్రతి ప్రక్రియవెనుకనున్న తత్త్వాన్ని పరిశీలించి మానవతా మహాప్రస్థానంలో అది యే పరిణామదశా విస్ఫూర్తిని వెలారుస్తుందో వివేచించటం, భావాభివ్యక్తికి తగిన ప్రక్రియను ఎన్నుకొని శిల్పసుందరంగా నిర్మించటం, ఉక్తి చమత్కారానికి ఊపిరిగా ప్రతీతాత్మక అభివ్యక్తిని సంపాదించటం, ఆసక్తిని పోషిస్తూ ఆమూలాగ్రం రచనను నిర్వహించటం మొదలైన ముఖ్య లక్షణాలు రెడ్డి గారి కవితకు ఒక వ్యక్తిత్వాన్ని సంతరించి పెట్టాయి. వీటికితోడు సంప్రదాయబలం, ప్రయోగనిర్వహణలో ప్రతిభ వారికి అండదండలుగా నిలిచాయి. ఈ సంశ్లిష్ట వ్యక్తిత్వమే వారిచేత ఒక సమగ్ర కావ్యాన్ని రచింప చేసింది.

వ్యవస్థ మీద అభ్యుదయ శక్తుల తిరుగుబాటే ఆధునిక కావ్యాలకు వస్తువును ప్రసాదిస్తున్నది. ఆ అభ్యుదయశక్తిని మానవుడుగా సంకేతించటం ఆధునిక లక్షణం. మనిషిలోనే వ్యవస్థా, తిరుగుబాటు కనపడుతున్నాయి. ఇది సమాజ పరంగా ఒక విధమైన ప్రస్థానం. అది వర్గ సంఘర్షణగా వ్యక్తమౌతుంది. కొన్నిచోట్ల వర్ణసంఘర్షణగా కనపడుతున్నది. వ్యక్తి పరంగా సాగితే అంతస్సంఘర్షణ అవుతున్నది. ఇది

మరో విధమైన ప్రస్థానం భౌతికంగా కనపడుతున్న ఈ మూడు విధాల సంఘర్షణ లను తాత్త్వికంగా దర్శిస్తే ప్రకృతిలో అంతర్భాగమైన మనిషి జరిపే అభ్యుదయ ప్రస్థానంలా గోచరిస్తుంది. సమాజ ప్రస్థానంలో కూడ తిరుగు బాటు తెచ్చేది మాన వుడే. వ్యక్తి ప్రస్థానంలోనూ తిరగబడేది మానవుడే. ఒకచోట సంఘానికి ప్రతీక మానవుడౌతున్నాడు; మరోచోట స్వభావానికి ప్రతీక మానవుడౌతున్నాడు. ఏ విధంగా చూచినా మానవ చరిత్రకు మానవుడే నాయకుడు. అందువల్లనే 'విశ్వంభర'కావ్యంలో మానవుడే నాయకుడయ్యాడు.

ప్రతి తిరుగుబాటుకూ ఒక నాయకుడుండక తప్పదు. నాయకుడు ఒక అభ్యుద యానికి మార్గదర్శి. నడిపేవాడూ వాడి వెంట నడిచేవాడూ ఉండటం సహజం. అయితే వారిద్దరి చైతన్యమూ, ప్రవృత్తి ఒకటే. వ్యక్తులుగా వ్యపదేశిస్తే వేరౌతారు కాని శక్తులుగా వివేచిస్తే ప్రతీకలౌతారు. ఆధునిక కావ్యం వ్యక్తులను వ్యపదేశించి చెప్పదు. శక్తులను గుర్తించి ప్రతీకలుగా ప్రపంచిస్తుంది. ప్రవృత్తులు, ప్రతీకలు నేటి కావ్యానికి వస్తు సామాగ్రులు. 'విశ్వంభర' కావ్యంలో వస్తు సామగ్రిని ఎన్నుకోవ టంలో ఇట్టి వైలక్షణ్యం కనపడుతుంది. రచయిత మాటల్లో-'కామం,క్రోధం,లోభం, మదం, ఆత్మశోధనం, ప్రకృతి శక్తుల వశీకరణం- ఇలా ఇలా ఎన్నెన్ని విభిన్న ప్రవృత్తుల్లో మనిషికి?.... అలెగ్జాండర్, క్రీస్తు, అశోకుడు, సోక్రటీస్, బుద్ధుడు, లింకన్, లెనిన్, మార్క్స్, గాంధీ- ఇలా ఇలా ఎన్నెన్ని రూపాల్లో మనిషికి?, ప్రవృత్తులకు ప్రతిరూపాలు వ్యక్తులు; వ్యక్తికి విశ్వజనీనతను కల్పించేవి ప్రతీకలు. నాయకుల నామాలు తుడిచివేస్తే కనిపించేవి ఉద్యమాలు. ఉద్యమాల ఊపిరులను పట్టుకుంటే చిక్కేవి మానవ ప్రకృతులు. ప్రకృతుల ప్రస్థానమే మానవ ప్రగతి చరిత్ర. ఈ తత్త్వాన్ని బీజంగా నిక్షేపించుకొని పెరిగింది విశ్వంభర.

మనిషిని వాస్తవంగా చూచి తాత్త్వికంగా వ్యాఖ్యానించటం విశ్వంభర కావ్య వస్తుతత్త్వం. డా॥సి.నారాయణరెడ్డిగారు దర్శించిన విశ్వంభరాతత్త్వం-

"మనస్సుకు తొడుగు మనిషి
మనిషికి ఉడుపు జగతి
ఇదే విశ్వంభరాతత్త్వం
ఇదే అనంత జీవిత సత్యం." (పుట 100)

జీవిత నాటకంలో మనస్సు ధరించే భూమికయే మనిషి. ఆ మనశ్శక్తి సాధించే కార్యమే అతని ఉద్యమం. మనసుకు ఆలంబనం మనిషి; ఆమోదం జగతి. మనశ్శక్తి వ్యక్తిగా సాగితే జీవిత చరిత్ర; సమష్టిగా సాగితే సమాజ చరిత్ర. సమష్టిగా సాగే సాధనకు కూడా మనిషే ప్రతీక!

"మనిషి సాధన త్రిముఖం - కళాత్మకం, వైజ్ఞానికం, ఆధ్యాత్మికం" అని విశ్లేషించారు డా॥సి.నారాయణరెడ్డిగారు. కళాసాధనలో మనిషి హృదయం, వైజ్ఞానిక సాధనలో బుద్ధి, ఆధ్యాత్మిక సాధనలో ఆత్మ క్రమంగా వికసిస్తాయి. ఈ సాధనత్రయంతోపాటు మనిషియొక్క భౌతిక సాధన కూడా పరిగణించవలెనా లేదా అనే మీమాంస మొలకెత్తవచ్చు. భౌతికాభ్యుదయానికి మానసిక వికాసం ప్రాతిపదిక. మనిషి మానసికంగా సాధించిన ప్రగతిని భౌతికంగా ప్రయోగిస్తాడు. అందువల్ల పై త్రివిధాత్మక సాధనం మానవ భౌతిక వికాసానికి తోడుపడుతుంది. కాని, భౌతిక వికాసం పైవికాసం లేనిది లేదు. కాబట్టి పై సాధనత్రయాన్నే కావ్య వస్తువుగా ఎన్నుకొన్నారు డా॥ నారాయణరెడ్డిగారు.

మనిషి ప్రస్థానాన్ని చిత్రించవలసివస్తే ఏ పద్ధతి ననుసరించాలి అన్నది మరో ప్రశ్న. పద్ధతులు ప్రధానంగా నాలుగు. చారిత్రక పద్ధతి, ఇతిహాసిక పద్ధతి, పురాణ పద్ధతి,కావ్య పద్ధతి. మహాకావ్య రచనలో మానవ ప్రస్థానం చారిత్రక పద్ధతిలో చిత్రిస్తే అది ఒక చారిత్రక కావ్యంగా రూపొందవచ్చు.అందులో తేదీలు,వ్యక్తులు,సంఘటనలు, సామాజిక చిత్రణం నిర్దుష్టంగా ఉండాలి. ఆ విధంగా మానవ ప్రగతిని చిత్రించే కావ్యం ప్రపంచ చరిత్రను వ్రాసే చారిత్రక సర్వస్వం కావచ్చు. దాన్ని నారాయణరెడ్డిగారు గ్రహించక పోవటం ఔచిత్యం. ఐతిహాసిక పద్ధతి మానవ సమగ్ర చరిత్ర స్ఫూర్తిని కలిగియున్నా ప్రతీకాత్మకంగా, ప్రవృత్తుల చిత్రణం ప్రధానంగా ప్రపంచితమౌతుంది. ఇక పురాణ పద్ధతి ప్రతిపాద్య వస్తువు యొక్క పుట్టుపూర్వోత్తరాలను దార్శనికంగా చిత్రిస్తుంది. కావ్య పద్ధతి రసవత్తర కథారూపంగా సాగుతుంది.వీటిల్లో మానవ ప్రస్థానాన్ని చిత్రింపదలచుకొన్న కవికి ఐతిహాసిక, పురాణపద్ధతులే ఉపాదేయా లౌతుంటాయి. డా॥సి. నారాయణరెడ్డిగారి కావ్యనిర్మాణ మర్మాన్ని గ్రహించి మానవ వికాసానికి మొదలేది? మూలమేది? అని దర్శించి, అక్కడినుండి మానవ

ప్రస్థానం ఎన్ని ప్రవత్తులలో ఎన్ని మార్గాలలో సాగిందో భావించి, ప్రతీకాత్మకంగా వచనకవితా ప్రక్రియలో రచించి ఆధునిక కావ్య స్వరూప దర్శనం కలిగించారు.

సూత్రప్రాయంగా వివేచిస్తే ఆధునిక మహాకావ్యం ఈ క్రింది లక్షణాలతో వెలుగొందుతుండాలి.

1) మానవ ప్రగతినిగాని ప్రస్థానాన్నిగాని సాధ్యమైనంతవరకు ఒక సమన్వయంతోనూ, ఒక సమగ్రతతోనూ సమీక్షించాలి.

2) వస్తువు వాచ్యంకాకుండా ప్రతీకాత్మక ప్రవృత్తితో వ్యంగ్య గౌరవాన్ని సాధించాలి.

3) ఆధునిక జీవితానికి ఒక అర్థాన్నిగాని, ఒక సందేశాన్నిగాని అందించాలి.

4) ఐతిహాసిక పురాణ పద్ధతుల నాశ్రయించి సామాజికుల్లో ఒక ఆలోచన రేకెత్తింపచేయాలి.

5) ఆకృతిలో విస్తృతికంటె సారవంతమైన కళాత్మక వ్యక్తిత్వంతో కూడుకొన్న సంగ్రహత్వం గోచరించాలి.

6) రచనలో అలంకృతికంటే అర్థగౌరవం ఉండాలి. శబ్దచిత్రణం కంటె అర్థశబలత భాసించాలి. అలంకారాలు ఉన్నా అవి అర్థాన్ని పోషించాలి.

7) అభివ్యక్తి ఆత్మాశ్రయరీతిలో గానీ, పరాశ్రయ పద్ధతిలోగాని సాగవచ్చు. అయినా ఎన్నుకొన్న పాత్రలు వ్యక్తులుగా కాకుండా ప్రవృత్తులకూ, ఉద్యమాలకూ, అవస్థలకూ, సిద్ధాంతాలకూ, విలువలకూ ప్రతీకలుగా ఉండి విశ్వజనీనతను ప్రకటించాలి.

8) వర్ణనంలో స్వరూపంకంటె స్వభావానికీ, విశ్లేషణంకంటె వివేచనానికీ, తాత్పర్యంకంటె కవి దర్శనానికీ ఎక్కువ ప్రాధాన్యం ఉండాలి.

9) కవితా ఇజాలను ప్రచారం చేస్తున్నట్లు కాక నిజాలను నిత్య నూతనంగా వ్యక్తీకరిస్తున్నట్లు ఉండాలి.

10) కవితాభివ్యక్తి అనుభూతి నందిస్తూ ఆలోచన రేకెత్తించాలి.

ఈ దశ సూత్రి నేటి సహృదయుడు ఆధునిక మహాకావ్యంలో దర్శించదగిన లక్షణ సూక్తమైతే 'విశ్వంభర' ఒక ఆధునిక మహాకావ్యం.

# స్వరమేళ

త్రయీనాదము! * ఎంతచక్కని పేరు! ముగ్గురు మహాకవుల కవితలలోని సంవాదాన్ని ధ్వనింపజేసే పేరు. సంకలనంలో సంవాదం సమన్వయసూత్రమని చాటిచెప్పే శీర్షిక! ఇంతకంటె ఈ పేరులో మరో ఔదాత్యం ఉంది. 'వేదాస్త్రయ. స్త్రయీ' అని అమరం .ఋక్సామయజుస్సుల సమాహారం త్రయీశబ్దం.త్రయీ నాదమంటే వేదత్రయనాదమనీ అర్థం. ఆదిమహర్షుల అమరకవితలు ఆ వేదాలు ఆధునిక మహాకవుల అక్షయకవితలు ఈనాదాలు.

పదార్థాలను వివేచించి పట్టీలు చెప్పటంలో ప్రసిద్ధులైన మనప్రాచీనులు నాదాలను పదివిధాలుగా పేర్కొన్నారు. అవి-జల, భేరీ, మృదంగ, ఘంటా, కాహళ, కింకిణీ, వేణు, భ్రమర, శంఖు, ఓంకార నాదాలని కొందరంటారు. చిణి, చిణిచిణీ, శంఖ, వేణు, వీణా, తాళ, ఘంటా, భేరి, మృదంగ, మేఘనాదాలనీ కొందరంటారు. కానీ, ఈ సంకలనములో వినవచ్చేది నాదత్రయం మాత్రమే. వరదాచార్యులవారి రచనలో వినవచ్చేది భ్రమరగీతి. దాశరథిగారి గళంలో ప్రతి ధ్వనించేది రుద్రవీణ. నారాయణరెడ్డిగారి కవితలో నినదించేది వేణునాదం. ఝుంకార, హుంకార, క్రేంకారనాదాలు విచిత్ర స్వరవిన్యాసం చేస్తున్నట్లుంటుంది ఈత్రయీనాదం. ఈ నాదాలకు జన్మస్థానం జీవితంలోని వేదన అంటారు. నారాయణరెడ్డిగారు.

'వేదనయే లేని బ్రతుకు దూదికన్న తేలికౌను
వేదనలోనే పుట్టెను వేదమ్ములు నాదమ్ములు'.

వేదకవినుండి విప్లకవిదాకా ఈవాక్యం నిత్యసత్యం. జీవితంలోని బోధలను, బాధలను దర్శించి నిగ్గుతేల్చి చెప్పినవే వేదఋక్కులు, కవివాక్కులు.

నాదం ప్రధానంగా శబ్దధర్మం. ఆధునికుల్లో శబ్దాన్ని శ్రవణసుభగంగా ప్రయోగించి భావవ్యక్తిని సాధించేకవులు కొంతమందే ఉన్నారు. వారిలో ఈ

---

*త్రయీనాదము - ( మహాకవులు వానమామలై వరదాచార్యులు, దాశరధి, సి. నారాయణరెడ్డిగారల కవితా సంకలనము) జూన్ 1975.

సంకలన కవులు పేర్కొనదగినవారు. శబ్ద సంయోజనం వీరి కవితల్లో కనపడే రాగబంధం. వీరు శబ్దంతో పఠితను చెవులుపట్టి ఆడిస్తారు; అర్థంతో హృదయాన్ని పట్టి ఊగిస్తారు. శబ్దసంగీతం వీరికవితలకు లాస్యం నేర్పింది. అర్థగౌరవం వీరి కవితలకు అభినయం నేర్పింది. అందువల్లనే ఈ త్రయీనాదం కవితావేదంలా వినిపిస్తుంది.

"నాలుగునాళ్ల జీవితపునందనవాటిక; మంచిచెడ్డలో
పూలును ముండ్లుగా బరగు; పూలు తలంధరియింప వెల్గు; ముం
డ్లోలలి చెప్పుకాళ్లల నలుంగును; నీదగుమంచి యట్టులే
పూలయి మానవాళితల బొల్చెడిరీతి మెలంగుసోదరా!"

వరదాచార్యులవారి ఈ శాంతిగీత సార్వకాలీనసత్యబోధ; సూక్తిసుధ. ప్రసాద ముద్రతో ప్రబోధించే ప్రాచార్యుని లక్షణం ఇందులో గోచరమౌతుంది. రచనలో శబ్దంమీద అర్థం పూలతెప్పలా తేలియాడుతున్నది. ఇందులో శబ్దం అర్థాన్ని వెలిగించే స్నేహం. ప్రియునికి సర్వస్వం అర్పించిన ప్రేయసి.

"పోవాలి కృత్రిమాల చీకటి
అప్పుడు వెలుగుతుంది మనఃకుటి
రావాలి మన నరాల్లోకి జవం
అప్పుడర్థమౌతుంది పునర్నవం."

ఇది దాశరథిగారి పునర్నవప్రబోధం. ఇందులో అర్థంతోపాటు శబ్దానికీ ఒకవ్యక్తి ఉంది. వరదన్న కవితలో అర్థంలో లీనమైనశబ్దం ముక్తిని సాధిస్తుంది; దాశరథి కవితలో అర్థానికి శబ్దం తనశక్తిని ధారపోస్తుంది. దాశరథికవిత మణిదీపంలాంటిది. అందులో మణిఉంది, కాంతీ ఉంది. చెట్టపట్టాలుపట్టుకొని పరుగెడుతున్న ప్రేయసీ ప్రియుల్లాగ శబ్దార్థాలు రెండూ చెంగలిస్తుంటాయి ఆయన కవితానందనంలో.

'ఎక్కడికి పోవాలి మనం?
పాపాలను ఉతికేసే రేవులోకి
శాపాలను వొదిలేసే దీవిలోకి
జీసస్ ప్రాకిన సిలువపందిరిలోకి
బాపూ విడిచిన చివరి వూపిరిలోకి.

ఇది నారాయణరెడ్డిగారి ప్రశ్నోపనిషత్తు. రెడ్డిగారి కవితలో శబ్దార్థాలు రెండూ పోటీ పడుతుంటాయి. శబ్దం పఠితను మోహింపచేస్తుంది; అర్థం అలరింపచేస్తుంది. పరిష్వంగభంగిమలో పెనుగులాడుతున్న ప్రేయసీప్రియుల్లాగా శబ్దార్థాలు కనపడతాయి. ఒక్కొకసారి ఒక్కొకరిది పైచేయి. అయినా ఒకటి వీడి మరొకటి లేదు.

వరదాచార్యులవారి కవితలో శబ్దనాదం అంతర్ముఖమై అర్థరతితో అంతర్థానం అవుతుంది. దాశరధిగారి కవితలో అర్థాభివ్యక్తికై అర్ధాంగిలా పనిచేస్తుంది. రెడ్డిగారి కవితలో స్వార్థాన్ని వీడని పదార్థాన్ని సాధిస్తుంది. ఒకరిలో అద్వైతం; మరోకరిలో ద్వైతం; ఇంకొకరిలో విశిష్టాద్వైతం: మొత్తానికి ముగ్గురూ ఆచార్యులే!

ఈ ముగ్గురు కవులూ సంప్రదాయజ్ఞులే. కాని, వరదాచార్యులవారు సంప్రదాయాన్ని సానునయంగా గౌరవిస్తారు. దాశరధిగారు కవితాయానంలో పాథేయంగా గ్రహిస్తారు. రెడ్డిగారు ప్రయోగానికి ప్రరోచనంగా భావిస్తారు. సామాజికస్పృహ కవితావస్తువును శాసించటం ఆధునిక లక్షణం. శబ్దాన్నీ, అలంకారాన్నీ ప్రతీకాత్మకంగా ప్రయోగించటం కవితోక్తిధర్మం. నూటిదనంలో మాటుదనం, వాడిదనంలో వేడిదనం భావాభివ్యక్తిలో ప్రదర్శించటం అభ్యుదయశీలం. పద్యంకంటె వచనం ఆధునిక ప్రక్రియా ప్రవచనం. వరదాచార్యులవారు పెక్కుప్రక్రియలు చేపట్టినా పద్యంలోనే వారు పెద్దలు. సమకాలీన కవితాప్రక్రియలకు వారి కవితాకన్య స్పందించిటం వారి సౌజన్యశీలానికి సంకేతం. నామట్టుకు నాకు వారి ఇతర ప్రక్రియలకంటె పద్యం అత్యంత హృద్యంగా ఆస్వాదనీయమౌతుంది.

"నేత్రాండజము పక్ష్మపత్రాల విదలించి
ప్రేమాభ్రసీమల పెనుగులాడు"
"చూతపల్లవ కరాబ్జాతమ్ము లనురాగ
పూరిత స్వాగతాభ్యుదయ మిడగ"
"అవని నీ పద ముంచినంతనె పచ్చగా
నిగురించె మాయాకుటింఢ్లటంచు"
"పిరి యస్థులు తమ నూరుకండల ద్రవ్వి
యాకటి కేరాజు కన్నమిడెనొ"
"చంకజోలెల నెక్కి జంపాల నూగుచు
తిరువీథు లూరేగి తిరిగివచ్చు"

మొదలైన పద్యాలు చదువుతుంటే భావగీతికాఖండాలను చదివిన పారవశ్యం కలుగుతుంది. ఆయన ప్రకృతిని దర్శించి, అనుభూతిని భావనామయం చేసి వర్ణిస్తారు. అందులో ఆత్మాశ్రయ లక్షణంకంటె భావుకత్వం ప్రత్యక్షమౌతుంది. భావుకుడైన కవి వర్ణ్యవస్తువును వ్యక్తిగా రూపొందిస్తాడు. ఆప్రక్రియలో ఆయనకు తోడ్పడేది శ్లిష్టాశ్లిష్ట రూపకాలంకార ప్రయోగశిల్పం.

'క్రమముఋతురాజవనసమాగమము నరసి
కొమ్మలెల్లను తలపూల కులికియాడె'

అన్నచోట శ్లిష్టరూపకం రమణీయంగా, సహజసుందరంగా అమరింది. "ఇచటి యాశాలతాముఖములందు, పూలుపూచి ఫలించక రాలుసెన్నొ!" అన్న అశ్లిష్ట రూపకం వ్యంగ్యసౌరభాన్ని గుబాళిస్తున్నది. మావిగున్నను వర్ణించినా, మాలపల్లెను వర్ణించినా, శాంతిగీతను బోధించినా, వసంతశోభను కీర్తించినా ఆచార్యులవారు రూపకాలంకారాన్ని విభావరూపకల్పనానికి విశిష్టంగా వాడుకొన్నారు. తత్త్వదృష్టి గల కవి వ్రాసిన కావ్యంలో రూపకం అపూర్వ శిల్పభంగిమల్ని వెలారుస్తుంది. అట్లని ఆచార్యులవారు ఆలంకారిక మతానికి చెందినవారు కారు.

"మాతల్లి యుదరమ్ము తాదిన్న యన్నమ్ము
వేవిళ్ల మిష వెలికి వెడలించి వెడలించి
తలదాచుకొన నాకు తావిచ్చెనోయి!
నెలలు తొమ్మిది నిల్వ నీడనిడెనోయి!"

అన్నప్పుడు ఆయన రచనలలోని అలంకారచర్చ మనకు అప్రధానమే అవుతుంది. స్వభావోక్తికి ఏదోవ్యాజోక్తి కలిసి మనల్ని మైమరపింపజేస్తున్నది. "నడచే నల్లని గండశిలలవలె, పటమటిగట్లను గేదెలు మేసె" నన్నప్పుడు నూత్నోపమానం మన కన్నులయెదుట మెరుస్తుంది.

"కృషిచేసే యెద్దులకో మూతికట్ల ఉపవాసము
కూర్చుండే గుఱ్ఱాలకు మూతికె దాణాకోశము"

అన్న వాక్యాల్లో అలంకారాన్ని మించిన ప్రతీక కల్పనం తొంగిచూస్తుంది. వారు సంప్రదాయంలో నిలబడి నవ్యతను పరామర్శించినవారు. పద్యంలో, గేయంలో క్రొత్త భావాల సౌరభాలను వెదజల్లినారు. వారి ఖండకావ్యాలన్నీ ఒకయెత్తు; వారి

పోతన చరిత్ర మరోయెత్తు. వారి పోతన కావ్యం మహాబోధివృక్షంలాంటిది. వారి ఖండకావ్యాలు కళాఖండాల వంటివి. వారి కవితాజీవితపరిణామంలో ఖండకావ్యాలకు ప్రత్యేకచరిత్ర ఉంటుంది. వా రధిరోహించిన అత్యున్నతశిఖరం 'అభినవపోతన' స్థానం. వారి ప్రతిభావీచికల విన్యాసం ఈ త్రయీనాద కావ్యాష్టకంలో కమనీయంగా కనిపిస్తుంది.

వరదాచార్యులవారు మహాకావ్యరచనకై తపస్సుచేసిన ధన్యజీవి. కష్ణమా చార్యులవారు (దాశరథి) పునర్నవంకోసం అగ్నిధారతో తిమిరంపై సమరంచేస్తున్న కవివీరుడు. కవితతో చరిత్రను సృష్టించినవాడు; ఉద్యమంతో ఊపిరినింపుకొన్న వాడు. 'తిమిరంతో ఘనసమరం జరిపిన బ్రతుకే అమరం - కవితాతేజోవలయం అవనిశాంతి కది నిలయం' అన్న వాక్యం వారిజీవితానికీ, కవిజీవితానికీ ఉజ్జ్వల వ్యాఖ్యానం, నిరంకుశత్వాన్నీ, యుద్ధపిశాచాన్నీ, దోపిడీతనాన్నీ, రక్తపాతాన్నీ, కుటిలత్వాన్నీ, కృత్రిమత్వాన్నీ, అరాచకాన్నీ, అనైకమత్యాన్నీ గర్హించే ఎది రిస్తున్న విప్లవవీరుడు. ఆయన అవసరం వచ్చినప్పుడు 'పెన్ను జేబులోపెట్టి గన్ను చేతపట్టారు'. గన్నుకూ పెన్నుకూ శాంతి లక్ష్యమంటారు. తన్నుతాను తెలుసుకొని తన కన్నులు తెరుచుకొని విజృంభించటమే విప్లవమంటారు దాశరథి. విశ్వంలో ఎక్కడ మానవతకు మానభంగం జరిగినా విశ్వమానవుడుగా లేచి వియత్తలం అదిరేటట్లు గర్జిస్తాడు. తెలంగాణా ఉద్యమంలో కటకటాల వెనుక రుద్రవీణమీద కవితలను అగ్నిధారలుగా వెలిగించారు. 'నా తెలంగాణా కోటి రత్నాలవీణ' అన్న గీతం ఆయన జాతీయభావానికి బీజం. ఆ బీజంలోంచి మహాబోధి పెరిగింది. విశ్వ మంతా వ్యాపించింది. పునర్నవం కోరే వారిప్రవృత్తి కవితాపుష్పకమే కాదు నవతా పుష్పకం! క్రొత్త కెప్పుడూ ఆ పుష్పకంలో చోటు ఉంటూనే ఉంది. ఆయన జాతీయ దృక్పథం సామ్యవాదాన్ని గౌరవిస్తుంది; మానవతావాదాన్ని ఆరాధిస్తుంది.

'గొంతుక లెండ డొక్కలకు కొంచెము గంజియు లేకపోయినన్
పంతము నెగ్గగావలెను; ప్రాణము పోయెడుదాక నమ్మెగా
వింతు మటంచు నాకట తపించెడి పేదలగూర్చి నేను ప్రో
గింతును రుద్రవీణ; పలికింతును విప్లవగీతికావళుల్'

ఇందులో వస్తువు కార్మిక విప్లవం. ఈ విప్లవ భావం సంప్రదాయబద్ధమైన వృత్త రచనం మీదకూడా ఉండాలంటాడు విప్లవకవి. సవ్యసాచి కావాలికాని ఏచేత్తో సంధిస్తే యేం పాశుపతాస్త్రం? అంటారు దాశరథి. 'ప్రజాస్వామ్య, సామ్యవాద,

ధ్వజం ఎగురగలగాలి; ఉగ్రవాద, నగ్నవాద, రుగ్నబాధ తొలగాలి; శాంతివేద సౌమ్యవాద, కాంతిరేఖ వెలగాలి' అన్నప్పు డాయన నవ్యసాచిత్వం తెలియవస్తుంది. ద్వేషంలో మొలిచే విప్లవం ఆయన మతానికి విరుద్ధం. 'హింసనుండి సమసమాజ హింస ఉద్భవించుననే, అసత్యాన్ని నమ్మకు; హంతకుడవు కాబోకు'అన్నది ఆయన ప్రబోధం. 'ఎత్తైన ఆశాశైలంనెత్తమ్ముల చెంతనిలిచి పద్యాల పావురాళ్ళని బహు దిశల్లోకి వినరటం దాశరథి కవితాలక్ష్యం. ఆయన పంపే ప్రతికపోతసందేశం ఒక్కొక్క పూర్ణచంద్రబింబం, అందుకే ఆయన ఇప్పుడు 'కళాప్రపూర్ణులు'.

విశ్వమానవ హృదంతరాళాల్లోని చైతన్య జలపాతాల నవ్వడినీ, విప్లవ జ్వాలల వేడినీ రంగరించి కవితాజగత్తులో మానవతా దృక్పథానికి మనోజ్ఞరూపాన్ని దిద్దుతున్న శిల్పి డా॥సి.నారాయణరెడ్డిగారు. పద్యం నుండి, గేయానికీ, గేయం నుండి వచనానికీ అభ్యుదయాన్ని సాధిస్తూ, పట్టింది బంగారంగా, పలికింది కవిత్వంగా ప్రగతిసాధిస్తున్న కవిచంద్రులు శ్రీ రెడ్డిగారు. మాధవునికన్న మానవుడికి కవితలో పట్టంకట్టారు వారు.

"సురలకన్న కరుణాత్ముడు నరుడుకాక యింకెవ్వడు ?
మందిర మెరుగని దేవుడు మనిషికాక యింకెవ్వడు ?"

మంటల్లోని మానవుడు పుటం పెట్టిన బంగారం. మనిషిలోని మంటలు చల్లార వచ్చును గాని మనిషి మాత్రం చల్లారదని రెడ్డిగారి దర్శనం. మనిషి మండుతున్న సూర్యుడు; మార్కండేయ తుల్యుడు. ఆమనిషిలోని మమతను, బాధను, కన్నీటిని, మున్నీటినీ, అంగారాన్నీ, శృంగారాన్నీ, వియోగాన్నీ. విప్లవాన్నీ కవితలో కీర్తించడం రెడ్డిగారి మతం. వీరిదృష్టిలో విప్లవమంటే పచ్చదనం, అరుణవర్ణం దాని అభ్యుదయానికి చిహ్నం. విప్లవకవి 'నావేదం సామ్యవాదం' అంటాడు: రెడ్డిగారు 'నావాదం సామ్యవేదం' అంటారు. విప్లవవాది 'ప్రయోగంలో జీవిస్తున్న ప్రయోగం' రెడ్డిగారు 'ప్రయోగంలో జీవిస్తున్న సంప్రదాయం'. ప్రతి మార్పు తన తీర్పుగా చెప్పకున్నా తీర్పులో ఓర్పునూ నేర్పునూ ఎన్నడూ మరచిపోని ఉచితజ్ఞులు శ్రీ రెడ్డిగారు. వస్తువును నడపడంలో ఉత్కంఠను పోషించటం, కూర్పును తీర్పుతో ముగించటం, శబ్దార్థప్రతీకలతో ప్రతికవితనొక ప్రభాకిరణంలా ప్రసరించటం రెడ్డిగారికి సహజవిద్య. పిడుగుల్లో సైతం సరిగమ లేరుకొనే గడుసు ప్రజ్ఞ వారిది.

త్రయీనాదంలో సమస్వరంగా వినవచ్చేవి మూడు వర్షర్తువనర్ణలు. ముగ్గురి కవుల స్వభావాలను ముమ్మూర్తులా పట్టియిచ్చే హృద్యకావ్యఖండా లవి. వరదాచార్యులవారికవిత గేయం. పాటలో కూడా భావాలమూటను ముడివేశారు వారు. దాశరధిగారి జలద సరస్వతి జలదమాలికల వియత్తలవిలాసాలలోని శృంగార హేలావిన్యాసాలను దర్శించిన ప్రౌఢభారతి. రెడ్డిగారి 'వర్షాఖండము' నవరస విన్యాసాన్ని వ్యంగ్య సుందరంగా శిల్పించిన కళాఖండం. ఋతువుల్లో వర్షర్తువు రస నిర్భరం. కవి శక్తి కది నికషోపలం. ఆ ఋతుకీర్తనం త్రయీనాదంలో సమసూత్రంగా ఎన్నుకొనబడడం విశేషం.

నక్షత్రసంఖ్యలో నాణెమైన కవితాఖండాలు ఇందులో ఉన్నాయి. ఒక్కొక్క నక్షత్రం చూడటానికి చిన్నదైనా దగ్గరికిపోతే భూగోళమంతది. ఈ కవిత్రయ నాదం ఆధునిక ఖండకావ్య భారతం.

దీనిని ప్రచురించిన భారతీ సాహిత్య సమితి అభినందనీయం. కరీంనగరం జిల్లాలో సాహిత్య చైతన్యానికి కంకణంకట్టి యువకుల్లో అనంతకవితా చైతన్యాన్ని కల్పించి, వరదాచార్యులవారి షష్టిపూర్తి ఉత్సవాన్నేకాక, ఎన్నో కవితాగోష్ఠులను, సదస్సులను, నిర్వహించి తెలుగువాణికి సేవచేస్తున్న సంస్థ యిది. అధ్యక్షులైన శ్రీ అందె వేంకటరాజముగారు సమదృష్టిగల సాహితీవేత్తలు. క్రొత్త ప్రాతల మేలుకలయికతో సాహిత్యం ప్రగతిశీలమై పరిఢవిల్లాలని విశ్వసించే వేలాదినభ్యులు ఈ సమితికి వెన్నెముకగా ఉన్నారు. సాహితీ సమితులే నేటి సమాజంలో సాహిత్య చైతన్యానికి ఆలంబనాలు. తెలంగాణంలోని ప్రసిద్ధసాహితీ సమితుల్లో ఇది ఒకటి. అందరికీ అందుబాటులో ఉండేటట్లు ఉత్తమ కవితా సంకలనాలను వెలయించే ప్రణాళికలో ఇది మూడవయత్నం. వారియత్నం మూడుపూవులు ఆరుకాయలుగా వికసించు తుందనటానికి 'ఈ త్రయీనాదం' అక్షరసాక్ష్యం.

ఈ కవిత్రయ కవితా సంకలనానికి పీఠిక వ్రాయటం సాహసమే. శక్తిలేని నా సాహసాన్ని సహృదయులు మన్నిస్తారని ఆశిస్తున్నాను. భారతీసాహిత్యసమితి వాత్సల్యానికి నా కృతజ్ఞతలను అందజేస్తున్నాను. *

---

* త్రయీనాదమునకు పీఠిక-రచన 17-6-1975
ప్రచురణ: భారతీసాహిత్యసమితి-కోరుట్ల, కరీంనగరమండలం.

# బాపురెడ్డి భావభౌతికవాదం

సాహిత్యం ఎప్పుడూ క్రొత్తదనాన్నీ, క్రొత్తదర్శనాన్నీ కోరుతుంటుంది. క్రొత్తదనాన్ని ఇంగ్లీషులో నావెల్టీ అంటారు. దానివల్ల సాహిత్యానికి చమత్కారం కలగవచ్చు, అభినవ సాహిత్య స్ఫూర్తి విడంబించవచ్చు. అందులో మొదటిదానికంటె రెండవది ఆదరణీయం, ఉపాదేయం. సాహిత్యంలో ఈ క్రొత్తదనాన్ని పాశ్చాత్య విమర్శకు లొక కావ్యలక్షణంగా భావించారు. దాన్ని పరిశీలించే విధానాన్ని నిర్దేశిస్తూ టి.యస్. ఇలియట్ ఇలా వివేచించాడు- **"Whether the impression of novelty has been created to surpise or shock as an end in itself or whether it is the product of true originality of the genuinely new or of the expression in fresh and arresting ways of permanent and universal truths "** పఠితలకు అబ్బురపాటు కలిగించటం,తబ్బిబ్బులు పెట్టించటం చమత్కార మార్గాన్ని అనుసరించే నవ్యత లక్షణం. ఇది ఉత్తమం కాదు. పదాలగారడీ గాని, అంత్య ప్రాసల లీలావిలాసం కానీ, వక్రతావిన్యాసం కానీ, శ్లేషచమత్కృతి కానీ, ఉక్తుల పారడీ కానీ కొత్తగా అనిపించవచ్చునుగాని కలకాలం నిలచేనత్తువ వాటికి ఉండదు. క్రొత్తదనం సత్తువతో నిలవాలంటే స్థిరక్రొత్తదర్శనం కవితకు కావాలి. దాన్ని మౌలికమయిన ప్రతిభతో అవిష్కరించే కవిశక్తి కావాలి. భావనలో, అభివ్యక్తిలో ఒక నవ్యస్ఫూర్తి భాసించాలి. ఇంత జరిగినా దర్శనం పాక్షికంగా, నైమిత్తికంగా ఉండకూడదు. శాశ్వతాలూ, విశ్వజనీనాలూ అయిన సత్యాలను అన్వేషించే అనంత మార్గాలకు ఆకర్షకంగా ఉండాలి. నవ్యత సాహిత్యానికి జీవనాడియైతే, దర్శనం సాహిత్యానికి జీవశక్తి!

విప్లవ కవిత్వందాకా వచ్చిన అధునికాంధ్ర సాహిత్యం నరిక్రొత్త నవ్యతను అందించే దర్శనం కోసం ఆరాటపడుతోంది. ఆ దర్శనం మార్క్సిస్టు దృక్పథం కంటె విలక్షణంగానూ, విశ్వజనీనంగానూ, సామాజిక స్పృహతో కూడుకొన్న సౌందర్యదర్శనంగానూ ఉండాలని సాహిత్యలోకం ప్రతీక్షిస్తున్నది. బాపురెడ్డిగారు అనంత సత్యాలు' కావ్యంద్వారా అందించిన 'భావభౌతికవాదం' అధునికాంధ్ర సాహిత్యాని కొక వెలుగుబాటలా ఉన్మీలిస్తుందనటంలో అనుమానం లేదు.

నేడు ప్రచురంగా సాహిత్యాన్ని శాసిస్తున్నది గతితార్కిక భౌతికవాద మూలమైన మార్క్సిస్టు దృక్పథం. 'Marxist dialectical materialism is the form of matarialism which explains social institutions and historical changes in terms of material forces (that is, the mode of production which characterizes the economic system of a society'. (D.W.L.T) ఈ దృక్పథంతో వెలువడే సాహిత్యానికి సామాజికస్పృహ అంటే రాజకీయవేత్తల్లో, సాహితివేత్తల్లో భిన్నమయిన అవగాహన కనవడుతుంది. దీన్ని వివరిస్తూ శ్రీ ఆర్.ఎస్. సుదర్శనంగా రిలా వివేచించారు. "రచన చెయ్యడం ద్వారా రచయిత సామాజికుడు గానే ఒకపాత్ర నిర్వహిస్తున్నాడు. సమాజంనుంచి పొందిన జీవితానుభూతిని రచనలో పునస్సృష్టిస్తున్నాడు. సాహిత్యం అనుకరణ కాదు. సృష్టి. అనుభూతి రచయితతో మధింపబడుతున్నంతవరకు ఆత్మాశ్రయమే. భాషతో విశిష్ట మయిన రూపాన్ని పొందగానే అది ప్రత్యేకమయిన వస్తువుగా, సజీవ శిల్పంగా అస్తిత్వం పొందుతుంది. సృజనాత్మక రచన వస్త్వాశ్రయం కాదు. ఒక ప్రత్యేకమయిన వస్తువు. సామాజికులకు అందుబాటులో ఉండే వస్తువు. ఎంత మంది కని ప్రశ్న కాదు. సమాజమే దాన్ని గూర్చి తీర్పుయిస్తుంది. రాజకీయవాదికి ఒక్కనికే ఆ అధికారం దత్తం కాలేదు. మార్క్స్ అలా దత్తం చేయలేదు. కాలంలో కరడుకట్టిపోయే చారిత్రక బంధాల నుంచి మనిషికి విముక్తి కలిగించే చైతన్య స్ఫురణ, ప్రేరణ, స్పృహ, సృజనాత్మక రచనలో వ్యంగ్యంగా అభివ్యక్తమయితే, దాన్ని 'సాహిత్యంలో సామాజిక స్పృహ'గా గుర్తించడమవుతుంది. యిది రాజకీయవాది ఊహకన్నా అభిప్రాయంకన్న విస్తృతమయినదీ సున్నితమయినదీ,బహురూప సమన్వితమయినదీ. బంధవిముక్తి, సామాజిక పురోగతి రాజకీయ చర్యద్వారానే జరుగునని అనే వాడు రాజకీయవాది.అతనికి రచయిత తత్వమూ సాహిత్య తత్వమూ అవగాహనకు రావు" (సమాలోచనం. పు. 4, 5). సమకాలీనాంధ్రకవులలో చాలా మంది సామాజిక స్పృహను మన్నిస్తున్నారు. కాని, దానికి రాజకీయవాదాలనుండి విముక్తి కలిగించాలని కొందరు యత్నిస్తున్నారు. సామాజిక స్పృహతో కవియే నాయకుడుగా సాహిత్య రంగాన్ని రూపొందించాలనే సాహిత్యస్పృహ కవిత్వంలో రావాలని ప్రయోగాలు చేస్తున్నారు. రాజకీయమే జీవిత సర్వస్వం కాదనీ, మానవుని సర్వజీవ ప్రవృత్తులనూ సామాజిక చైతన్యాన్ని తీర్చిదిద్దే శక్తులు మరెన్నో ఉన్నాయనీ, వాటినన్నింటినీ జాగృతరచేస, ప్రగతిపథంలో పయనింపచేసే అభ్యుదయాన్ని సాహిత్యం దర్శించి ప్రపంచించాలనీ గాఢంగా భావిస్తున్నారు. ఈ చైతన్యం నవ్యత కొక నవీన మార్గం.

ఈ నవీన మార్గం ఇప్పుడు ఉషఃకాంతులను ప్రసరిస్తున్నది. ఇందులో రాజకీయనాకత్వంనుండి సామాజికస్పృహను విముక్తి కలిగించి, దానికి విశ్వజనీన మైన కళాస్వభావాన్ని అలవరచాలన్న ఉద్యమోత్సాహం కనపడుతున్నదేకాని, భావిసాహిత్యాన్ని ఒకనిర్దిష్టమార్గంలో నడిపింపగలిగే నిర్దుష్టదర్శనం ఇంకా అరుణోదయస్ఫూర్తితో ఉదయయించవలసి ఉంది. దీనికి కొందరు కవులు తెలుగులో కృషి చేస్తున్నారు. కవిసేనలాంటి వారు దీనికి ఉదాహరణం. ఈప్రయత్నం వారితోనే ఆగలేదు. వ్యక్తిత్వం ఉన్నకవులు వైయక్తికంగా వేరువేరుదర్శనాలతో ఆ విముక్తి మార్గాన్ని అవిష్కరిస్తున్నారు. అలా ముందుకు వస్తున్న అభ్యుదయకవుల్లో శ్రీ బాపురెడ్డిగా రొకరు. వారి 'భావభౌతికవాదం' నరి క్రొత్త స్వేచ్ఛావాదం!

శ్రీబాపురెడ్డి సహజంగా అనుభూతివాదియైన భావుకుడు. ఆలోచనను అనుభవంగా వ్యక్తీకరించటమే కవిత్వమనే తత్త్వాన్ని కవితగా రూపొందించటమే ఆయన ప్రయోగం. ఆధునికాంధ్రకవితలో అనుభూతి సన్నగిల్లుతూ ఆలోచన అనుకరణరూపంగా పరిణమిస్తున్న పరిస్థితి నాయన గుర్తించి పరితపిస్తారు. ఆలోచనకు అనుభవం పునాది. అనుభవంనుండి ఆలోనన ఉదయిస్తే అది విత్తునుండి మొక్క పుట్టినట్లుగా సహజపరిణామసుందరంగా ఉంటుంది. ఆలోచనతో అనుభవాన్ని అన్వేషిస్తే అనుకున్నది కనపడుతుంది. కాని, అనలుతత్త్వం అవగాహన కాదు. అనుభవం ఆత్మీయమైంది. ఆలోచన అనుభవోద్భవ మైతే స్వీయానుభవ స్ఫూర్తితో వస్తుదర్శనం లభిస్తుంది.స్వీయానుభవం విశ్వజనీనంగా మార్చుకొనగలిగేనంస్కారం సాహిత్యోపానకుని కుండాలి. సౌందర్యోపాసనం లలితనంస్కారాన్ని కలిగిస్తుంది. దాన్ని, కాలానికీ, పరిసరానికీ మించిన విశ్వవాతావరణంలోకి ప్రసరింపజేసేదితత్త్వం. సౌందర్యానికి తత్త్వం పూవుకు తావిలాంటిది. సౌందర్యంలో తత్త్వం పరిమళంగా ప్రసరించాలి. సౌందర్యానికి ప్రతీక యైన పుష్పం భౌతికం; అది అందించే సౌగంధ్యం భావనామయం. ఒకటి సగుణం మరొకటి నిర్గుణం. భౌతికవాస్తవం పుష్పమైతే, అందులోని సౌందర్యం భౌతికసత్యం. ఇది ఇంద్రియాలద్వారా మనస్సునకు అనుభవాన్నిచ్చే సత్యం. ఆసత్యంలో భావనామయ మైన అనుభూతి నిచ్చే సౌగంధ్యం కవితా తత్త్వదర్శనం. ఇదే కవితలో వస్తుతత్త్వంగా వ్యంగ్యమౌతుంది. కవిత పుష్పం; సౌందర్యం అనుభవం; ఆలోచన తత్త్వం. ఈమూడూ కవితా నత్యాలే, విడదీయలేని త్రివేణీ సంగమం; విశ్లేషించ లేని త్రిపుటి. ఈమూడింటిని ఈక్రమంలో ఆవిష్కరించటమే కవితాభివ్యక్తిగా బాపురెడ్డిగారి దర్శనం.

సమకాలీన సాహిత్యజగత్తులో ఈ ప్రస్థానం వ్యత్యస్తంగా కనపడుతోంది. కొందరిదృష్టిలో ముందు సిద్ధాంతం, అది చూచినదే సత్యం. అసత్యంలో సౌందర్యం కాదు ముఖ్యం, సిద్ధాంత త్త్వం. అందే నీ వనుకున్న సుగంధాన్నిచ్చేదే పుష్పం. ఆపుష్పం అసుంగధాన్నివ్వటమే వాస్తవం. ఇలా దర్శించటమే తత్త్వం. అదే సత్యం. ఈ విపరీత ప్రస్థానానికి విరుగుడు మార్గమే బాపురెడ్డి కవితాప్రస్థానం.

ఆధునికమానవుడు పదార్థవిజ్ఞానంవల్ల భౌతికవస్తువిశ్లేషణాన్ని చేసి వివేకాన్ని సాధిస్తున్నాడు. దాన్ని శాస్త్రదృష్టితో తర్కబద్ధం చేస్తున్నాడు. ప్రయోగ ముఖంగా సాగే పదార్థవిజ్ఞానం అతనికి వస్తువుయొక్క యథార్థ స్థితిని వివరిస్తున్నదే కాని దాని పరమార్థాన్ని పట్టిచూపటం లేదు. ఈదృష్టితో మనిషి మానవ జీవితాన్నికూడా విశ్లేషిస్తున్నాడు. వివేచన కందించే వాస్తవ మంటున్నాడు, అవాస్తవం ప్రతిదీ ప్రయోగపరిజ్ఞానంతో పరిష్కరించే అవకాశం ఉండటంచేత దాన్ని శాశ్వతంగా గ్రహించలేకపోతున్నాడు. అయితే, సత్యాన్వేషణదృష్టికి శాస్త్రదృష్టి ప్రధానమని ప్రామాణికంగా భావిస్తున్నాడు. శాస్త్రదృష్టివల్ల పొందే విజ్ఞానం వివేచనకు పనికివచ్చి నంతగా వ్యక్తి వికాసానికి తోడ్పడటం లేదు. చంద్రమండలాన్ని చుంబించినా మనిషిలోని జంతుభావం చావటం లేదు. జంతువు మనిషి కావటం జరిగితే మనీషిగా మారినా ఒక సార్థక్యం ఉంటుంది. మనీషిగా మనిషిని మలుస్తున్న పదార్థవిజ్ఞానం మౌలికంగా మనిషిని మనీషిగా మార్చటం లేదు. అందువల్ల మానవ జాతిలో మానవత్వలక్షణాలను పునరుద్ధరించవలసిన అవసరం ఏర్పడుతోంది. పదార్థవిజ్ఞానం, అర్థబలం, అంగబలం ఎంత ఉన్నా హృదయబలం, ఆత్మబలం నేటి సమాజానికి కరువైపోతున్నాయి. సాహిత్యం కొరవడుతున్న ఈమానవశక్తుల్ని మేల్కొల్పాలి; పోషించాలి; ప్రబోధించాలి; అనుభవింపచేయాలి

"ఆత్మజ్ఞానానికి
ఆవలిగట్టు దేవుడు
పదార్థజ్ఞానానికి
ఆఖరి మెట్టు అనతత్వం
అంతర్ముఖంగా
యోగమార్గం
అన్వేషిస్తున్నది ద్వైతత్వాన్ని
బహిర్ముఖంగా

ప్రయోగమార్గం
శోధిస్తున్నది అనంతత్వాన్ని!
రెండుమార్గాల సంగమం
నామనోమండలం" (అనంతసత్యాలు)

అన్న బాపురెడ్డి ప్రతిపాదన వ్యక్తిగతం మాత్రమేకాదు సమకాలీన సమాజం అంతర్ముఖంగా పడుతున్నఅవేదన. ఆత్మజ్ఞానం + పదార్థజ్ఞానం = సాహిత్య దర్శనం; దైవత్వం + అనంతత్వం = సాహిత్యతత్త్వం, అన్నది బాపురెడ్డి భావ భౌతిక వాదానికి మూలసూత్రం. ఇందులోని భావం మానవుడు జీవితతత్త్వాన్ని గురించి సాగించే ప్రస్థానానికి ప్రతినిధి. అనంతతత్వం హేతువాద శాస్త్రదృష్టితో సృష్టిని సమీక్షించే ప్రయోగ మార్గానికి ప్రతీక. ఈ రెండింటియొక్క మిశ్రరూపం మానవ జీవితానికి సాహిత్య మందించే సరస సందర్శనం. దీని వలన కలిగేది ఆనంద బ్రహ్మానుభూతి.

"భావవాద
భౌతికవాద
సరస సమ్మేళనంలో
ఆనంద బ్రహ్మను దర్శిద్దాం!"

అంటాడు శ్రీ బాపురెడ్డి. దైవత్వం మానవుడు అందుకొన దలిచిన పరిపూర్ణత్వానికి ప్రతీక; అనంతత్వం ప్రకృతిలో పదార్థ సత్యాన్ని అన్వేషించాలన్న ప్రయోగదర్శనానికి ఫలత్వం. భౌతికం పరిపూర్ణత్వ భావనతో సంవదించినప్పుడు అనుభూతమయ్యేది ఆనంద మనే అనంత సత్యం. ఇది సాహిత్యమార్గాన్ని అనుసరించి అనుశీలించి అనుభవించే ప్రవృత్తి కవితాసృష్టి.

బాపురెడ్డిగారు 'ఆనంద బ్రహ్మను దర్శిద్దా' మన్నప్పుడు పరమ ఛాందసుడా అనిపించవచ్చు. నిజాని కాయన కాడు. భౌతిక దృష్టిని భావదర్శనంగా మార్చి సాహిత్య ప్రస్థానంగా సమున్మీలింపచేసే సౌందర్య శాస్త్ర దృష్టి ఆయనది. ఆయన ప్రతిపాదిస్తున్న భావ భౌతికవాదం విశ్వజనీన సౌందర్యదర్శనం (Universal Easthetic vision)గా కనిపిస్తుంది. సౌందర్య దర్శనంలో సత్యం ప్రాతిభాసికమనీ, అలౌకిక మనీ ప్రాచ్యలాక్షణికులు పారిభాషికంగా ప్రతిపాదించారు. దాన్ని లౌకిక సత్యం కంటే భిన్నమయిన సాహిత్య సత్యంగా, కళాసత్యంగా ప్రాశ్చాత్య విమర్శ

కులు వివేచించాలి. సర్వానుభవాలకూ ఇంద్రియాలెంత ప్రమాణమో, అంతరంగం కూడా అంతముఖ్యం. తర్కాన్ని ఆశ్రయించి బుద్ధి నడిచినా, ప్రయోగ విజ్ఞానాన్ని నమ్మి ఇంద్రియాలు వర్తించినా అవన్నీ అనుభవ బిందువులో అర్ద్రమయి అనుభవ స్ఫూర్తిని పొందాలంటే ఆనందమనే అగ్ని కావాలి. కరుడుకట్టిన విజ్ఞానం ఆనందాగ్నితో కరిగి అనుభవాకృతి తాల్చినప్పుడే మనిషి సహృదయుడుగా మారేది. అలా మారిన సహృదయునిలో ప్రవృత్తిత్రయం ప్రదర్శితమవుతుంది. వాటిని వివేచిస్తే- దార్శనిక ప్రవృత్తి; వాస్తవిక ప్రవృత్తి; అనుభవ ప్రవృత్తి -అని చెప్పుకో వచ్చు. ఈ మూడింటి సమగ్ర వికాసమే మానవ పరిపూర్ణ వ్యక్తిత్వ వికాసం. ఈ మూడింటిలో ఏ ఒక్కదానినో సత్యమని నమ్మి, మిగిలిన వాటిని త్రోసిరాజంటే అది సమగ్ర దర్శనం కాదు. బాపురెడ్డిగారి భావభౌతికవాదం సహృదయ దృక్పథంతో సత్యాన్వేషణం, సత్యనిరూపణం, సత్యానుభవం సాధించే సమన్వయ మార్గాన్ని ప్రతిపాదించింది.

"మనకు కనిపించేది
సత్యం కాదని
మాయావాది వాదం;
మరి మనకు కనిపించనిది
సత్యం ఎలా అవుతుందని
హేతువాది ప్రశ్న
సమయసత్యాలేకాని
శాశ్వత సత్యాలు లేవు
మనం ఒక సత్యం
మాయకూడా ఒక సత్యం
ఏదీ సత్యం కానప్పుడు
అన్నీ సత్యాలే అవుతాయి"

అన్నవాదం బాపురెడ్డి ప్రతిపాదన ప్రజ్ఞను ప్రకటిస్తున్నది. ఈ వాదం 'ఏకం సత్' అని చెప్పే వేదాంతం కాదు; ప్రత్యక్షప్రమాణం కోరే హేతువాదం కాదు; భావ సత్యాలుగా భావించి అనుభవించే సాహిత్యసహృదయ వాదం. పై రెండువాదాలూ సాహిత్య క్షేత్రంలో సత్యాన్వేషణకు పనికిరావనీ, సాహిత్య దృక్పథంలో పదార్థ మొకటయినా, అందులో ప్రతిభావ్యుత్పత్తుల కనపడే సత్యాలనంతాలనీ, సౌందర్యదర్శనానికందే మహోద్ధర కవితాత్మయైన రసబ్రహ్మమనీ బాపురెడ్డిగారి వాద తాత్పర్యం.

కల్పితం శాశ్వతం కావటం భౌతికధర్మం కాదు. కాని, సాహిత్యంలో అపూర్వ నిర్మాణక్షమ మైన ప్రతిభాశక్తితో కవి తనకావ్యంలో దర్శించి, ఆనంద స్పర్శ నందించేటట్లు ఆవిష్కరించి అందించిన సౌందర్యసత్య సృష్టి అంతా కల్పితమైనా శాశ్వతంగా, విశ్వజనీనంగా భాసిస్తున్నది.

"కళ్ళు కల్పిస్తాయి సత్యాన్ని
బుద్ధి కల్పిస్తుంది సత్యాన్ని
అవసరం కల్పిస్తుంది సత్యాన్ని
అందుకే
ఒకే వస్తువులో
రకరకాల సత్యాలు
సత్యాలన్నీ కల్పితాలే
సత్యాలన్నీ శాశ్వతాలే"

అన్న బాపురెడ్డి వాక్యాలు వారిసిద్ధాంతానికి వ్యాఖ్యానాలు. కల్పిత సత్యం శాశ్వతం అన్నది భౌతికంగా విరోధాభాసం. అలాగే అనిపిస్తుంది భావభౌతికవాదం. కాని, సాహిత్య దర్శనంలో అది సార్థకం; సమన్వయ సుందరం.

"మనిషి జీవితం
ఒక మహాకావ్యం
జీవితం ఒక నిత్యసత్యం
అయినా అది మహాస్వప్నం"

జీవితాన్ని చీల్చి చూపేది శాస్త్రం; జీవితాన్ని మిథ్యగా భావించి త్రోసివేసేది వేదాంతం. నిత్యసత్యాన్ని భౌతికంగా చూచి, భావలోకంలో మహాస్వప్నంగా అనుభూతి నిచ్చేది సాహిత్యం. శాస్త్రం భౌతికానంద మిచ్చినా మానసికవేదనను సృష్టించింది; వేదాంతం జీవితాన్ని గూర్చి రాద్ధాంతం చేసి నిర్వేదాన్ని కలిగించింది; నేటి సమాజంలో వేదన నాగరకతకు లక్షణమైతే, నిర్వేదం జీవితానికి ఫలమివ్వలేని నిరర్థక ప్రస్థానమై పోయింది. ఈ రెంటికీ ఉజ్జీవనం కలిగే ఉజ్జ్వలమార్గం సాహిత్యం చూపిస్తే మానవుని సహజానందాన్వేషణం సఫలమవుతుంది.

"దేహం ఆనందాన్వేషి
మనస్సు ఆనందపిపాసి
బుద్ధి ఆనందోపాసి
త్రివిధానందసమాధి
జీవిత పరమావధి"

గతి తార్కిక భౌతికవాదం మానవుని ఆర్థికాభ్యుదయాన్ని అందించే ఆనందాన్ని కల్పించాలని యత్నిస్తోంది. సమ సమాజ నిర్మాణ ధ్యేయంతో పురోగమిస్తోంది. ఆర్థికంగా సమానత్వాన్ని సాధించిన మానవలోకం హార్దికంగా విశ్వమానవ సమానత్వం సాధించే సంస్కారాన్ని భావయోగంద్వారా సంపాదించాలి.మనిషిని మనిషిగా భావించే సహృదయత జనంలో సమున్మీలించాలి.అయినా,అహంకార స్వార్థాభిమానాలు మనిషిని మనిషితో ఐక్యం చేయలేకపోతున్నాయి.వాటిని చంపుకున్నప్పుడే మనిషిలో మమత ఉదయిస్తుంది; ప్రేమ పెల్లుబుకుతుంది. ప్రేమతో మనిషి లోకాన్ని చూస్తే ప్రతివ్యక్తిలో దైవత్వం స్ఫురిస్తుంది. ఆ దైవత్వాన్ని అధ్యాత్మికంగా అందుకుంటే ఆత్మజ్ఞాని అవుతాడు; సాహిత్యంద్వారా సాధిస్తే రసయోగి అవుతాడు. సామాజిక స్పృహకు రసయోగంవల్ల సార్వజనీనత లభిస్తుంది; రాజకీయంనుండి విముక్తి సిద్ధిస్తుంది; తాత్త్వికచింతనకు రసయోగంవల్ల సహృదయత సమకూరుతుంది; మిధ్యావాదంనుండి సౌందర్య దర్శనం పొటమరిస్తుంది. భౌతికంగా సాధింపదలచుకొన్న సర్వమానవసమానత్వానికి భావలోకంలో భద్రతను కల్పించేదీ, భావలోకంలో భద్రంగా నిలిచే విశ్వజనీన దృక్పథానికి శాశ్వతత్వాన్ని సమకూర్చేదీ బాపురెడ్డిగారి భావభౌతికవాదం. అందుకే తన ప్రస్థానాన్ని మనిషినుంచి ప్రారంభించారు బాపురెడ్డిగారు. జీవితాన్ని ఒక మహాకావ్యంగా దర్శించారు;

"జీవితం
జననమరణాల మధ్య
కాలం వ్రేలాడగట్టిన
కాంతిరేఖ"

అని జీవనగీత వినిపించారు, "మావూరినుండి బయలుదేరి, మానవలోకమంతా స్పర్శిద్దాం" అని విశ్వజనీనతను ప్రకటించారు; "మావూరును మీ ఊరిలో దర్శిద్దా మని"

అద్వైతాన్ని ప్రదర్శించారు. వీరి కవితా ప్రస్థానానికి కరదీపిక "అనంతసత్యాలు" కావ్యం.

మార్క్సిస్టు దృక్పథంతోనే చూచింది భౌతికసత్యం,ఆలోచించింది భావసత్యం; సృష్టించింది కవితాసత్యం అన్న ఏకైక సత్యాన్ని దర్శించే ఆధునికాంధ్ర కవిత్వ ప్రస్థానానికి, రాజకీయశృంఖలాలను త్రెంచివేసి, అఖండ సంస్కారధారగా కవిలో పొంగే స్వేచ్ఛాదర్శన స్వాతంత్ర్యాన్ని దర్శించి, కవితాత్మయైన రసానుభవాన్ని హృదయభాండాల్లో నిండించి,సాహిత్యప్రస్థానం అనంతసత్యాన్వేషణ ప్రవృత్తితో సౌందర్యదృక్పథంతో సాగించే సహృదయ నిత్యసత్యసృజనానరస్వతీ ప్రవాహాన్ని ఎలుగెత్తి చాటుతున్నారు శ్రీ బాపురెడ్డి. బాపురెడ్డి కోరేది కవితకు భారమైన రాజకీయ ప్రభావశృంఖలాల విముక్తితోపాటు భావభౌతికవాద ప్రసక్తి.

"పరిణామానికి పాట నేను
భవిష్యత్తుకు బాట నేను
జననానికి మరణానికి మధ్య
జీవితాన్ని నేను
కాలప్రవాహ ప్లవాన్ని నేను
క్రమవికాసవిప్లవాన్ని నేను
రండి నాతో రండి"

మరో మహాప్రస్థానాన్ని సాగించే మహాకవిలా పిలుస్తున్నాడు శ్రీ బాపురెడ్డి. తన భావభౌతికవాదం సాహిత్య సామ్యవాద మంటున్నాడు. వినండి ఈ కొత్త పొలికేక:

"సామ్యవాదిని
అందరిలో అన్నిటిలోని సామ్యాలను కలిపే
సాహిత్య సామ్యవాదిని
సాహిత్య స్వామ్యవేదిని."

---

ఈ వ్యాసం 'బాపురెడ్డి సాహితీ రజతోత్సవసంచిక'లో ప్రచురితం-
ప్ర: వంశీఆర్ట్స్ థియేటర్స్, హైదరాబాదు: డిసెంబరు, 13, 1980-

# "ఈ జంటనగరాలు హేమంతశిశిరాలు"*

# హాస్యరస రహస్యం

సభాయై నమః

నన్ను ఈ కావ్యంలోని హాస్యాన్ని గురించి మాట్లాడుమన్నారు మిత్రులు శ్రీమాన్ ఉత్పల సత్యనారాయణాచార్యులవారు. ఆచార్య అవధానిగారు వాఙ్మయ పాథోధిని పుక్కిట పట్టిన అగస్త్యులు. వారు 'ఆచమ్య' అని కార్యక్రమాన్ని ఆరంభం చేసి తొలిపలుకులలోనే కావ్యసారాన్ని మీచేత ఆపోశనం చేయించారు. పూజ్యులు దేవులపల్లి రామానుజరావుగారు కావ్యరామణీయకత్వాన్ని ఆరామంగా ఆవిష్కరించారు. మిత్రులు డా॥సి.నారాయణరెడ్డిగారు కావ్యగౌరవాన్ని నాణ్యమైన కవితావాక్కులతో మరో హరివిల్లులా మీముందు చిత్రించి పెట్టారు. డా॥ మాధవశర్మగారు కవితాశిల్ప మర్మాలను కుశలంగా కూర్చి చెప్పారు. ఇక నాకు మిగిలింది నవ్వులపాలుకావడమే. ఇక హాస్యానికి హంగు నిచ్చే నాంది ఇంతకన్నా ఏముంటుంది?

నామిత్రుల్లో కొంత మంది నన్నెవరికన్నా సాహితీబంధువులకు పరిచయం చేసేటప్పుడు 'ఇతను మా వీరరసం సుబ్రహ్మణ్య మండీ' అని తొలిపలుకు చిలకరిస్తుంటారు. ఆ నూతన మిత్రులు విస్తుపోయి ఒక్కక్షణం నన్ను చూచి ఎందుకో చిరునవ్వు నవ్వుకుంటారు. వెంటనే నా గుండెగొంతుక 'రసాభాసం హాసాన్ని కలుగజేస్తుందిసుమా!' అన్న లక్షణాన్ని గొణుక్కుంటూ ఉంటుంది. ఒకసారి శ్రీ పెనుమత్స సత్యనారాయణరాజుగారు ఉండబట్టలేక బైటికనేశారు. "మీపుస్తకం చూచినప్పుడు మీరెలా ఉంటారో అని అనుకున్నాను, మాటకుముందు మీసం దువ్వుతారేమో ననుకున్నాను. మిమ్మల్ని చూచాక మీరు 'వీరరసం' వ్రాశారా 'శాంతరసం' వ్రాశారా అని అనుమానం వస్తోంది." అని. ఆమాట అనేసరికి నాకే నవ్వొచ్చింది. కాని

---

* ఆంధ్ర సారస్వత పరిషత్తులో 6-7-1971 తేదీన జరిగిన ఈ కావ్య ఆవిష్కరణ కృతిప్రదానోత్సవంలో సమర్పించిన ఉపన్యాసవ్యాసం.

నేనొక్కణ్ణే నవ్వటం కాకుండా మీరుకూడా నవ్వటానికి ఇవ్వేళ ఈదండ మెళ్లో వేయించుకున్నాను.

అసలు హాస్యాన్నిగురించి మాట్లాడాలంటే ఏమునిమాణిక్యం నరసింహా రావుగారితో పూనుకోవాలి. హాస్యాన్ని కళాత్మకంగా దర్శించి సృష్టించిన సాహిత్య తపస్వులలో ఆయన అగ్రశ్రేణిలోని వారు. అయితే నాకూ ఒక అధికారం ఉందను కుంటాను. ఉత్పలవారి వెంట ఊరెల్లా తిరిగిన నర్మసఖుడు నూకరాజు నాకాకారసదృశుడు. విశ్వనాథ మెచ్చుకున్న వాక్చాతుర్యం అతనికుంది. నాకూ కొంత ఉంది. కాని, అతనికి వచ్చిన 'గోదావరి' తెల్గుభాష నాకు రాదు.

"ప్రసవ దినమన్న నేటి జవ్వనులపాలి
పరువపు విలాసములకు నుపద్రవంబు,
చారుగాత్ర నళినికి నీహారవృష్టి,
స్తనయుగంబున కుగ్రపాతకము గాదె!"

అని విడమరిచి చెప్పే వివేకంగూడా లేదు నాకు. కవిగారి చిలిపి కన్నులలో చిన్న మెత్తు బూతు నూకరాజు. నూకరాజు ప్రక్కన లేకపోతే

"ప్రతిభోదయ దాటిక ప్రౌఢ యామె
ఏమి మాటాడలేని అంబేద నేను
అనుపమాసక్త చిత్తయౌ సతివ యామె
సరిగ మోమెత్తి కనలేని పిరికి నేను"
"పీన కుచకుంభ యుగళ ధురీణ యామె
అడుగు ముందిడలేని ఖిన్నుఁడను నేను
ఘన జఘనభార మంథర గమన యామె
తోడ నడువజాలని యశక్తుఁడను నేను"

అని కాళ్ళు బారజాపి పెదిమలు తడిచేసుకునే కవికుమారుడు మిత్రుని అండ దొరకగానే, అతని బుజం మీద చేయివేసి,

"బాలుఁడైనను నేమి? ప్రభాకరుండు
పద్మినీ పూర్ణవికసన పటువు గాదె!"

అని గోపాలకృష్ణుని పోజుపెట్టి అర్థాంతరన్యాసాల్లో అసలురూపం బైట పెడతాడు. నూకరాజు పక్కన లేకపోతే కవిగారెక్కిన జట్కాబండికి వెనకబరువు చాలదు. అంత తూకం ఉన్నా అంతపాకం లేనివాణ్ణి నేను. ఈ పాత్రవికృతి హాస్యానికి మంచి ఆలంబనం కదూ!

ఉత్పలవారు ఈ కావ్యాన్ని 'హాస్యరస ప్రాయంబుగా' రచించానని ఉపక్రమించారు. 'ప్రాయం' అనే శబ్దానికి వ్యుత్పత్తియందు ఉత్తరపదం కాబట్టి "సమానము" అని అర్థం తీసుకోవచ్చు. కవిగారి "ఊహలు చూస్తే" దానికి 'వయస్సు' అని అర్థం చెప్పాలని అనిపిస్తుంది. కాని, కావ్యమంతా చదివిన తరువాత మొదటి అర్థమే ముచ్చటగా ఉందని అనిపిస్తుంది. అదే అయినా అనుకొని వుంటాడు. మనమూ అదే అనుకుంటాము.

నేనీ కావ్యం చదువుతూ ఉంటే ఒక మిత్రుడు వచ్చాడు. ఆయన ఒక గెటప్(get up) విమర్శకుడు. అట్టను చూచాడు. ఆకృష్టుడైనాడు.'ఎక్కడి'దా ప్రింటు? అన్నాడు. 'చందమామ ప్రెస్' అన్నాను. 'చెన్నపట్నంలో ఉన్నా చంద్రుడు ఉత్పలాన్ని ఆకర్షిస్తాడు మరి!' అన్నాడు నవ్వుతూ: 'అట్టమీద చంద్రకళను చూచావా?' అన్నాను. 'ఎవరో ఆవిడ' అన్నాడు. 'పైరవీసుందరి' అన్నాను. 'ఈ క్రొత్త బ్రాండెక్కడిది?' అన్నాడు. 'ఈ జంటనగరాల హేమంతశిశిరాలలో మంచు ముసుగుతెరల వెనక మూలుగుతున్న అవినీతికి అలవోకగా ఆత్మార్పణం చేసుకున్న అబలామణి. శ్రీకాంతుని వశంచేసుకోవటానికి అభినవ మధురభక్తిని అలవరచుకొన్న అభినేత్రి' అన్నాను ఆవేశంతో. 'అంతగా పొగిడేస్తున్నావు. అంతటి వగలమారి ఈ నగరాల్లో ఉంటే ఇంకా వసంతం రాలేదా!" అని నామిత్రుడు నవ్వేశాడు. నేను కొంచెం సీరియస్ అయ్యాను. 'సమాధానం చెప్పవేం'అని గద్దించాడు. ఇక ఏదో చెప్పక తప్పింది కాదు. 'ఈ కవిగారు మనుచరిత్ర చదివి అభినవ ప్రవరాఖ్యుడై పలాయనమంత్రం పఠించి కథను అడ్డం తిప్పాడుగాని లేకపోతే వసంతం ఎప్పుడో వచ్చేది' అన్నాను అనుమానిస్తూనే. అతను కొంచెం ఆలోచించి, ఒక నిమిషం తర్వాత అన్నాడు. 'ఈ కవి వయస్సెంత?' అన్నాడు. నేనన్నాను- 'ముతక ఖద్దరు కడతాడుకాని ముసలివాడేం కా'దన్నాను. ముసలితనం ముఖం ముడతలువడితేనేనా వచ్చేది?-అతను తప్పకుండా ముసలివాడై ఉండాలి! లేకపోతే ఈ జంటనగరాలేంటి? ఇటు ఉత్పలమేమిటి అటు ఉవిద ఏమిటి -అన్ని ఉన్నా ఆ సీరుకారటం, ఆ అకురాలటం నాకైతే నవ్వొ

స్తోంది అంటూ వెళ్ళిపోయాడు ఆ గెటప్ విమర్శకుడు. నాకు కొంత 'మేటర్' దొరి కిందని సంతోషంతోపాటు దీనికి సమాధానం చెప్పాలన్న ఆరాటంకూడా పెరిగింది.

ఉత్పలవారు నిజంగా వృద్ధులే అనుకున్నాను. నల్లని శిరోజాల క్రింద తెల్లని మేధను పండించుకున్నారని తెలుసుకున్నాను. నవ్వుతూ మనమధ్య తిరుగుతూ, చిన్నపిల్లవాడులాగా ముద్దు ముద్దుగామాట్లాడుతూనే నవ్వు కొక లోతు కనిపెట్టిన నవ్య కవిగా ఆయన నాకు స్ఫురించారు.

"వెర్రితనై యెన్న డేను నవ్వినది లేదు
లేక దేశాలు ద్రిమ్మరిల్లినదిలేదు
కృత్రిమాటోపనవనాగరకుల గాంచి
లోని వ్యథ నవ్వుగా మాఱి కానిపించు."

అన్నది ఈ కవి తనకావ్యంలో ఉన్నహాస్యాని కిచ్చిన స్వరూపం; లేక వ్యాఖ్యానం. నవ్వుకు బాధ లోతు-జీవితానికి పరమార్థంలాగా. అసలీకావ్యానికి తత్త్వం ఇదే అనిపిస్తున్నది. దీనిచుట్టూసాలెగూడు అల్లినట్లు కవి కావ్యాన్ని అల్లాడు.అటువంటప్పుడు కవి నవ్వుతున్నా, మనల్ని నవ్విస్తున్నా- మనకు మనస్సుల్లో గుబాళించేది హాస్యమా? కరుణమా? పన్నీరువలె పరిమళిస్తున్న కన్నీరు ఈకావ్యంలో కటాక్షిస్తుంది. ఈకావ్యం చదివి ఇది హాస్యరసప్రధానమైనది అంటే అది అప్రౌఢ మనిపిస్తుంది. కాదని అంటే కవిగారిమాటకు అడ్డువస్తున్నట్లుంటుంది. కాబట్టి 'హాస్యరసప్రాయ' మనే అందాము. 'ప్రాయ'మనటంలో గల నా అభిప్రాయం కవిగారు హాస్యాన్ని 'హాయి'గా వాడినంతగా స్థాయిగా వాడలేదని.

ఇలా స్థాయిగా హాస్యాన్ని పోషించ లేకపోవటానికి కారణంఏదోఉండి ఉండాలి. అది వ్యక్తిగతమైనా ఆశ్చర్యపడవలసిన అవసరం లేదు. నాకు తెలుసు. మేమందరమూ కలిసి భువనవిజయకార్యక్రమాలకు దూరదూరప్రాంతాలకు కార్లల్లో వెళ్ళి వస్తుండేవాళ్ళము. మా అందరిలో మా అవధాని మాస్టరుగారూ,మాధవ శర్మగారూ బీష్మద్రోణాచార్యులవంటివారు. వారి ప్రక్కన కూర్చోటానికి నా వంటి కొందరికి భయంగా ఉండేది.అందువల్ల వెనక సీట్లల్లో కూర్చుంటుండే వాళ్ళం.ఉత్పలవారికికూడా మా వైపే సరాలుగుంజే వనుకుంటాను. దప్పి గొన్న కన్నులతో మావైపు చూచేవారు. కాని, వెనుకకు వచ్చేవారు కారు.రావటానికి వీలుండేదికాదు.అవధానిగారికి వారిభుజం మీద చెయ్యివేసి కూర్చుంటేనేగాని తృప్తి ఉండేదికాదు. ఉత్పలమీద వారికున్న

వాత్సల్యం అటువంటిది. మేమువెనక కప్పగంతులలక్ష్మణశాస్త్రిగారి సహజహాస్యకథా వాహినిని వింటుండే వాళ్ళం. ఉత్పల అవధానిగారి వద్ద ప్రాచీన ప్రబంధాలను చెవులతో పఠించేవారు. దీనినిబట్టి ఆయన పెద్దలమధ్య పెరిగినబిడ్డ. నియమం, ఒద్దిక, ఓర్పు, గాంభీర్యం, ఒక style ఆయనకు అవసరమైనవి. పద్యం హృద్యంగా చదివే ఒడుపు పుట్టుకతో వచ్చిన విద్య. దానిని అవధానిగారు బాగా పదును పెట్టే వారు. గళానికి తోడు ఉత్పలాచార్య తనకలానికి కూడా పదును పెట్టుకున్నారు. ఆయన అనుకున్నదానికంటే ముందే పెద్దవాడయ్యాడు. కాని, ఆయన కొంటెతనం, చిలిపితనం, ఉడుకుతనం, లోలోన ఒదిగి ఉన్నాయి-కార్తీక దీపఘటంలోనివెలుగులా; వారిప్రౌఢ కవితలో మినుకుమినుకుమని ఆయన 'అనలుతనం' బైటపడుతుంటుంది. అదే ఆయన ఉక్తి నాశ్రయించిన యొకచమత్కారం. అది ఒకసారి కన్నులతో నవ్వుతుంది; మునినాల్కతో వెక్కిరిస్తున్నది; ముక్కు నెగరవేస్తుంది; మెరుపులా మెరుస్తుంది. ఒక్కొక్కసారి భావాన్నంతా ఆశ్రయించి పద్యంగా రూపుకడుతుంది. అందువల్ల అతని కావ్యంలో ప్రౌఢత్వమే హెచ్చు. హాస్యసృజనశక్తిగల శబ్దాలు, ఉక్తిచమత్కృతులు పరిమితాలే. అయినా అవి చూచేవాడికి అపరిమితాలని అనిపిస్తవి. ఉత్పలవారు అటువంటి గారడీ చెయ్యటంలో సిద్ధహస్తులు. చూడండి:

"మగువ నన్ను సాభిప్రాయముగను జూచి
ఒక్క చిఱునవ్వు నవ్వి తా జక్కబోయె
బరువు మోయుట యామెది బాధ నాది
అని గ్రహించినదేమొ! నవ్వినది తాను."
"మెచ్చ దనుకొందు నాయమ మేఘదూత
ఆమెకు కుమారసంభవ మవసరమ్ము
లేదు - కాదంబరీ రసాస్వాద మనిన
చెలువమోమున చిఱునవ్వు చిందునేమొ !".

ఈ వాగ్వృత్తిలో ఒక వికృతి ఉంది. అది శ్లేష నాశ్రయించి ఉంది. పాత్ర స్వభావ వికృతిని పట్టియిస్తున్న పట్టున ఈ మాటలు హాస్యానికి అవధుల్లా కనపడతాయి; పఠిత మందహాసాన్ని కాస్త పెద్దతాడు. ఇలా ఉత్పల - వాగ్వృత్తి నాశ్రయించిన హాస్యాన్ని కావ్యంలో పుష్కలంగా పండిస్తాడు. అయితే అదే అతని కవితాధ్యేయం కాదు. అందువల్ల ఈ కావ్యంలో హాస్యం ఏదో ఒక మహా ప్రయోజనానికి అంగభూత

మౌతుంది.హాస్యం కరిగి భావాంతరంలో అంతర్భవిస్తుంది. అప్పుడు పతిత పెదిమల మీద చిరునవ్వు ఒక చింతగా మారుతుంది. పైరవీకత్వంతో కవిగారు తిరిగినంత సేపూ కథ పైలాపచ్చీసుగానే నడుస్తుంది. కవిగారి పలాయనంలో హాస్యం అంగలుపంగలు వేస్తుంది. కాని, ఆఫీసరు కవిగారి ముందు ఏకపాత్రాభినయం చేసినప్పుడు కథ స్తంభి స్తుంది; హాస్యం కరడుకడుతుంది.

"చొర వెట్లబ్బును నాకు లోకమున ? అశ్రుస్నిగ్ధ నేత్రాలలో
దరహాసమ్ములు నిల్పి, మోమున విషాదచ్ఛాయ మాయించి న
ట్టింటిలో నవ్వుచునుండినన్ హృదయ కల్లోలంబు తానాగదే !
నరకం బంతయుఁదెచ్చి నా బ్రతుకులోనన్ దాచినావా ప్రభూ !"

అని కవిగారు కరుణమూర్తులైనప్పుడు హాస్యం కన్నీరుగా మారిపోతుంది. పతితకు నవ్వునే అందిద్దామని కవిగారు తాపత్రయపడతారు; కాని ఆయన కన్నీరు పతితను మున్నీరుగాచేసి వేస్తుంది.అందువల్ల ఈ కావ్యంలో హాస్యం స్థాయిత్వాన్నందుకోలేదు.

హాస్యం స్థాయికాకపోవటం ఈకావ్యానికి దోషంకాదు. ఒకగొప్ప సుగుణం. హాస్యం జీవితంలోని వికృతిని చూపిస్తుంది. అదే ప్రకృతి అని భ్రాంతి కల్పిస్తుంది. దాన్ని మాత్రమే చిత్రించి ఊరుకుంటే కవి అంతర్ముఖుఁడు కాలేడు. జీవితానికి వ్యాఖ్యానం చెయ్యలేడు. ఆచార్యులవారు వస్తుతః అంతర్ముఖులు. ఈ జంటనగరాలను మనకోసం వర్ణించినా ఆయనకోసం అన్వేషించుకొన్నారు. నవ్వులపువ్వులు మనకోసం దండలు కూర్చినా ఆయన కన్నీటిముత్యాలను హిమతుషారాలుగా దండ కూర్చు కున్నారు. 'తెగిన చెప్పుకథ' మనకు చెప్పి నవ్వించినా,- ఆ

"మరునాడు తాతకోసము
అరిగితి నచ్చోట నాతఁ డగుపడకున్నన్
తిరుగుచునుంటిని పైనల
నిరువదిగొని అతని కొఱకు నిప్పటివరకున్"

అని ఈజంటనగరాల్లో అన్వేషణ చేస్తూనే ఉన్నారు. ఆ అన్వేషణలో ఆయనకు మిగిలింది ఆవేదన. మనకు మిగిలింది సహవేదన. ఈకావ్యాన్ని శాశ్వతంగా మన హృదయాల్లో నిలిపేది ఆయన ప్రదర్శించే వికృతికాదు; ఆయన మనలో మేల్కొల్పే జాగృతి. అంతకన్నా ఆయనకావ్యంలో సుగుణం ఏంకావాలి?

మొత్తానికి ఆచార్యులవారి కావ్యంలో హాస్యం అంగమేకాని అంగి కాదని నాఅభిప్రాయం. అయినా, ఈ అంగరసాన్ని చూచి అందరూ అబ్బురపాటు ప్రకటిస్తున్నారు. ఇది ఒక చమత్కారమైన రససంవిధానం. మబ్బుపట్టింది. వాన పడుతుందని మనకు తెలుసు. కాని మబ్బు మెరుస్తుంది. వానపడ్డంత భయం మన మనస్సు నావరిస్తుంది. ఆచార్యులవారి కావ్యం ఎక్కువగా మెరిసేమేఘం. మెరుపుతో మేఘస్వభావం వ్యంగ్య మౌతుంది. అది కురవకుండా ఉంటే మన కాశ్చర్యంవేస్తుంది. కురిస్తే ఆశ్చర్యంలేదు; కాని ఆవానజోరులో మనకు ఆమెరుపుమీద అంతమక్కువ ఉండదు: ఆచార్యులవారు అందువల్లనే అంగిని వ్యంజిస్తారు; అంగరసాన్ని సాంగంగా ప్రదర్శిస్తారు. చూడండి:

నూకవల్లభుడు నడవలేని అవస్థను చూచి కవి గుజ్జుబ్బండిని పిలుస్తాడు; చెలికాని చెవులో దాన్నిగూర్చి ఇలా అంటాడు:

"అదిగో! చూడు మావైపు నెమ్మదిగ నొదిగి
కులవధూ కటాక్షమ్ముల నలవరించి
రాదొడంగెను బండిగుజ్జు మ్మొకండు
ఎక్కిపోదము దానిపై నిద్దఱమును"

నియతదృక్కు అయిన బండిగుజ్జం కులవధువులా ఉందన్నాడు. ఔచిత్యం ఎలాఉన్నా అప్పటికి బాగానే ఉంది. "ఎక్కిపోదము దానిపై నిద్దఱమును" అని అంటాడు కవి. మనం నవ్వుతాము. నూకవల్లభుడు నవ్వాడో లేదో తెలియదుకాని బండిమాత్రం ఎక్కికూర్చున్నాడు. బండివాడు గుజ్జాన్ని చెండుకు తింటున్నాడు

"తొడలు గిల్లినాడు తోక గొఱికినాడు
వృషమెల్ల గోళ్ళ బెఱికినాడు
దుడుకువానిబండితురగమ్ముకంటెను
దుష్టవిటుని పొలి భ్రష్ట మేలు."
"బండివాని బాధ పడలేక గుజ్జాలు
మైథున క్రియలను మానివైచె
అందువలననేమొ హయజాతి యభివృద్ధి
[illegible] దిపుడు దేశమందు"

ఇందులో ఏ పద్యాని కా పద్యమే చూడాలి. ప్రతిపద్యానికీ బొమ్మ మారిపోతుంది. కులవధూకటాక్షమ్ముల నలవరుచుకొన్న గట్టిం ఇమేజ్ మనం కొనదాకా లాక్కో రాకూడదు. లాక్కొస్తే రసాభాసమే.

"నగరమున స్త్రీలు బస్సెక్కి దిగెడు చోట్ల
వింతగా వినంబడు సకిలింతలకును
కొంత యూఅటపడి తృప్తి గొన్నవాఁడ
నశ్వములు కొన్ని బ్రతికియున్నందులకును"

ఇందులో ఉన్న సెటైర్ మనల్ని కడుపుబ్బ నవ్విస్తుంది. ఇలా చిత్రాలు మార్చి వైచిత్రి కల్పించడంలోనే ఉంది ఆచార్యులవారి కవితాచమత్కృతి. ఇది చదివి విశ్వనాథవారే విస్తుపోయి మెచ్చుకున్నారంటే ఇక నేనెంత?

అయితే రసచర్చకు వద్దాం. ఇందులో హాస్యం ప్రధానంగా అలంకార బలంవల్ల కలుగుతున్న రసాభాసంలోనే ఉందని నే ననుకుంటున్నాను. కులవధూ కటాక్షాలతో వచ్చిన ఆ అశ్వాంగన వృత్తంలో ఉంది ఈరసాభాసం. రసాభాసం వల్ల హాస్యాన్ని సృష్టించటం అంతతేలికైనపని కాదు. గురజాడ అప్పారావుగారి కన్యాశుల్కంనిండా రసాభాస శిల్పం వల్ల పుట్టిన హాస్యమే ఊపిరి నింపుకుంది. ఆచార్యులవా రీమార్గంలో బాగా చేయితిరిగినవారు. చూడండి- రాష్ట్రపతిరోడ్డులో రమణీయదృశ్యాలు చూస్తూ-

"ఈ వీధి యందంబు నినుమడింపగఁ జేయు
లావాణ్యవతుల విలాసవిహృతి"అని మెచ్చుకున్న కవి గొప్పరసికుడని మనం ఉత్సాహపడతాము-కాని వెంటనే-

"ఆనందభవన నిర్యాత గంధంబుఁ బీ
ల్చినజాలు నాత్మ సంతృప్తి గలుగు"

అని కవిగారు మసాలాదోసె మత్తులో ఆత్మతృప్తిని ప్రకటించినప్పుడు- అయ్యో! అని ఆయన కాఫీగతప్రాణాన్ని సానుభూతితో సమాశ్వాసిస్తాము. జంగమ ఆనందనిలయాలను చనువుతో పలవరించిన కవికుమారుడు కథముందుకు సాగనివ్వకుండా కాఫీహోటలుకు వెళ్తుంటే మనకు నవ్వురాదూ! అంతేకాదు. ఆనందనిలయం ముందే ఆత్మార్పణచేసుకున్న జాతిపితల్ని స్మరించి ఈయన

అశ్రుతర్పణంచేస్తారు. మనకూ జాలివేస్తుంది. గుండెబరువెక్కుతుంది. ఇలా మెరుపుల్లా దృశ్యాలను మనకు ప్రదర్శిస్తాడు కవి. ఒక చోట స్థిరంగా ఉండనివ్వడు మనల్ని.... దీనివలన భావసాంకర్యం ఏర్పడుతుంది. ఒకచోట నిలిచి నవ్వటం ఆయనకు గిట్టదు. ఆనందబాష్పాల్లో మనకు అమలినహాస్యం అందివ్వడు. అందువల్ల మనకు అనుభవం సంకీర్ణమౌతుంది. అది క్రమంగా ఆభాసకు దారితీస్తుంది.

టాంక్‌బండ్ మీద మిత్రునితో కలిసి కవిగారు పచార్లుచేస్తూన్నప్పుడు ఒక పడతి కనపడింది. కవినాల్కపై కవిత లాస్యంచేసింది.

"ఎదుటివారికె గాక యాసుదతి రూపు
వెనుకవారికి గన్నుల విందొనర్చు
మాటిమాటికి చూపఱ మరులు గొల్పు
నాపె వక్షంబు కంటెను పీపె సొగసు."
"పడతి కుచకుంభపాళితో స్పర్ధపూని
వృద్ధి కాజొచ్చె నురుకబరీభరమ్ము
దానితో స్పర్ధపూని నితంబభరము
మించి బయలెల్ల దా నాక్రమించుచుండె".

అని శృంగారగర్భితమైన హాస్యాన్ని వెలయించారు కవిగారు. కాని, వెంటనే కళ్ళు తుడుచుకొని 'సూక్తిముక్తావళి'ని పఠిస్తూ-

"మహిత మాతృత్వమే స్త్రీకి మండనమ్ము
వట్టి దైహికభోగైకవస్తువైన
సుదతి తా నెంత చక్కని చుక్కయేని
మాతృతా హీనయైనది రోతగొలుపు"

అని వైరాగ్యశతకానికి నాందిని ఆలపించారు. ఆ హాస్యం, ఆ శృంగారం ఏమైనట్లు? మెరుపుల్లాగ మెరిసి మాయమైపోయినవి. మనకు మిగిలింది ఏదో చల్లని మబ్బుగాలి. ఏదో వాత్సల్యంలాంటి ఒక ఆర్ద్రచేతనం. మళ్ళీ మనం ఆ వనితను గూర్చి ఆలోచిస్తే మనకు స్ఫురించేది ఒక ఆభాసం. కృత్రిమత్వాన్ని చూచిన ఒక నైరాశ్యం. మనకు నవ్వొచ్చినా అది శాశ్వతమైన హాసం కాదు-అది ఒక ఆభాస.

కవిగారు బార్బర్స్ బ్రిడ్జి శృంగాటకంలో ఉన్న గాంధీ విగ్రహాన్ని చూచారు.

"అస్వతంత్రమ్మైన యఖిలభారతజాతి
బంధవిముక్తికి నీయుపాయ మద్భు
తమ్మోమహాత్మ! క్రొత్తది, దయారస
భరితమౌ గంగాప్రవాహమద్ది".

అని నివాళు లర్పించారు. మనహృదయం భక్తిభావముద్రిత మౌతుంది. కాని, కవిగారు "ఓ మహాత్మా! దుఃఖింపకుము!" అని జాతిపితను ఓదారుస్తుంటే- ఆ వృద్ధమూర్తి కన్నీరు మనల్ని భయకంపితుల్ని చేస్తుంది. భక్తిభావంలోనే ఏదో భయం ఆవహిల్లుతుంది; ఆత్మవంచన, కృతఘ్నతా భావాలు పెనవేసుకుంటాయి- మన చిత్తం కలత చెందుతుంది. మళ్లీ అభాస! మనదేశదౌర్భాగ్యాన్ని చూచి మనమే నైరాశ్యంతో ఒకనవ్వు నవ్వుకుంటాము. కాని, దానిలో కాంతి లేదు.

ఇది అలాఉంచండి. కవిగారు నూకపతి బలవంతాన వెళ్ళిన నృత్యశాల వైపు చూద్దాం. నర్తకి చెంగున దూకటంతో మనకు రక్తం ఉడుకెక్కుతుంది. ఆమె-

"ఇంచుక సేపు జుట్టు నటు నిట్టు కదల్చెను కాళ్ళుచేతు లా
డించెను నడ్డిచూపుచు నటించెను కక్షయుగ ప్రకాశముల్
పంచెను క్రింద వెల్లికిల బండి, జనమ్ముల కెల్ల పొట్ట చూ
పించెను లేచి నిల్చి కుచపిండములన్ గదలించె నెంతయున్."
"గాయము వ్రణమ్ములకు బట్టుగట్టినట్లు
వలువ పేల్కొలు మొలకు రొమ్ములకు జుట్టి
ఊరువుల సౌరు జఘనంపు తీరులెల్ల
బ్రజకు బల్మారు జూపి హర్రాజొనర్చె"-

ఈ వర్ణన చదువుతుంటే మనకు రెక్కలు తెగిన పక్షి విలవిలా తన్నుకుంటున్న దృశ్యం జ్ఞాపకానికి వస్తుంది. కవిగారి తెగినచెప్పుకు, ఈ నర్తకికీ నా కేమీ తేడా కనపడదు. ఆమె కట్టినకట్లు గాయాలకు, వ్రణాలకు కట్టిన కట్లులాగా ఉన్నాయట! ఆమె రంగంలో దూకినప్పుడు ఉంటుందనుకున్న శృంగారం ఏదీ! జాలి, జుగుప్స మనకు మిగిలిపోయినాయి. అచాత్యులవారి కావ్యఘట్టాలన్నీ ఇంతే. మనం మబ్బు వాన కురుస్తుంది అనుకుంటాం. మెరుపుమెరిసి విరిసి పోతుంది. లేకపోతే కన్నీటి బొట్టు రాలుస్తుంది! రసాభాసం అవుతుంది.

ఇలా రసాభాసంవల్ల పుట్టేహాస్యం ఈ కావ్యంలో సర్వత్రా ఆవరించివుంది. దాన్నే భిత్తికగా తీసికొని కవి ఈ కావ్యజీవితాన్ని చిత్రించారు. అదివారి ప్రత్యేకత.

దీన్ని వీధి అన్నారు విమర్శకులు. అది సమంజసమే. దశరూపక పరిణామ విమర్శకులు వీధిని ప్రథమదశగా పేర్కొంటారు. అందులో ఏకాహార్యమైన వీధి ప్రాథమికం. ద్వ్యాహార్యమైన వీధి దాని పరిణతరూపం. ఈ కావ్యంలో ఈ రెండు విధాలు నిపుణంగా మేళవింపబడ్డాయి. వీధిలో రసబాహుళ్యం ఉంటుందని లాక్షణికులు. ఇందులో అట్టి లక్షణం ఉంది. అయితే వివిధ రసములన్నింటినీ ఆచార్యులవారు హాస్యసూత్రంతో కూర్చిపెట్టారు. అందువల్ల ఇది హాస్యరస ప్రాయమైపోయింది. ఈ హాస్యసూత్రంలో నాయకమణి కరుణ. అది లేకపోతే ఆ సూత్రానికి పావిత్ర్యం లేదు. ఈ కావ్యానికి మహత్వం లేదు. ఈ కావ్యంలో హాస్యరస స్థితి ఇది అని నేననుకుంటున్నాను.

ఆచార్యులవారి హాస్యానికి జీవంపోసింది ఆయనగారి ఇల్లు. గార్హస్థ్యజీవితం ఈయన కవితాలతకు చక్కని పాదు. అర్ధాంగి అనురాగం, పిల్లల మమకారం ఈయనలో మానవత్వాన్ని తీర్చిదిద్దడమే కాకుండా జీవితపరమార్థాన్ని ప్రసాదించి పెట్టాయి.

"చిన్నప్పు డెంతయో శిక్షగా చదివించి
అమ్మనాయనలు కాపాడినారు
పెండ్లైన పిమ్మట పెండ్లాము కట్టడి
తప్పదయ్యెను నాకు నిప్పటికిని
ఇకనుండి బిడ్డల యేల్బడిలో నుండి
మనెడికాలమ్ము సంప్రాప్తమయ్యె
తరువాత మనుమలు తక్లకు తలయొగ్గి
తాతనై జీవించు దశయు కలదు

రామః రామః నా కిక స్వతంత్రమ్మదేది ?
లోనికోరిక లెట్లు తీర్చుకొనగలను?
అని విచారింప నాయంతరాత్మ యపుడు
అదియె జీవితవరమార్థమని వచించె".

ఎన్ని తిరుగుళ్ళు తిరిగినా ఈయన జీవితానికి కీలకం ఇక్కడ ఉన్నది అందువల్లనే చిత్రసీమలోని నటీమణులు అంత పెద్ద లావుగా కనపడతారు. అదీ ఒకందుకు నయమే! ఆచార్యులవారు సాహిత్యరంగాని కంకితమైనారు!

ఆచార్యులవారు దేవుడియెదుట నివేదనానికి పండ్లు దాచుకున్నా, సాహిత్య మూర్తులయెదుట తన కావ్యఫలాన్ని దాచుకోలేరు. తోటివారికి తనతోటలో పండిన రసమాకందాలను కావ్యఖండాలుగా పంచిపెడుతూనే ఉంటారు. ఎక్కడైనా హాస్యం చేస్తారుకాని విద్వన్మూర్తుల యెదుట, కవిసమ్రాట్టుల పట్ల హాస్యప్రసంగాలు చేయరు. ఆయన పెద్దమనిషితనానికి అదొకనిదర్శనం. ఎక్కడో ఒకచోట పిచ్చిదాని వాగుడును వర్ణిస్తూ "వచన కవింబోలె నిసుమాలు ముమ్మాలు రెట్టించి పలికె"నని అన్నారు కాని, కవులన్నా పండితులన్నా, కావ్యగోష్ఠులన్నా, ఇటువంటి సాహిత్య సభలన్నా ఆయనకు అపారగౌరవం. ఎప్పుడైనా విద్వద్దివాకరులు ఎదురుపడితే-

"వినయము విద్యకున్ మెఱుగు
వెట్టెనొ విద్యయె దాని దిద్దెనో
పనుపడ రెంటి కీ వునికిపట్టువు
ప్రౌఢ విపశ్చితే నమః"

అని నమస్కరిస్తా డీకవి. ఆ విద్యాగురుభక్తియే ఆయనకు శ్రీరామరక్ష!

ఔచితీవస్తువులపట్ల హాస్యము లాస్యము చేయించని ఈకవికి రసికాంధ్ర జనుల యెదదలలో స్థలము దొరకటమే కాదు మణిమయమందిరమే లభింప గలదు. సాహిత్య అకాడమీ వారు వీరి కవితకు ఉత్తమబహుమానం ఇచ్చి సమాదరించటంతో అది లభించింది కూడా! అందుకు ఆంధ్ర రసికలోకం పక్షాన అభినవ సాహితీ సభా ముఖంగా శ్రీమాన్ ఉత్పల సత్యనారాయణచార్యుల వారిని మనసారా అభినందిస్తున్నాను.

# కలం కార్చిన కన్నీరు*

వాస్తవాన్ని వాస్తవంగా చెప్పే కథకు లెందరో ఉన్నారు తెలుగులో. వాస్తవంలోని వాస్తవం చెప్పటం డాక్టర్ భరద్వాజకు బాగా తెలుసు. వాస్తవం జీవితం; వాస్తవంలోని వాస్తవం జీవనసమరం.

బ్రతుకుతో యుద్ధం చేసేది బడుగువాడైనా పలాయనం చిత్తగించనివీరుడు. పలాయనం పిరికివాడి లక్షణం. దరిద్రం మనిషిలోని పిరికితనాన్ని పోగొట్టి అతడి పిడికిలిని బిగింపచేస్తుంది: బిగించిన పిడికిలిలోని సత్తువ స్వాప్నిక జగత్తులను— పిడుగు పర్వతాన్ని పగులగొట్టినట్లుగా -బ్రద్దలు చేస్తుంది. ఆ ముక్కల్లో జీవితం. నగ్నంగా, వాస్తవంగా వైవిధ్యంతో కనపడుతుంది. ఒక పూర్ణమైన అఖండం ఖండఖండాలుగా విడిపడినా ప్రతి శకలం ఒక పూర్ణంగా భాసిస్తుంది. ప్రతి శకలంలో ఒక చరిత్ర వినిపిస్తుంది. చరిత్ర హీనములని చెప్పబడే ఈ ముక్కల బ్రదుకుల్లో చరిత్రకు పూర్ణత్వాన్ని కల్పించే చిత్రాలను దర్శించి అంతర్మథనంతో ఆవిష్కరించడటమే వాస్తంలోని వాస్తవం చెప్పేతీరు. జీవనసమరం వాస్తవంలోని వాస్తవం కోసం సామాన్యులు జీవితంతో చేసే పోరు. వాళ్ళకాపోరు జీవితసత్యం: కళాకారుడికి ఆసత్యం సత్యాన్వేషణకు తోడ్పడే దర్శనసూక్తం.

రచయిత మాటల్లో 'జీవనసమరం'- 'వ్యధార్త జీవుల యధార్థగాథల' సంపుటి. ఇందులో యాభై రెండు గాధలున్నాయి. మన సమాజపు కిందిపొరల్లో జీవించే జీవితాల బ్రదుకుపోరాటపు చలనచిత్రమిది. జీవించటానికి సామాన్యుడు పడే బాధ వ్యధ. రెక్కాడినా డొక్కాడని ఆర్థిక దౌర్భాగ్యంవల్ల కలిగే వేదన ఆర్తి. ఆకలి మంటల్లో దహింపబడుతున్నా, జీవితంలోని అనుభవాన్ని పిండుకుంటూ సమాజానికి శిథిల శిల్పాలుగా మిగిలి, వ్యవస్థలోని అస్తవ్యస్తత్వాన్ని మూగగొంతుకలతో వ్యాఖ్యానిస్తున్న కరుణార్ద్ర గాథామూర్తులు జీవులు. జీవించే హక్కు అందరికీ ఉన్నా

---

* డా॥రావూరి భరద్వాజగారి 'జీవనసమరం' పై సమీక్ష.

జీవించే వ్యవస్థ లేదన్నది ముక్తకంఠంతో సామాన్య జీవితాలు చెబుతున్న సత్యం యథార్థం. జీవితం కథకాదనీ, వ్యథతో చేసే కన్నీళ్ళ పోరాటమనీ ముగింపులేని ముళ్ళబాట అనీ తీర్పుచెప్పే అనుభవ కథనం గాథ. వీటన్నింటినీ వర్ణచిత్రంగా శిల్పించి, రేఖామాత్రంగా ప్రదర్శించే వాఙ్మయ ప్రక్రియ 'జీవననమర' ప్రస్థానం.

లక్షణంగా లేని జీవితగాథలను చిత్రించిన ఈప్రక్రియకు లక్షణం చెప్పటం కష్టం. అయినా ఇందులో చిత్రించిన ప్రతి సజీవ చిత్రం చెప్పిందీ ఒక కథ: రచయిత కలం కార్చిన కన్నీరులా దాన్ని స్పందింపచేసిన తీరు గాథ. గాథ భరద్వాజ కథనంలో ప్రాచీనార్థాన్ని ప్రక్షాళనం చేసుకుని అభ్యుదయ కవి రచనలోని పురాణ ప్రతీకలాగా జీవిస్తున్న అభినవార్థాన్ని అభివ్యక్తీకరిస్తోంది. జీవించడం పాతదైనట్లుగానే గాథ అనే పేరుకూడా పాతదే. అయితే జీవితసమస్యలు జీవితానికిచ్చే కొత్త అర్థంలాగా చూపే కొత్త పుంతల్లాగా ఈ 'యధార్థ గాథ' కూడా కొత్తరూపంతో కొత్తపోకడలు పోయింది. ఆ రూపానికి వైనం, ఆ పోకడలకు గమనం నేర్పింది డాక్టర్ భరద్వాజ. వివేచించి చూస్తే ఈ ప్రక్రియకు అయిదు లక్షణాలు పంచప్రాణాల్లా పఠితకు గోచరిస్తాయి. అవి :-

1. వస్తువు నెన్నుకునే తీరు
2. కథనం చూపే సౌరు
3. పాత్ర పలికే మాట
4. రచయిత చేసే వ్యాఖ్య
5. పఠితకు మిగిలే సమస్య

చరిత్రకెక్కని చీకటి కోణాల్లో చిందరవందరగా పడిఉన్న చింపిరి బతుకుల నిశ్శబ్ద ఘోషలను భూతద్దాలకుకూడా అందని భూతదయతోచూసి అందులోని వాస్తవ బలాన్ని కలానికున్న గళంతో పలకడానికి పూనుకోవడం ఈ గాథల్లోని వస్తువు నెన్నుకునే తీరు. వార్తలకంటే విలక్షణంగా ఛాయాచిత్రం కంటే సజీవంగా రేఖాచిత్రం కంటే స్ఫుటంగా చరిత్రకంటే చాకచక్యంగా పాత్ర చిత్రణకంటే వాస్తవంగా వర్ణచిత్రం కంటే ధ్వనిచిత్రంగా సూటిదనం కంటే వాడిదనంగా వాచ్యంగా కంటే రుచ్యంగా తొలిమెరుపు సొగసులో, మలిమెరుపు వయసులో, ప్రక్రియకు వనందు కూర్చేలా చెప్పే వైఖరి భరద్వాజ కథనం చూపే సౌరు. ఈగాథల్లో పాత్ర పలికేమాట బ్రదుకు ఊబిలో కూరుకుపోతూ కొన ఊపిరికోసం గుండె గొంతుక చేసే

రోదన. చాలని జీవికలూ, తీరని కోరికలూ, మారిన విలువలూ, చేరని తీరాలూ పల వరించిన భగ్నస్వప్నాల ఘోష. వాటిని ముఖాముఖి విని, వాటి వృత్తుల్లోని సుడి గుండాల వర్తులాలను చూసి, పరిస్థితుల ప్రభావంతో పరివేదన పడుతున్న పాత్రల ప్రవృత్తుల పరితాపాన్ని అనుభవించి అనుభవించి అవిష్కరించి, ఆ చలన చిత్రాల వెనుక చిరిగిపోయిన తెరమీద చిల్లుల గుండా, కనపడే శూన్యంలోని తాత్పర్యాన్ని నెమరువేసుకుంటూ, జల్లెడలో నీళ్ళులాగా జారిపోతున్న మానవత్వపు విలువలను గురించీ సమాజపు మనుగడ గురించీ మననం చేసికొంటూ మనస్సు పట్టలేక సాటి మనిషిని చూసి ప్రశ్నించే ప్రశ్నోపనిషత్తులు రచయిత చేసే వ్యాఖ్యలు. జీవన సమ రంలోని ప్రతి గాథా వ్యవస్థలో సామాజికంగా సంవదించుకొనదగిన సామాన్యుని సమస్యలా పరిష్కారం కోసం ప్రయత్నించవలసిన జీవనావస్థగా పఠిత హృదయం మీద ప్రగాఢమయిన ముద్ర వేస్తుంది. అల్లకపు బొమ్మను తిరుగవేసి చూస్తే ముడి పడని పోగులే కనపడ్డట్టు సమసమాజ వ్యవస్థ వెల్లకిలపడినప్పుడు సమన్వయం కోసం అఱ్ఱులు చాస్తున్న ఆర్త జనుల ఆవేదన సూత్రాలే ఈ గాథల్లో గోచరిస్తాయి. సమస్య లను పరిష్కరించడం వ్యవస్థాధర్మం. సమస్యలను ఎత్తి చూపించడం రచయిత ధర్మం. పరిష్కారాన్ని సూచించి గాథను మోదాంతం చేయబూనితే రచయిత రాజ కీయవేత్తగానో సిద్ధాంత ప్రవక్తగానో మిగిలిపోతాడు. కళాధర్మం కలరూపును కను లకు కట్టించి పఠితను కదిలించేటట్టు చేయడమే: కలం కన్నీరు కారుస్తున్నట్లుం టుంది గాథ. కన్నీటి విలువను కట్టే షరాబు కావాలి సమాజం. భరద్వాజగారు బ్రిదుకులోని బాధాసర్పదష్టుల బరువైన గుండెలను పదచిత్రాల్లో పఠితకందించారు. పఠిత స్పందించి తానూ కన్నీరు కారిస్తే సహృదయుడు. సమస్యను పరిష్కరించ డానికి తానూ ఒకడుగు ముందుకువేస్తే సామాజికుడు. సామాజిక స్పృహను సరా సరిగా మనసున్నవారు సేవించటాని కిచ్చిన సాహిత్య ప్రక్రియ భరద్వాజ పలి కించిన బాధాప్రపంచం. 52 గాథలు చెప్పినా సమాజానికి వ్యథ కలగకపోతే ఎన్ని చెప్పినా ఒక్కటే. చెప్పటం రచయిత వంతు, చేయటం సమాజం వంతు. చెప్పిన రచయితను కనీసం అభినందించటం అందరి వంతు.

ఈగాథల్లోని జహంగీరులు జగ మెరిగిన ప్రభువులు కారు. కానీ, మనమధ్య బ్రదుకుతున్న మనుషులు. వారిలో తాళాలు బాగుచేసే జహంగీరు ఒకడు. "మాకొంపకెందుకండీ తాళాలు?ఎత్తుకుపోవడాని కేం ఉంది కనుక-మా దరిద్రం తప్ప."

అని బాధగా నవ్వుతాడు. ఆ నవ్వు పతితను ఏడిపిస్తుంది. వెంటనే-'కలవారి సంపదకు కాపలాకాసే వేలాది తాళాలను బాగుచేయగల జహంగీరు పాక తలుపుకు ఓ చిన్న తాళం కప్పకూడా లేకపోవడం ఆశ్చర్యం కదూ?' అని రచయిత మనవీపుతట్టి పలకరిస్తాడు. పాత్రను ప్రశ్నార్థకంగా మనముందు నిలిపి మనల్ని ఆశ్చర్యార్థకాలుగా మార్చే మాటనేర్పరితనం రచనలో మనకు స్ఫురిస్తుంది. ఇది కొసమెరుపా? లేక కొరడాదెబ్బా? అని పతిత విస్తుపోతాడు. గాథలోని బాధను బోధగా మార్చగలగడమే కళాప్రయోజనం.

వేడితేనీరందించే జహంగీరుకు 'ఉన్నచోట నీళ్లకు చచ్చిన చావుగా ఉన్న'దన్న వార్త-వార్త యేకాదు ప్రభుత్వ సంస్థల సేవాదీక్షపై ఒక నిశిత వ్యాఖ్య. అంతేకాదు. గాథల్లోని బాధాజీవులు పలికిన మరికొన్ని వాక్యాలు వింటే సమాజ స్థితి మరీ అర్థమవుతుంది.

"కొలిమి వేడికి నెత్తురంతా ఆవిరై పోతుంది. మలాటాతో నరిచి రెక్కలు ముక్కలు చెక్కలై పోయాయి. ఇన్నేళ్లు వచ్చినా తిన్నదంతా అరుగుతుందిబాబూ: తృప్తిగా తినటానికి నాకేమీ ఉండదండి-" శ్రీరాములు.

"లేదండి... ఇక నేను చదవను. ఇంతవరకూ చదివిందే నాకు పనికిరానప్పుడు ఇంకో ఏదాది ఈ ముష్టి చదువుకోసం నేను వృధా చేయనండి-" అని జాఫరంటే-'మన విద్యావిధానం మీద ఇంతకన్నా మంచి వ్యాఖ్యానంలేదేమో'అని మనకంటే ముందు రచయితయే అని 'హ' నవిపించుకొంటాడు.

"నా రెక్కలు నాకాడే ఉండె: నాదరిద్రం నావెనకే ఉండె-" రాములు.

"ఏంచేస్తే ఏముందిలెండి. పొద్దున్న లేస్తే ఎట్లాగడుస్తుందా అన్న భయంతోనే ఛస్తున్నాను-" కాశయ్య.

"కాలేరదుపుకి పిడికెడు అన్నం పెట్టలేని సంస్కారాన్ని తగలెయ్యాలిగానీ మెచ్చుకుంటారేమిటి-" ఆనందరావ్ శామ్యూల్.

"పాతికేళ్ళకిందటి జీవితానికీ ఇప్పటి జీవితానికీ పోలికలు అసలే లేవని కాదుగానీ- మార్పులు కూడా చాలా ఉన్నాయి. అప్పటి మనుషుల్లో ఉన్న నిజాయితీ ఇప్పుడు కలికానికూడా లేదు-" చలపతిరావు.

"చదువుకొంటే పని వంటబట్టదేమోనని నాభయం-" శేషయ్య.

"ఇదివరకు రోజుల్లో తయారుచేసేవారే నేరుగా కొనుగోలుదార్లకు అమ్ముతుండేవారు. ఇప్పుడేమో మధ్యవర్తులొచ్చారు. ఈ దళారీలు పనివారికి కూలి డబ్బులిచ్చి మిగిలిన లాభాలన్నీ తామే మింగేస్తారు." భిక్షాలు.

"బానిసత్వం నుండి బయటపడ్డా బతికేమార్గం కనిపించలేదు-" యాదగిరి.

"మనిషికీ జంతువుకూ అదే తేడా. మనిషి చెప్పే దొకటీ చేసే దొకటీ బాబయ్యా! ఇదుందే, ధర్మరాజు. ఏంచెబితే అదే చేస్తుంది. ఏంకావాలో అదే చేస్తుంది. విశ్వాసం దీనిసొత్తు-" రామస్వామి.

"మీరు పెద్దవారు. అనుభవం ఉన్నవారు. నిజం చెప్పండి. తియ్యని కబుర్లతో కడుపు నిండుతుందా? నీతికీ నిజాయితీకీ స్థానముందా? మాకేమో ఒరగబెడుతున్నామంటున్నారు. పెడుతున్నారేమో నాకుతెలియదు. మీలాంటి వాళ్ళకు-మాకోసం కాగితాలమీద కేటాయించిన కోట్లరూపాయలు కనపడతాయేమో గానీ-మాకుముట్టే పైసలూ గవ్వలూ కనపడవు. అమ్మబాబోయ్! అభ్యుదయం అంటారుమీరు అసలుసంగతి నాకుతెలుసు"-సత్యారావు.

"ఏంచేస్తున్నారో, ఏంచస్తున్నారో నాకు తెలియదండి. అంతో ఇంతో చేసినా అది నాలాంటివాళ్ళదాకా రానేరాదండి. మధ్యనున్నోళ్ళు మింగడానికే సరిపోతుంది. పేరు మాది. నోరు వారిది."-గంగయ్య.

"ఏంచేస్తామయ్యగారూ! గొడ్డుచాకిరీ చేస్తున్నామా ? ముద్దకూ కరువే; ఆఖరకు మేం నేస్తున్న గుడ్డకూ కరువే"- రామస్వామి.

"కలకాలం నమ్ముకున్న పల్లెటూరు నన్ను దగాచేసింది. గంపెడన్ని ఆశలు మోసుకుంటూ వచ్చినందుకు ఈ బెజవాడ కూడా నన్ను దగా చేసింది."-బ్రహ్మానందం.

ఇవన్నీ ప్రజాసూక్తాలు; వాస్తవ జీవిత వాస్తవ దర్పణాలు. ఇవన్నీ ఒకఎత్తు రచయిత వ్యాఖ్యలు మరో ఎత్తు. మచ్చుకు:-

"ఎన్నో వేల మందికి ఎండావానల బాధ లేకుండా గొడుగుల్ని బాగుచేసి ఇస్తున్న శంకరయ్య మిటమిటలాడే ఎండకు; జోరున కురిసే వానకు; ఏచూరు చాటులనో తలదాచుకోవటం మన సమసమాజ స్థాపనకు ఒక మచ్చుతునక. (పుట 20)

"ఆ సమసమాజమో చట్టుబండలో తొందరగా రావాలి. అలా వస్తేతప్ప - ముత్యాల్లాంటి లక్షలాది పసిబిడ్డల బతుకులు ఆ గాజుముక్కల్లోంచీ బూజుగుడిసెల్లోంచీ బయటపడవు"- (పుట 38).

ఇలా ఎన్నో కనువిప్పు కలిగించే కశాఘాతాలున్నాయి. 'ఖరీదుకట్టేషరాబులేడు' అనేగాథలో రచయిత సమాజాన్ని ఇలా ప్రశ్నిస్తున్నాడు-

"ప్రతివారూ తమ శ్రమకు తగిన ప్రతిఫలం తమకు లభించడం లేదనడం నాకు తెలుసు. ఇలా అంటున్నవారు మిటమిట లాడే ఎండలో చెమటలు కక్కుకుంటూ బండరాళ్లను బద్దులుకొట్టేవారి గురించి మాట్లాడరు. కనీసం ఆలోచించనన్నా ఆలోచించరు. నిజానికి ఇలాంటి పనిచేస్తున్నవారి శ్రమకు తగిన ప్రతిఫలం లభిస్తున్నదా-అంటారు మేక్సిమ్ గోర్కీ ఒక సందర్భంలో. దీనికి మీరేంచెబుతారు?"

ఈప్రశ్న ఏ ఒక్క గాథకో సంబంధించింది కాదు. జీవనసమరానికే జీవభూతమైనటువంటిది. ఈ ప్రశ్న చుట్టూ తిరిగే రంగులరాట్నం ఈగాథాప్రపంచం.

డాక్టర్ రావూరి భరద్వాజ రచన చాలా బలమైనది. తెలుగు నుడికారం తొణికిసలాడుతూంటుంది. వృత్తికారుల ప్రవృత్తులతోబాటు పనిముట్ల పేర్లనుకూడా చెబుతున్నప్పుడు కథలో జాలువారిన వృత్తిపదకోశంలా ప్రసరణమవుతుంది. మాటకూ వ్రాతకూ అంతరాన్ని తొలగించివేసింది వారి రచన.

"One should only have the power and skill to write, there is nothing in this world that cannot serve a subject for writing" అన్న భరద్వాజగారి మాటలకు స్వయంగా ఇచ్చిన సజీవోదాహరణం 'జీవనసమరం'.

# నర్తనశాల

అవి ఇరవయ్యో శతాబ్దం మొదటి పాదాన్ని ముగించి రెండవ పాదాన్ని ముందుకు వేస్తున్నరోజులు. ఆంధ్ర నాటక రంగం వినూత్న ప్రయోగాలను ప్రసరిస్తున్న ప్రతిభోన్నిద్ర ప్రత్యూష సమయం. విషాదరూపకం విశిష్ట ప్రయోగంగా రెక్కలు విప్పి వియత్తలం మీద విహరించిన తరుణం. విశ్వనాథవారు నాటకకర్తగా తెలుగు రంగంమీద వెలుగురేకల్లాగా నాలుగు విషాదరూపకాలను వెలయించిన విశిష్ట కాలం. నర్తనశాల, అనార్కలి 1924 నాటికే వెలువడ్డాయి. వేనరాజు 1926 ప్రాంతంలో, త్రిశూలం 1933-34 ప్రాంతంలో వచ్చాయి. విషాద నాటక రచనలోని నాలుగంచులను నాణెంగా మెరిపించిన నూత్నప్రయోగాలు ఆ నాలుగూ. అందులో 'నర్తనశాల' అచ్చమైన బంగారు అంచు.

పాశ్చాత్య రూపక ప్రయోగాలలో విషాదాంత రూపకం ఉదాత్తఫణితి. విషాదాంత రూపకం వినోద రూపకం కంటె వేయిరెట్లు మిన్న. ప్లేటో కాలం నుంచి పరిణతి చెందుతూ షేక్స్పియర్ కాలంలో ప్రత్యేక ప్రతిపత్తిని సంతరించుకొన్నది. పాశ్చాత్య నాటక కర్తలలో షేక్స్పియర్ ఒక మేరు శిఖరం. ఆయన రచించిన విషాదాంత నాటకాలు ఆ ప్రక్రియకే ప్రమాణాలు కావటంతోపాటు వైవిధ్యాన్నీ, ప్రయోగసౌలభ్యాన్నీ, కవితాగాంభీర్యాన్నీ సంతరించిపెట్టాయి. పాశ్చాత్య నాటక రంగానికి ప్రాణంపోశాయి; భారతీయ రూపక ప్రయోగానికి క్రొత్తపుంతలు చూపించాయి. తెలుగులో విషాదాంతనాటక రచనకు షేక్స్పియర్ నాటకాలు కొత్తబాటలు చూపించాయి. మొదటి తరం రచయితలు కొందరు షేక్స్పియర్ నాటకాలకు అనువాదాలు సంతరించారు. వావిలాల వాసుదేవ శాస్త్రిగారు జూలియస్ సీజర్‌ను 1875లో అనువదించటంతో ఈ ఉద్యమం ప్రారంభమైంది, అయితే, పాశ్చాత్యవృత్తాలుగల షేక్స్పియర్ నాటకాలు తెలుగులో ప్రక్రియా గౌరవాన్ని పొందగలిగినా ప్రాచుర్యాన్నిమాత్రం గడించలేకపోయాయి. సంస్కృత నాటకాను వాదాలకు తెలుగులో వచ్చినంత ప్రాచుర్యం వాటికిలేదు. దానికి కారణం బహుశః

ప్రక్రియ యేదైనా నాటకానికి వస్తువు ప్రాణం. వస్తువు దేశీయం అయితే అది ప్రజాదరాన్ని చూరగొంటుందనే సత్యమే కావచ్చు. ఈ సత్యం ధర్మవరం రామకృష్ణమాచార్యులు గారి 'విషాద సారంగధరం' 1889లో వెలువడినప్పుడు అనుభవంలోకి వచ్చింది. ప్రక్రియ విషాదాంత నాటకం; వస్తువు దేశీయం. ఇది ప్రథమాంధ్ర విషాదాంత నాటకంగా విమర్శకుల మన్ననల నందుకొన్నది. దేశీవృత్తాలతో విషాదాంత నాటక రచనోద్యమానికి ఇది ఊపిరి పోసింది. తెలుగువారి హృదయాలల్లో లోతైన ముద్ర వేసిన భారత కథలో విషాదాంత నాటక నిర్మాణానికి అనువైన ఘట్టాలలో కీచకవధ ముఖ్యమైనది. నాటక కర్తల దృష్టి దానిమీద కేంద్రీకృతమైంది. చిలకమర్తి వారు 1889లో కీచకవధ నాటకాన్ని వ్రాసి, మొదటిసారి ప్రదర్శింపజేశారు. అలాగే కోలాచలం శ్రీనివాసరావుగారు 'కీచకవధ' (సైరంధ్రి) ను, నిశ్శంకల కృష్ణమూర్తిగారు 'కీచకవధ'ను వ్రాశారు.

ఇతిహాసిక వృత్తాలలోనే కాక, చారిత్రక వృత్తాలలో విషాదాంత రూపకాలను రచించే ప్రయత్నం ఇరవయ్యో శతాబ్దికి పూర్వమే సాగింది. ఈ ఉద్యమంలో వేదం వారి 'బొబ్బిలి' విషాదచ్ఛాయలు గల గొప్ప చారిత్రక నాటకం. కోలాచలం శ్రీనివాసరావుగారి రామరాజు చరిత్ర, సుల్తానా చాంద్‌బీ, శిలాదిత్య, దుప్పూరి రామిరెడ్డిగారి 'కుంభరాణా' విషాదాంత రూపకాలుగా ప్రసిద్ధి చెందిన చారిత్రక నాటకాలు. ధర్మవరంవారి సారంగధర వస్తువు, పానుగంటివారిచేత సారంగధర నాటకాన్ని, జయంతి భావనారాయణగారిచేత 'కుముద్వతీ సారంగధరము'ను, కాళ్ళకూరి వారిచేత 'చిత్రాభ్యుదయము'ను రచింపచేసినా అవి విషాదాంత నాటక మర్యాదలను పాటింప లేకపోయాయి.

ఈ పరిస్థితుల్లో విశ్వనాథ సత్యనారాయణగారు విషాదాంత నాటక రచన చేపట్టారు. ఇతిహాసంలోనుంచి, పురాణంలోనుంచి, చరిత్రలోనుంచి వస్తువులను చేపట్టి విషాదాంత నాటకాలను రచించటం విశ్వనాథ వారి ప్రత్యేకత. నర్తనశాల మహాభారతంలోని విరాటపర్వంలో ప్రసిద్ధిచెందిన కీచకవధ ఘట్టం. వేనరాజు కథ పురాణ ప్రసిద్ధం. త్రిశూలం, అనార్కలీ నాటకాలు చరిత్ర ప్రసిద్ధాలైనవి. వీందులో ఒకటి మత దృష్టి, మరొకటి ప్రేమ దృష్టి ప్రధానమైనవి కావటంచేత వైశిష్ట్యాన్ని సంతరించుకొన్నాయి. ఒక విధంగా విశ్వనాథ వారు తమకు పూర్వం విషాదాంత నాటకాలను రచించిన నాటక కర్తలు ఎన్నుకొన్న వస్తువుల స్వభావాన్ని సమీక్షించి,

